॥ శ్రీహరిః ॥

666▲

# అమూల్య సమయము దాని సదుపయోగము

अमूल्य समयका सदुपयोग ( तेलुगु )




गीताप्रेस गोरखपुर
GITA PRESS, GORAKHPUR [SINCE 1923]

గీతాప్రెస్, గోరఖ్‌పూర్

॥ శ్రీహరిః ॥

# అమూల్యసమయము దానిసదుపయోగము

अमूल्य समयका सदुपयोग (तेलुगु)

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

హిందీ మూలము :

**శ్రీ జయదయాల్ గోయందకా**

అనువాదం :

**శ్రీ బులుసు ఉదయభాస్కరము**

**గీతాప్రెస్,** గోరఖ్‌పూర్.

॥ శ్రీహరిః ॥

# నివేదన

శ్రీ జయదయాల్ గోయన్దకాగారి ప్రవచనములు - "అమూల్యసమయము దాని సదుపయోగము" ను పుస్తకరూపమున సహృదయులగు పాఠకులకు సమర్పిస్తున్నందులకు మాకెంతయో ఆనందముగ నున్నది. ఈ ప్రవచనముల సంగ్రహ మిందు ఆంధ్రీకరించి సులభశైలిలో ప్రకాశింపబడినది. ఆత్మోద్ధరణమార్గము నన్వేషించు వారికిది యెంతయో ప్రయోజనకారి మరియు నావశ్యకము నైయున్నది ఈ పుస్తకము సాధకులకు సన్మార్గదర్మకమగుననుట నిస్సందేహము.

"అమూల్యసమయము దాని సదుపయోగము" అను శీర్షిక వలననే భగవానుని జేరుటలో వివిధములగు ప్రయత్నములందు అమూల్య సమయమును వెచ్చించుటయే దాని సదుపయోగమని వ్యక్తమగుచున్నది దీని యందే మానవజీవిత సార్థకత గలదు. "భగవద్భక్తుడు వాని స్వరూప స్వభావములను" ప్రవచనమున సాధుమహాత్ముల స్వరూప లక్షణములు, వారి అనుభవముల గూర్చి విశదీకరించబడినది. భగవానుని అవ్యాజ సుహృద్భావము భగవానుని ధ్యానించు విధానము, నీతి, జ్ఞాన, భక్తి వైరాగ్యములు మరియు ఆత్మోద్ధరణ విధానము మొదలగు నెన్నియో లాభదాయకములగు విషయముల వివరణములిందు పొందు పరుపబడినవి.

నీతిజ్ఞులైనవారు దోషముల గుర్తించిన పాఠకులు, సహృదయముతో గుణదోషముల నెఱింగించిన రాబోవు సంస్కరణముల వానిని సరిచేయుదుము.

ప్రకాశకులు

# విషయ సూచిక

|| శ్రీహరిః ||

# అమూల్యసమయము దానిసదుపయోగము

అనుక్షణమూ సమయం గడిచిపోతూ ఉంటుంది. గడచిపోయిన సమయం మఱల వెనుకకు తిరిగి రాదు. గడచిపోయిన మన ఆయువును లక్షరూపాయలు వెచ్చించినా మనం వెనుకకు తీసుకొని రాలేము. సమయాన్ని బట్టి సుఖభోగాలు, విలాసాలు, కడకు భగవానుడు కూడా ప్రాప్తింపవచ్చును. కాని ఆ సమయం మాత్రం దేనిని బట్టి కూడ ప్రాప్తించదు. మానవ జన్మం మాటిమాటికీ ప్రాప్తించేది కాదు. మానవుని జీవితకాలం బహు అమూల్యమైనది. దానిని సద్వినియోగం చేసుకుంటే భగవానుని కూడ పొందవచ్చును. ఈ జీవితాన్ని ఇతరకార్యాలకు వినియోగిస్తే జన్మసార్థక్యం ప్రాప్తించదు. జన్మలక్ష్యం నెరవేరదు. కాబట్టి మన సమయాన్ని సర్వదా భగవత్ప్రాప్తి కోసమే వినియోగించుకోవాలి. కేవలమూ ఒక్క భగవత్ప్రాప్తికి సంబంధించిన సాధన విషయకంగానే తప్ప నోటితో నిరర్థక ప్రసంగాలు ఏవీ చేయరాదు. చెవులతో ఇతరవిషయాలు వినరాదు. కంటితో ఇతర దృశ్యాలను చూడరాదు. మనస్సులో ఇతర విషయాలకు చోటు ఈయరాదు. మన హృదయము భగవానుని మందిరము. ఇవి యన్ని ఆ మందిరం యొక్క ద్వారాలు. వీనిని ఎప్పుడూ భగవానుని కోసమే తెరచి ఉంచాలి. కాని యితర విషయాలకోసం తెరవరాదు. భార్య, బిడ్డలు, ఐశ్వర్యం, ధనం, శరీరం, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, జీవితము, ప్రాణము ఈ సర్వమూ భగవానుని వలననే మనకు ప్రాప్తించాయి.

వీనిని ఆ భగవానుని పొందుటకు సంబంధించిన సాధనయందే వినియోగించాలి. అప్పుడే మనకు జీవనసాఫల్యం ప్రాప్తిస్తుంది. తాను ఇచ్చిన వస్తువుకంటె అధికంగా కావాలి అని భగవానుడు మననుండి ఆశించనూ ఆశించడు. కోరనూ కోరడు. ఒకవేళ కోరినా మనం ఎక్కడ నుండి తేగలం? భగవానుడు ఏమంటున్నాడు? నాయనా! నీ అధికారంలో ఉన్నది, నీ పరిధిలో నీవు నీదిగా భావించుకొనేది ఏది. ఏది ఉన్నదో అదియంతా నాకు అర్పించు! గట్టెక్కిపోతావు అనియే కదా అంటున్నాడు.

కాబట్టి మనకు ఉన్న సర్వస్వాన్ని ఆ భగవానునకు అర్పించడమే మనం చేయవలసిన పని. అందులో ఏకొంచెం లోపం జరిగినా దానిని చక్కదిద్ది భగవానుడు తప్పక మనకార్యాన్ని నెరవేరుస్తాడు అన్నది విశ్వసనీయమైన విషయం అలాగే చేయకపోతే అపాత్రులకు, కుపాత్రులకు సైతం భగవత్ప్రాప్తి ఎలాకలుగుతుంది? వాళ్లు ఎలా ఉద్ధరింపబడతారు? ఈ విషయం మీకు బాగుగా బోధపడడంకోసం క్రింద ఒక కథను ఉదాహరిస్తున్నాం. చదివి అర్థం చేసుకోండి.

ఒక సజ్జనుడు ఉన్నాడు. అతడు ధనికుడైన ఒక సేటు దగ్గర రూ.10,000/- లు అప్పుతీసుకొని వచ్చి వ్యాపారం చేశాడు. అందులో అతనికి రూ.5,000/-లు నష్టం వచ్చింది. ఇక అతని దగ్గర రూ.5,000/-లు మాత్రమే మిగిలి ఉన్నాయి. ఈ విషయం అప్పు ఇచ్చిన ఆ సేటుకి తెలిసింది. అప్పుడు ఆ సేటు ఒక విశ్వసనీయుడైన వ్యక్తిని ఈ సజ్జనుని దగ్గరకు పంపి ఆర్యా! మీరు వచ్చిన నష్టాన్ని గూర్చి చింతించకండి. మీ దగ్గర మిగిలియున్న సొమ్మును తెచ్చి మీ బాకీ క్రింద జమకట్టివేయండి. దీనితో మీ పద్దును రద్దు చేసివేసెదను మిమ్ము ఋణవిముక్తులను చేసెదను అని అతని చేత చెప్పించెను. అప్పుడు ఆ సజ్జనుడు తన దగ్గర ఉన్న సొమ్మునంతను హృదయపూర్వకంగా తెచ్చి సేటుకి ఇచ్చివేసెను. తన ఇంటిలోను కొట్టులోను వున్న సామగ్రులను అన్నిటిని తెచ్చిసేటుకు అప్పగించెను. 5 వేల రూపాయల బాకీ చెల్లుబడియై యిక 5 వేల రూపాయల బాకీ మిగిలింది. అప్పుడు సేటు ఆ సజ్జనునితో ఆర్యా! మీ బాకీ 10 వేలు చెల్లుబడి అయినట్లు వ్రాసి మీ పద్దును రద్దు చేసేస్తున్నాను అని అన్నాడు. ఆమాటవిని సజ్జనుడు రోదనం చేస్తూ అయ్యా! సేటుగారూ! అలా మాత్రం చేయకండి. 5 వేలకు మాత్రమే చెల్లుబడి పత్రం వ్రాయండి. మిగిలిన 5 వేల బాకీ మీచేత రద్దు చేయించుకోవడం నా కోరిక కాదు. ఆ బాకీ తీరునంతవరకు మాచేత పని చేయించుకొండి. నన్ను నాభార్యను కొడుకును ఎవరికైనా అమ్మివేయండి. లేదా మాకు ఏదైనా పనియిచ్చి మా చేత పని చేయించుకోండి. భోజనాదికమునకు అయ్యే వ్యయం మినహాయించి మిగిలిన సొమ్ము అంతా మీ బాకీ క్రింద జమ చేసుకొండి. ఆ సొమ్మును ఉంచుకొని

మాత్రం మేము ఏం చేస్తాం? అని సేటును ప్రార్థించాడు. అప్పుడు సేటు 5 వేలకు చెల్లుబడి పత్రం వ్రాసి మిగిలిన 5 వేల పద్దును రద్దు చేయకుండ ఉంచివేసాడు. అంతట ఆ సజ్జనుడు అయ్యా! నాయీ 5వేల బాకీని రిజిష్టర్ చేయించేయండి. అలా చేస్తే నాదగ్గర డబ్బు ఉన్నప్పుడు నేను లేదు అని చెప్పి తప్పుకోవడానికి వీలుండదు. ఈనాడు నామనస్సు మంచిదై ఉంది రేపు అది అలా ఉండకపోవచ్చును అని కూడ ప్రార్థించేడు. అప్పుడు సేటు అయ్యా ఇంత చక్కని ఋజువర్తనం గల మీ విషయంలో మాకు చింతయేదిలేదు. మీరు ఒక పని చేయండి. మేం మీకోసం ఒక కొట్టును ప్రారంభిస్తాం. అని అంటూ ఉండగా సజ్జనుడు సేటుగారూ మీరు కొట్టు ప్రారంభిస్తారు బాగానే ఉంది కాని అందులోకూడ మళ్లీ నష్టం వస్తే అప్పుడు నేను ఏం చేయాలి? ముందే నామీద 5వేల బాకీభారం ఉంది కదా. నష్టం వస్తే ఋణభారం మరింత పెరిగిపోదా అన్నాడు. అప్పుడు సేటు అయ్యా! కొట్టు ఏర్పాటు విషయంలో నేను ఒక మాట చెపుతున్నాను వినండి. అదేమి అంటే నష్టంలో వాటాను మీరు భరించని పక్షంలో లాభంలో 4వ వంతు మీకు ఇస్తాను. నష్టంలో వాటాను భరించే పక్షంలో లాభంలో మీకు సగం, నాకు సగం. ఇప్పుడు ఏమంటారు? అన్నాడు. సరే మీ చిత్తం! అన్నాడు సజ్జనుడు. సేటు కొట్టు ప్రారంభించాడు. ఒక మనుష్యుని కూడ సహాయకునిగా సజ్జనునకు అప్పగించాడు. వ్యాపారం సాగుతోంది. అతడు, అతని భార్య, కొడుకు ఒక్కపూట మాత్రమే తిండి తింటున్నారు. అందుచేత ఖర్చు తగ్గి కొంత సొమ్ము మిగలడం మొదలు అయింది. అలా మిగిలిన ద్రవ్యాన్ని సేటు బాకీక్రింద జమచేయడం మొదలుపెట్టారు. ఈ విధంగా చేయగా చేయగా ఒకనాటికి సేటు దగ్గర మిగిలియున్న సజ్జనుని 5 వేల రూపాయల ఋణమూ పూర్తిగా తీరిపోయింది.

మరియొక వ్యక్తి ఉన్నాడు. అతడు నీతిలేనివాడు. అతడు సేటు దగ్గర అప్పుతీసుకున్నాడు. తీసుకున్న ద్రవ్యం రూ.10,000/-లు. అతని ప్రవృత్తి మంచిదికాదు. వానికి కూడ వ్యాపారంలో 5వేల రూపాయల నష్టం వాటిల్లింది. కాని అతడు తనకు పూర్తిగా 10 వేల రూపాయల నష్టం కలిగిందని చెప్పాడు. మరియొక 10వేలు మీరు పెట్టుబడి పెడితే

వ్యాపారంచేసి బహుశః ముందుతీసుకున్న మీ 10 వేల బాకీ తీర్చివేయగలుగుతాను అని అతడు సేటుతో చెప్పాడు. నీమీద నాకు నమ్మకం లేదు. అన్నాడు సేటు. మీరు ఫలానా వ్యక్తి నష్టపడితే మళ్లీ 10వేల పెట్టుబడితో వానిచేత మరలా వ్యాపారం పెట్టించారు కాదా? అన్నాడు వ్యక్తి. అతని ప్రవృత్తి బహు ఉత్తమమైనది, అన్నాడు సేటు. నాప్రవృత్తి అంతకంటెను గొప్పది అన్నాడు వ్యక్తి. నీ ప్రవృత్తి మాటలలో గొప్పది. చేతలలో హీనమైనది. అతడు తన యింటిలో ఉన్నదెల్లా తెచ్చి నాకు అప్పగించాడు. మరి నీవూ, అన్నాడుసేటు. నాకు సర్వమూ నష్టమైంది. నేను ఎక్కడనుండి తేగలను? మరి కొంత పెట్టుబడి పెట్టండి అని ప్రార్థించాడు వ్యక్తి. నీకు ఇక పెట్టుబడి పెట్టేది లేదు అని స్పష్టం చేసాడు సేటు. అతడు ఇక అతనికి ఒక్కపైస కూడ ఈయలేదు. ఇది దృష్టాంతంగా చెప్పిన కథ. నీతిలేనివాని విషయంలో చెప్పుకోవలసిన మాట ఏమంటే?

**ఆయే థే కఛు లాభ కో ఖోయ చలే సబ మూల ।**
**ఫిర జాఓగే సేఠ పా పల్లే పడేగీ ధూల ॥**

ఈ విధంగా మనం లాభంకోసం వచ్చాము. మనం ముందు తీసుకున్న ఋణద్రవ్యాన్ని సమాప్తం చేసివేసి మరల సేటు దగ్గరకు వెడుతున్నాం. అయ్యా. మరికొంత ఋణం ఇవ్వండి. ముందు తీసుకొన్నది అంతా సమాప్తం అయిపోయింది. ఈ మారు మరల ఋణం ఇస్తే ముందు తీసుకొన్నదానిని, దీనిని కూడ క్రమంగా తీర్చివేస్తాం అని అర్థిస్తున్నాం. ఆ సేటు ఒక ఒకపైస కూడ ఇచ్చేది లేదని ఖండితంగా చెపుతున్నాడు.

ఈ లోకంలో ఇతరులమీద ఆధారపడి మేమే మొనగాళ్ళం అంటూ నడుం బిగించుకొని సరదాగా వ్యయం చేస్తూ కాలం గడిపేవాళ్లే అవినీతిపరులు. అట్టి వారికి మరల ఈ లోకంలో మానవ శరీరం ప్రాప్తించడం సంభవంకాదు. మానవ శరీరమూ, మానవ జీవనమూ అనేదే అచ్చమైన ధనం. ఇలాంటి మానవ శరీరాన్ని పొంది ఎవడు తన జీవన ధనాన్ని అనగా సమయాన్ని అంతనూ నాశనం చేసుకుని యమ ధర్మరాజు కడకు పోయి అయ్యా, నాకు మరియొక్క మారు మానవశరీరాన్ని ఇవ్వండి. అని కోరుతాడో వానికి యమధర్మరాజు ఈ మాటే అంటాడు. ఏమని అంటే ఓరి మూర్ఖుడా.

నీకు ఇచ్చిన దానిని మట్టిపాలు చేశావు. నీకు సిగ్గులేదా? మళ్లీ ఏ మొగం పెట్టుకుని మానవదేహం ఇమ్మని అడుగుతున్నావు? నీకు ఇక మానవ శరీరం రాదు. ఘోరనరకయాతనలే నీకు ప్రాప్తిస్తాయి. అని ఏ మానవుడు ఈ లోకంలోనికి వచ్చి తిను, త్రాగు, అనుభవించు, సుఖించు, అనే (ఋణం కృత్వా ఘృతంపిబేత్) చార్వాక సిద్ధాంతాన్ని అనుసరిస్తాడో వానికి ఇహమునందు, పరమునందు కూడ దురవస్థయే ప్రాప్తిస్తుంది. లోకంలో ఏ మానవుడు తన లాభాన్ని మించివ్యయం చేస్తాడో వానియందు అవినీతి లక్షణాలు ఉన్నాయి అన్నమాట. ప్రాణాలు పోయినా సరే. సేటు యొక్క ద్రవ్యాన్ని వ్యయం చేయను అనే నిశ్చయం మీద నడచుకొనే వాని ప్రవృత్తి ఉత్తమమైనది. రోజుకి రూ.5/-ల మేరకు ప్రాప్తించిన ఆహారపదార్థాలతోనే తనకుటుంబాన్ని పోషించుకోవాలి. ఆ రూ.5/-లతో పని జరగకపోతే ఏమి చెయ్యాలి? అన్నది ప్రశ్న. పని జరగకపోతే ఏమి అవుతుంది. మృత్యువే కదా వచ్చేది? రానీయండి. అది కూడ ముక్తిని ఇచ్చేదే. భగవానుడు ఎవరినీ చావనీయడు అన్న విశ్వాసం కలిగి యుండాలి. ఈ సందర్భంలో ఒక ఇతిహాసం జ్ఞాపకం వస్తోంది.

ఒకప్పుడు చిత్రకూటంలో ఒక మహానుభావుడు ఉండేవాడు. ఆయన పేరు శ్రీరామనారాయణ్ జీ బ్రహ్మచారి. ఆయన నిత్యమూ భగవద్ధ్యానము భజనము చేసుకొనేవాడు. జీవననిర్వహణానికి ఆయన దగ్గర కొంత భూమి, 2 ఎడ్లు, 1 ఆవు ఉండేవి. ఆవును, ఎడ్లను పొలంలో మేపుకొనేవాడు. పొలంలో విత్తనాలు చల్లేవాడు. పంట తాను తీసుకుని మిగిలిన గడ్డి గ్రాసము పశువులకు అర్పించేవాడు. పొలంలో పండిన పంటతో తన శరీరనిర్వహణం చేసుకొనేవాడు. ఉప్పు ఇతరములైన ఆవశ్యకవస్తువులు, బట్టలు అన్నీ తన ఆహారపు పంటను అర్పించియే సమకూర్చుకొనేవాడు. ఆయన పంటను విక్రయించేవాడు కాడు. ఆయనను మహాత్ముడని తలచి ఎవడైనా ఆయనకు ఏ ఫలాదులైన కానుకగా అర్పించినా ఆయన స్వీకరించేవాడు కాడు. తన తిండికి వలయు అన్నాన్ని వండించుకొని దానితోనే కాలం గడుపుకొనేవాడు. ఎట్టి పరిస్థితిలోనూ పరుల వస్తువులను పరిగ్రహించేవాడు కాడు. అది ఆయన నియమం. మహాత్మా! ఏమి ఇచ్చినా

మీరు పుచ్చుకోరేమి? ఏ సంవత్సరం అయినా వానలు కురవక పంటలు పండకపోతే అప్పుడు ఏమి చేస్తారు? అని ఒకడు ఆయనను ప్రశ్నించాడు. నాయనా. అలా ఎన్నడూ జరగదు. వానలు కురవక పోవడం అన్న ప్రశ్నే ఉండదు. మా దగ్గర ఏవిధమైన స్టాకు, నిల్వ లేవు గదా. ఇతరుల వస్తువులను మేము పుచ్చుకోముకదా. అట్టి సందర్భంలో మాకు జన్మను ఇచ్చిన ఆ పైవానికి మమ్మే భరించడం తప్పుతుందా? అని ఆయన బదులు చెప్పాడు. ఆయన బదులు చెప్పాడు. ఆయన పొలంలో వర్షం కురుస్తూనూ ఉండేది. పంట పండుతూనూ ఉండేది. ఏ మానవుడు పూర్తిగా భగవానుని మీద ఆధారపడి ఉంటాడో వానిని గూర్చి భగవానుడు చింతిస్తూనే ఉంటాడు. వానికి కావలసిన యేర్పాట్ల భారం అంతా భగవానుడే వహిస్తాడు.

ఆ శ్రీరామనారాయణ్‌జీ బ్రహ్మచారి, గొప్పత్యాగశీలుడు, వృద్ధుడు. ఆయనను ఎందరో దర్శించారు. మేమూ చూచాము. ఎట్టి పరిస్థితిలోనూ ఏ వస్తువూ ఎవరి దగ్గరా స్వీకరించకుండా ఉండడం ఆయనకు గడి తప్పని నియమం. ఎవరైన ఆయన గుమ్మం దగ్గరకు వస్తే రా! బాబూ! వచ్చి నీవు కూడ భోజనం చెయ్యి! అనేవాడు ఆయన. వద్దు మహాత్మా. మేము భోజనానికి వస్తే మీకు సంకోచం కలుగుతుంది. మీరు సిద్ధం చేసుకున్న పదార్థం పరిమితమైనది అని వచ్చినవాడు అనేవాడు. అట్లుకాదు. మేము ఉన్నదానితోనే తృప్తి పొందుతాం అని ఆయన అనేవాడు. ఆవు ఇచ్చిన పాలను ఆయన, ఆయన సేవకులూ త్రాగేవారు. ఎవరైన వస్తే వారిని కూడ త్రాగమనేవారు. ఆ పాలతోటే పెరుగు చేసి చిలికి వెన్నతీసి నెయ్యి తయారు చేసుకొనేవారు. ఆవు పాలు ఈయని కాలంలో ఆయన నేయి సేవించేవాడు తాను, ఒక ఆవు, రెండు ఎడ్లు, ఇద్దరు పనివాండ్రు ఈ అందరి జీవనమూ ఆ పొలంలో సాగిపోతూ ఉండేది. ఎవరిదగ్గరా ఏది పుచ్చుకునే ప్రశ్న ఆయనకు లేనే లేదు. పగలు, రాత్రి భగవద్ధ్యానమూ, భజనము చేసుకోవడం, 5 లేక 6 గంటల కాలం పరుండడం మిగిలిన సమయం అంతా జపధ్యానాదులకు వినియోగించుకోవడం ఎవరైన వచ్చి ఏదైన మంచి మాటలు చెప్పండి అని కోరితే చెప్పడం, ఇది ఆయన కార్యక్రమం. ఈవిధంగా ఆయన తన జీవన నిర్వహణం సాగించేవాడు.

ఈ విధంగా ఏ మానవుడు పూర్తిగా భగవానుని మీద ఆధారపడి ఉంటాడో వానికోసం ఆవశ్యకములైన ప్రయత్నాలు అన్నీ భగవానుడు చేస్తూనే ఉంటాడు.

ముందు చెప్పిన దృష్టాంతపుగాథ యొక్క ఆంతర్యం ఇది. ఇక్కడకు వచ్చిన వారం మనం. మనకు సేటు యమధర్మరాజు. అతని దగ్గర నుండి నూరేళ్ళ ఆయువును తీసుకొని మనం ఇక్కడకు వచ్చేం. అందు 50 ఏళ్ళ ఆయువు చెల్లిపోయింది. ఆ నూరు ఏళ్ల ఆయువే 10 వేల రూపాయలు. యమధర్మరాజే సేటు. నాయనా. పోయినది ఏదో పోయింది. నీ దగ్గర ఉన్నవైన నాకు అర్పించివెయ్యి! అని అతడు ఒక మహాత్ముని చేత కబురంపాడు అన్నమాట. అప్పుడు అప్పు తీసుకున్నవాడు (మానవదేహధారి) తన దగ్గర మిగిలియున్న దానికి అతనికి అర్పించివేసాడు. తన తనువు, మనస్సు మొదలగు వస్తువులను కూడ అర్పించినాడు. ఇక్కడ యమధర్మరాజు అన్నా భగవానుడు అన్నా ఒకటే. ఇరువురూ వేరు వేరు కాదు. అందుచేత మానవదేహధారి తన సర్వస్వాన్ని భగవానునకు అర్పించివేశాడు అన్నమాట. అతడు అర్పించిన సగమును స్వీకరించి భగవానుడు అతని పద్దును రద్దు చేయబోతే అతడు అలా చేయడం నా ఉద్దేశ్యం కాదు అన్నాడు. (ఈ సంసారసముద్రం నుండి సముద్ధరించు. అదే నా పద్దును రద్దు చేయడం అని అతని భావం) భగవానుడు ఋణవిముక్తుని చేస్తానంటే అలా చేయడానికి అతడు ఒప్పుకోలేదు. తన చేత పరిశ్రమ చేయించుకొని ముక్తుని చేయవలసినది అని ప్రార్థించాడు. అప్పుడు భగవానుడు అతనిని నమ్మి పెద్ద దుకాణం ఆరంభింపజేసాడు. అంటే అతని భావాలను విస్తృతంగా లోకంలో ప్రచారం చేసేకార్యక్రమంతో ప్రవర్తిల్లచేసాడు అని భావం. నాయనా. నీకు నాలుగవ వంతు లాభం ఇస్తాను. భక్తి, జ్ఞానవైరాగ్యాలను బాగాప్రచారం చెయ్యి. అని భగవానుడు అతనితో అన్నాడు అన్నమాట అలాగే అతడు ప్రచారం చేసాడు. దానితో అతడు ఉద్ధరింపబడ్డాడు. ఈ పద్ధతి బాగున్నది అని అతడు హర్షమును పొందేడు. తక్కువ వ్యయంతో తన నిర్వహణం సాగించుకొంటూ శేషించినదెల్లా భగవానుని కోశంలో జమ చేసివేయడం మొదలుపెట్టాడు. అతనికి లాభంలోనే వాటా, నష్టంలో లేదు. ఏ మానవుడు పరోపకారాన్నే తన పరమలక్ష్యం

చేసుకొని తన జీవితాన్ని అంతనూ నిష్కామభావంతో అందుకోసమే వినియోగిస్తాడో వానికి నష్టం అన్నది కలుగనే కలుగదు.

**శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥**

(గీత 2-40)

నిష్కామకర్మను ఆరంభించడే తడవు. దానికి నాశనము అన్నది ఉండదు. అందులో పాపం ఎదురవడం అనే ప్రశ్న లేనే లేదు. నష్టం అనేది కలుగనే కలుగదు. ఏ కొంచెం నిష్కామభావాన్ని పాటించినా అది మహాభయం నుండి కాపాడుతుంది. ఇంతకు సారాంశం ఏమిటి అంటే అతని 5 వేల రూపాయల బాకీ శీఘ్రంగానే పూర్తిగా చెల్లిపోయింది. 50 ఏళ్లలో చెల్లవలసినది ఏడాదిలోపుగానే చెల్లిపోయింది. 6 మాసాలు నిల్కడగా సాధన చేస్తే చాలు భగవత్ప్రాప్తి తథ్యం. 50 ఏళ్ల వయస్సు చెల్లిపోయినా భగవానుని పొందనివారు పట్టుపట్టి సాధన చేస్తే 6 నెలల్లోనే పరమాత్మను పొందవచ్చును. ఇంతవరకు ఏ పప్పు, అన్నం తింటూ వచ్చేరో అదే ముందు కూడ తింటూ ఉండండి. అది పోను మిగిలినది ఎల్ల భగవానుని ఖజానాలో జమ చేసివెయ్యండి. నష్టం అన్న ప్రశ్న ఉండదు. వాటా లాభంలో ఉంటుంది. మీరు చేయవలసినదల్లా భగవద్గీత, రామాయణం, భాగవతం వంటి పవిత్రగ్రంథాలను భగవద్భక్తుల నడుమ ప్రచారం చేయడం. ఉపన్యాసాలద్వారా, పుస్తకాల ద్వారా భగవానుని భావాలను, గుణాలను, చరిత్రలను, నామరూపాదులను బహుళంగా ప్రచారంచేయాలి. అందుకోసమే సమయాన్ని అంతను వినియోగించాలి. వినేవాడు లభించని కాలంలో భగవన్నామజపమూ, ధ్యానమూ చేసుకుంటూ ఉండాలి. జీవితాన్ని నవవిధ భక్తిమార్గాలకూ అంకితం చేసుకోవాలి. ఒక్కక్షణం కడ నిరర్థకం చేయరాదు. 5 లేక 6 గంట కాలము నిద్రకూ, శౌచ, స్నాన, భోజనాదికానికి కొంత సమయమూ ఎట్లనూ వినియోగింపక తప్పదు. అలాకానినాడు మానవుడు జీవించేది ఎలాగ? కాబట్టి జీవన నిర్వహణకోసం అన్నపానాలు, నిద్ర ఆవశ్యకములైనవి. శరీరనిర్వహణ సంబంధమైన కర్మ చేస్తూ ఉన్ననూ మానవుడు పాపమును పొందడు.

"శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్"

శ్రీకృష్ణభగవానుడు భగవద్గీత నాలుగవ అధ్యాయం 21వ శ్లోకంలో ఇలా అన్నాడు - "నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః" నిరాశీః అనగా ఆశలేకుండ, కోరిక లేకుండ, అంటే నిష్కామభావంతో ప్రవర్తిల్లేవాడు ఏమి పని చేసినా, లోకంలో భగవద్భావాలను ప్రచారం చేసినా అందుకు ప్రతిగా తాను ఏదీ పొందగోరడు. పొందడు. ఎవడు నిష్కామభావం కలవాడు, మనస్సు, బుద్ధి ఇంద్రియాలను జయించినవాడు, భౌతిక విషయ భోగవాసనలనుండి చిత్తవృత్తులను మరలించుకొని తన అదుపులో ఉంచుకొన్నవాడు, సర్వత్రా మనోనిగ్రహం పాటించేవాడు, కలియోగంజియో ఒక్కపూట ఏమి లభిస్తే దానితో తృప్తిపొంది ఒక్కపూట మాత్రమే భుజించేవాడు, ఇంద్రియాలను వాని విషయములందు ప్రవర్తల్లనీయనివాడు, పరిగ్రహము, సంగ్రహణము (కూడబెట్టుట)లకు దూరంగా ఉండేవాడునూ, భగవదనుగ్రహాన్నే ప్రధానంగా ఎంచుకొన్నవాడూ అయి చరిస్తాడో అట్టివాడు తన సర్వస్వాన్ని భగవానునకు అర్పించినవాడు అవుతాడు. 50 ఏళ్ల వయస్సు వ్యర్థంగా గడచిపోయినా మిగిలిన కాలాన్ని అంతనూ భగవానుని చరణాలమీద సమర్పించుకొన్నవాడు అవుతాడు. పాత్రలు, బట్టలు, బంగారం, వంటి వస్తువులు తన యింటిలో ఏవి యున్నా వానిని అన్నిటినీ తనవిగాకాక భగవానునివిగా అతడు భావించుకుంటాడు. తనదిగా ఏదీ తన దగ్గర ఉంచుకోడు. కడకు బిడ్డలయందు తన తనువునందు, ధనమునందు కూడ మమకారం లేకుండ చరిస్తాడు. తనలో ఉన్న తేజము, బలము, బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు వంటి వానిని అన్నిటినీ భగవదర్పణం చేసివేస్తాడు. అతడు భగవానునితో దేవా! ఈ వస్తువులు అన్నీ మీవి. నావి కావు అని అంటాడు. ఈవిధంగా తనవి అనబడేవానిని అన్నిటిని భగవదర్పణం చేసివేసిన తరవాత తాను భగవానునకు ఋణపడియున్నవాడును అని భావించుకుంటూ అర్పించివేసినవాని రక్షణ మాత్రం చేస్తూ ఉంటాడు.

కావలివాడు ధనానికి రక్షకుడు మాత్రమే అవుతాడు. కాని హక్కుదారుకాడు. అలాగే మన యీ శరీరానికి కూడ మనం రక్షకులం మాత్రమే, కాని హక్కుదారులం కాము. ఈ యింటిలో ఉంటూ మనం ఇది సురక్షితంగా ఉండే విధంగా దీనిని కాపాడుతూ ఉండాలి.

మన జీవితం ధన్యం కావాలి అనుకుంటే మనం ఇలా చేస్తూ ఉండాలి. ఎలాగ అంటే మనం నిత్యమూ భగవన్నామజపమూ, స్వరూపధ్యానమూ, పూజనమూ, పాదసేవనమూ చేస్తూ ఉండాలి. భగవానుని పలుకులను ఆలకిస్తూ ఉండాలి. ఆయనకు ప్రణమిల్లుతూ ఉండాలి. ఆయనను ప్రభువుగాను, తనను సేవకునికాను ఎంచుకోవాలి. ఆ స్వామి తనను సఖునిగా భావించుకుంటాడు. కాబట్టి మనం కూడ స్నేహభావం పెట్టుకోవచ్చును, మనం ఆ భావానికి అర్హులంకాము అనుకొండి. అయినా, మన దగ్గర పెట్టుబడి లేకపోయినా భగవానుడు మనలను తన మిత్రుడిగా భావించి నాలుగవ వంతు వాటా లాభం ఏర్పరచి మనకు నష్టం కలగకుండా ఉండేవిధంగా మనచేత వ్యాపారం చేయిస్తూ ఉంటాడు. అందుచేత మనకు లాభం కలిగి తీరుతుంది. ఈ విధంగా మానవుడు నిష్కామభావంతో ఏ కొంచెంపని చేసినా అతనికి శుభం చేకూరుతుంది. మనం ఎప్పుడూ మన సర్వాన్ని భగవానునకు అర్పించివేస్తూ ఉండాలి. మనలో ఉన్న బలమునూ, బుద్ధినీ అర్పించివేయటంతోపాటు శక్తివంచనలేకుండ భగవత్ప్రాప్తికోసం భగవదాజ్ఞానుసారంగా ప్రయత్నం చేస్తూ ఉండాలి. అందుకోసం శక్తిని అంతనూ వినియోగించాలి. మన సమయాన్ని అంతనూ భగవదర్పణం చేసివేయాలి. భగవానుని గుణప్రభావాలను అనుక్షణము తలపోసి ముగ్ధమవడం బుద్ధి యొక్కపని. పైగా మన ప్రభువైన భగవానుడు కూడ ఎంతయో కరుణామయుడు. మన తలపై ఋణభారం ఉన్నదని తలచి మనమీద జాలి వహించి తగిన విధంగా మనకు తన సహాయసహకారాలను అందించి మనలను ఋణవిముక్తులను గావిస్తాడు. ఆయన యొక్క ఋణం నుండి విముక్తి పొందడానికి వీలుగా మన దగ్గర మూలధనమూ, పెట్టుబడి ఏదీ లేవు గదా. అందుచేత ఆ భగవానుడే మనకు సాయం చెయ్యాలి, చేస్తాడు. భగవానుని నామాన్ని జపించడమూ, పరులచేత జపం చేయించడమూ, ధ్యానపూజాదికాలు చేయించడమూ, ఇది మనం చేయవలసిన వ్యాపారం ఇది అంతా భగవానుని పేరుమీదుగానే జరుగుతుంది. ఈ విధంగా భగవానుడు తన దుకాణమును మనకు అప్పగించేడు అన్నమాటను మనం మరచిపోకూడదు.

అవినీతిపరుడైన మరియొక వ్యక్తి వచ్చి అయ్యా. వీనికి మీ దుకాణమప్పగించి సాయపడ్డారు కదా. అలాగే నాకూ అప్పగించండి. నేనూ మీ ఋణం తీర్చుకుంటాను. అని భగవానునితో అంటాడు. నీవు నీతిమాలిన వాడవు. నీకు దుకాణమూ ఇచ్చేది లేదు అని భగవానుడు అంటాడు. మీరు దుకాణమునీయకపోతే నేను స్వయంగానే స్థాపిస్తాను అంటాడు ఆ వ్యక్తి. అతడు దుకాణము స్థాపిస్తాడు దానిని భగవానుని పేరనే ప్రకటిస్తాడు. భగవానుని దుకాణము అంటాడు జపమాల చేత బట్టి 'రాం రాం' అంటూ ఉంటాడు. ఈ దుకాణము హరినారాయణునిది అంటాడు. ఇక్కడ మీరు ఏమి చేస్తున్నారు? అంటారు జనులు. నేను భగవానుని గుమాస్తాను. ఈ దుకాణం భగవానునిది. నేను భగవానుని మీదనే ఆధారపడి ఉండేవాడను. అని అతడు బదులు చెపుతాడు. తాను భగవద్భక్తుడనని నమ్మ బలికి జనులను వంచించడం మొదలుపెడతాడు. నిరంతరం జపం చేసుకుంటూ ఉంటాడు. భగవద్భజనం చేసుకుంటూ ఉంటాడు. ఇతడు బహు ఉత్తముడు అని జనులు అతనిని నమ్ముతారు. సొమ్ములు తెచ్చి అతని దగ్గర జమచేయడం మొదలుపెడతారు. అతడు తాను ధర్మాత్ముడనని.భగవానుని భక్తుడనని ప్రజలను నమ్మిస్తూ ఉంటాడు. ఈ విధంగా లోకంలో ఒక విధమైన కృత్రిమ ప్రసిద్ధిని సాధించి దాని చాటున, సత్సంగం చాటున తాను ఒక సత్సంగిని అని, భగవద్భక్తుడనని చెపుతూ జనులను వంచించేవాడు భయంకర నరకాల పాలవుతూ ఉంటాడు. అట్టి వంచక శిఖామణులను, ధూర్తులను భగవానుడు కఠినంగా దండిస్తాడు. నిజమైన భక్తులను అతడు ఉద్ధరిస్తాడు. కాబట్టి మన నిజమైన భక్తుల జీవనవిధానాన్నే అనుసరించాలి. అలా చేస్తే అనతికాలమందు మనం శ్రేయస్సును పొందగలుగుతాము. గీతలో కూడ -

**శ్లో॥ నేహాభిక్రమనాశో஽స్తి ప్రత్యవాయో న విద్యతే ।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥**

(గీత2-40)

స్వచ్ఛమైన హృదయంతో తనను, తన సర్వస్వాన్ని భగవదర్పణం గావించుకొన్న మనుజుడు అనతికాలమందే ఉద్ధరింపబడతాడు. అలాంటివాడు

ఈ వస్తువులు అన్ని భగవానునివి. నేను కూడ భగవానుని వాడనే. భగవానుడు నావాడు అని మనసారా భావించుకుంటాడు. తన అధికారంలో ఉన్న భార్య, బిడ్డలు, రూపాయలు, ధనము, ఐశ్వర్యము, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, శరీరమందు ఉన్న శక్తి, సామర్థ్యము సర్వమును భగవానునకు అర్పణంచేసి అతనికోసమే వినియోగించడం మొదలుపెడితే జరిగే పనులన్నీ భగవానునికోసమే జరగడం మొదలు అవుతుంది. నిజం చెప్పాలి అంటే అలాంటి భక్తుడే నిజమైన భక్తుడు. భగవానుడు నిజమైన భక్తులను గుర్తించి వారిని తప్పక ఉద్ధరిస్తాడు. ఒక మనుష్యుడు నిష్కామభావంతో కర్మచేస్తే ఆ క్రియకు నాశం అనేది ఉండదు. అది సుస్థిరమైనది అవుతుంది. దానికి విపరీత పరిణామం గాని, దానివలన నష్టంకాని ఎన్నడూ సంభవించదు. ఈ పని నీవే చేయాలి అని అతని మీద ఎవరూ బాధ్యతనూ నిలుపరు. అతడు చేసేపని యెప్పుడూ విలువగలదే అవుతుంది. ఈవిధంగా నిష్కామకర్మ ఏ కొంచెం చేసినా అది మహాభయం నుండి రక్షిస్తుంది. అంటే అతడు సర్వవిధములైన ఋణాలనుండి విముక్తుడై భగవానుని బడయగలుగుతాడు. ఈ విధంగా చేస్తే 50 ఏళ్లలో సిద్ధించని కార్యం 6మాసాలలోనే సిద్ధిస్తుంది.

సాధన చేసేవాడు ప్రతిదినమూ ప్రాతఃకాలమున 4 గంటలకు మేల్కొని శౌచస్నానాదికం నిర్వర్తించుకోవాలి. యజ్ఞోపవితియై ఏకాంతంలో సంధ్యావందనము, గాయత్రిమంత్రమూ చేయాలి. యజ్ఞోపవీతధారులు కానివారు అనగా స్త్రీలు, శూద్రులూ అయినవారు భగవానుని నామాన్ని జపించుకోవాలి. భగవత్స్వరూపాన్ని ధ్యానం చేయాలి. భగవానుని మానసికపూజ చేసుకోవాలి. భగవద్గీతనూ, రామాయణాన్ని, అర్థయుక్తంగా పఠనం చేయాలి. వ్యవహారకాలంలో అందరియందూ భగవద్భావం కలిగి ఉంటూ అందరకు సేవ చేస్తూ ఉండాలి. ఈ సాధన ఉన్నతశ్రేణికి చెందినసాధన, భగవత్ప్రేమలో మునిగి ఉంటూ శ్రద్ధావిశ్వాసపూర్వకంగా, గుప్తంగా, మానసికంగా నామజపం చేసుకుంటూ ఉండాలి. దానితో పాటు భగవానుని ధ్యానము, భగవానుని గుణ, ప్రభావ, తత్త్వం, స్వరూపాదుల చింతనం చేయాలి. భగవానుని ఈవిధంగా స్తుతించాలి.

"దేవా! బ్రహ్మ, విష్ణువు, శివుడు, సూర్యుడు, నక్షత్రాలు మొదలైనవి అన్నీ మీ స్వరూపాలే. పరబ్రహ్మ, పరమధామము, అని పిలువబడేది మీరే. మీరు పరమపవిత్రులు. శాశ్వతులు. అవినాశనులు. సర్వవ్యాపకులు. స్వామీ! నేను సర్వసాధనహీనుడను. నేను మహాపరాధము చేసినవాడను. నేను మీ ఋణం నుండి విముక్తిని పొందాలనే కోరుతున్నాను. ప్రయత్నిస్తూ ఉన్నాను. అయినా మీరు నాయందు విశేషం అయిన దయను చూపుతున్నారు. నన్ను నమ్మి నాకు పరమహితమును కలిగిస్తూ ఉన్నారు. నావలన ఏ కొంచెం సాధన జరుగుతూ ఉన్నా అది అంతా మీ దయ వలననే జరుగుతుంది. మీరేనాకు ఊరట గలిగించి ధైర్యం కలిగించి నాచేత సాధన చేయిస్తూ ఉన్నారు. నిత్యమూ నిరంతరంగా మిమ్మ భజించుకుంటూ ఉండాలని, ధ్యానించుకుంటూ ఉండాలని, మీ ఋణం నుండి విముక్తి పొందాలనీ కోరుకొంటున్నాను. నాలో ఎప్పుడూ మీ మీద ప్రేమ భావం, పరమశ్రద్ధ ఉండే విధంగా నన్ను అనుగ్రహించండి."

ఇలా భగవానుని ప్రార్థిస్తూ ఉండాలి. ఇదే మనకు నిజమైన ధనం, భగవానుని పని చేయడం, సర్వమూ భగవానునకు అర్పించివేయడం. ఇదే జన్మసార్థక్యహేతువు. లోకంలో భగవద్భక్తినీ, భగవానుని గుణప్రభావ తత్త్వాలనూ విశేషంగా ప్రచారం చేయాలి. భగవానుని స్వరూపాన్ని తలపోసి ముగ్ధులం అవుతూ ఉండాలి. భగవానుని సేవించేవేళ అతని నామరూపాలను విస్మరించకుండా ఉండాలి. ఇతరుల సేవయే భగవత్సేవ అనుకోవాలి. భగవానుని ఆజ్ఞానుసారంగా తనువు, మనము, ధనమునూ అర్పించి నిష్కామభావంతో ఎల్లరకూ సేవ చేయడమే భగవానుని సేవ చేయడం అన్నమాట.

రాత్రి ఆరు గంటల నిద్రకు ఉపక్రమించే ముందు నిత్యమూ భగవానుని నామాన్ని. రూపాన్ని స్మరించుకుంటూ శ్రద్ధాభక్తులతోడ స్తుతిప్రార్థన చేసుకుంటూ శయనించాలి. అలా చేస్తూ ఉంటే 50 ఏళ్ళలో నెరవేరనిది 6 నెలల్లోనే నెఱవేరగలదు. అట్టివానిని ఋణవిముక్తుని గావించుటకు స్వయంగా భగవానుడు కూడ సహకరిస్తాడు. 'యోగక్షేమం

వహామ్యహమ్' (గీత 9-22) అని, అంటే అనన్యభావంతో తననునిత్యమూ స్మరించేవారి యొక్క యోగక్షేమాన్ని తాను స్వయంగా వహిస్తానని భగవానుడు ప్రతిజ్ఞకూడ చేసియున్నాడు. తాను ప్రాప్తించడంలో కలిగేలోపాలను తాను సవరిస్తానని, సాధకుడు గమ్యంలో ఎంతవరకు చేరితే అంతవరకు వానిని రక్షిస్తూ ఉంటానని కూడ చెప్పియున్నాడు.

ఇప్పటి విషయంలో మీకు రెండు దృష్టాంతములు చెప్పియున్నాము, ఒకటి - ఉత్తమసాధకుని దృష్టాంతము. రెండు - డాంబిక సాధకుని దృష్టాంతము. లోకంలో భగవన్నామాన్ని సత్సంగాన్ని అడ్డుపెట్టుకొని దంభవర్తనం సాగించేవారు సత్సంగులుగా ఎన్నబడుతూ ఆ సత్సంగం వలన ముక్తిని, ధనాన్ని రెంటినీ కోరుతూ ఉంటారు. ఇలాంటి వారికి ముక్తి లభించదు సరికదా. ఘోరమైన దండనం ప్రాప్తిస్తుంది. ఇక రెండవ ఉత్తమసాధకుడు ఉన్నాడు. అతనికి ఇహమందూ ఆనందమే పరమందూ ఆనందమే. సర్వవిధాల భగవానుడు అతనిని విశ్వసిస్తాడు. అక్కున చేర్చుకుంటాడు. అతని యోగక్షేమం వహిస్తాడు. అతనిని సంసారసాగరం నుండి తరింపజేస్తాడు. తనను పొందడంలో సహకరించే సద్బుద్ధిని అతనికి ప్రసాదిస్తాడు. అతనిని పితౄణమూ, ఋషిఋణమూ, దేవఋణమూ ఆదిగా సమస్తమైన ఋణాలనుండి విముక్తుని చేస్తాడు. పితరులను ఉద్ధరించాడు అంటే మానవుడు సమస్త భూమండలమును దానమును చేసినట్లే. ఎల్లవారికీ సేవ చేస్తాడు అంటే సమస్త భూతప్రాణిబంధాలనుండి అతడు ముక్తుడు అయినట్లే. భగవానుని దయవలన మానవుడు అహంకారమమకారాలను విడనాడి తన జీవితము, తనువు, మనము, ధనము, సర్వమూ భగవానుని వస్తువులుగా భావించి ఆ స్వామికి అర్పించివేస్తే అంతకుముందు నిరర్థకంగా కాలాన్ని అంతనూ వెళ్లబుచ్చడం మూలంగా తనమీద నిలిచిపోయిన ఋణభారం నుండి, విశృంఖలంగా అంతవరకు ప్రవర్తించడం రూపంతో తాను చేసిన అపరాధం నుండి విముక్తుడు అయిపోతాడు. అల్పకాలంలో మేలును చేకూర్చు కొన్నవాడు అవుతాడు. ఇక అతని జీవితంలో శేషించిన కాలాన్ని గూర్చి భగవానుడు గీతలో -

**శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥**

(గీత 18-69)

అన్నాడు అనగా ఏ పురుషుడు ధర్మమయంబైన మన యిరువురి సంభాషణా రూప గీతాశాస్త్రంబును చదువునో వానిచే నేను జ్ఞానయజ్ఞంబుచే వాడనౌదును. ఇదియే నా నిశ్చితాభిప్రాయము. అని భావం. కాబట్టి అలాంటివాడు భగవానుని ప్రియతమ భక్తుడు అన్నమాట. అలాంటి భక్తుడు శేషజీవితం అంతా నవ్వుతూ, ఆనందంతో చిందులుత్రొక్కుతు హాయిగా పాటలు పాడుకుంటూ ముగ్ధుడు అవుతూ ఉండాలి. అతనిని చూచి భగవానుడు ముగ్ధుడు అవుతు ఉంటాడు. ఆ భగవానుని లీలలను చూచి చూచి ముగ్ధుడు అవుతూ ఆహా! భగవానుడు ఎంత దయామయుడు? సహాయం అందించి 6 మాసాలలోనే నన్ను కృతకృత్యుని గావించినాడు కదా. అని ప్రశంసించడం మొదలు పెడతాడు. నిజం ఆలోచిస్తే భగవానుని ఋణం నుండి ఆ స్వామియొక్క సహకారం లేకుండా విడుదల పొందడం సాధ్య విషయం కాదు. కార్యసిద్ధి అయిన తరువాత భక్తుడు భగవానునివంకకు చూస్తూ ఆనందాన్ని పొందుతూ ఉంటాడు. భగవానుడు అతని పనులను చూచి తాను ముగ్ధుడు అవుతూ ఉంటాడు. ఇది అంతా భగవానుని కృపవలననే జరిగింది. అన్ని విషయాలను భగవానుడే చక్కజేసాడు అని తలచుకొని తలచుకొని భక్తుడు మురిసిపోతూ ఉంటాడు. భగవత్ప్రాప్తిని గన్న భక్తుని లీలా చరిత్రలను చూచి భగవానుడు దరహాసం చేస్తూ ముగ్ధుడు అవుతూ ఉంటాడు. భక్తుని ముగ్ధుని గావించడమే భగవానుని లీలల లక్ష్యం. ఏమి జరిగినా భగవానుని లీలయే జరుగుతోంది అనుకోవడం భక్తుని దృక్పథం. భగనానుడు అందరి హృదయాలలోనూ విరాజిల్లుతూ వారిని ప్రత్యక్షంగా చూస్తూనే ఉంటాయి. భగవానుని చేష్టలు భక్తుని కోసం, భక్తుని చేష్టలు భగవానుని కోసం, ఇరువురి చేష్టలూ ఒకరిని ఒకరు ఆనందపరచుకొనడం కోసము, ఒకరిమీద ఒకరికి ప్రేమ, ఆత్మీయత పెంపొందడం కోసమూ, సాగుతూ ఉంటాడు. భగవానుని చేష్టలు ఒకరిని ఒకరు ఆనందపరచుకొనడం కోసము, ఒకరిమీద ఒకరికి ప్రేమ,

ఆత్మీయత పెంపొందడం కోసమూ, సాగుతూ ఉంటాయి. లేదా ఇలా కూడ అనుకోవచ్చు. ఎలా అంటే ప్రేమ అనేది అక్కడా పూర్ణంగానే ఉంది. ఇక్కడా పూర్ణంగానే ఉంది. భగవానుని విషయంలోనూ లోపంలేదు. భక్తుని విషయంలోనూ లోపంలేదు. అచ్చమైన భగవద్భక్తుడు భూమిమీద బ్రతికియున్నంత కాలమూ ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ నవ్విస్తూ భగవద్భావాలను పదుగుర నడుమ ప్రచారం చేస్తూ ఉంటాడు. అలాంటి సజ్జనుల సాంగత్యంలో పాల్గొనడం నిజంగా మనకు పరమానందహేతువు. ఈ సత్సంగాన్ని గూర్చి తులసీదాసు ఏమన్నాడో చూడండి-

**తాత స్వర్గ అపబర్గ సుఖ ధరియ తులా ఏక అంగ ।**
**తూల న తాహి సకల మిలి జో సుఖ లవ సతసంగ ॥**

(రామ చరిత మానస- సుందర - 4దో)

నాయనా! స్వర్గమోక్షాదిసుఖాలను అన్నిటినీ త్రాసులో ఒక్కదిక్కున, కేవలమూ ఒక్క క్షణకాలపు సత్సంగం వలన కలిగిన సుఖాన్ని మరియొక్క దిక్కున ఉంచి తూకంవేస్తే ఎన్ని సుఖాలు ఏకమై చేరినా సత్సంగ సౌఖ్యానికి సాటి రావు. అని తాత్పర్యం. కాబట్టి స్వర్గం అనేది అచ్చమైన భక్తుని దృష్టిలో ఏ పరిగణనలోనికి రానేరాదు. ఇక మోక్షసుఖం అంటారా? దానిని అతడే ఇతరులకు ఈయగలడు. ఆ భక్తుడు బ్రతికియున్నా ముక్తుడే. అంటే జీవన్ముక్తుడు అన్నమాట. అతని జీవితం ఒక విధంగా అలౌకికమైనది. అతని సాహచర్యలో ఉన్నవారు అందరూ కూడ ఆనందం పొందుతూ ఉంటారు. నిజమైన భక్తుడు నిరంతరము భగవానుని చర్చ జరుగుతూ ఉండాలని, అందులోనే తన జీవితం సాగిపోతు ఉండాలనీ కోరుకొంటాడు. అతడు వేరుగా భోగాలను కాని, మోక్షాన్ని కాని కోరడు. కారణం ఏమంటే అతడు పొందే ఆనందంతో ఇవి సాటి వచ్చేవికాదు. అక్కడ లజ్జలేదు, స్తుతిలేదు, ప్రార్థనలేదు, వీటికి అన్నిటికి అతడు అతీతుడై ఉంటాడు. అతని పరిస్థితి ఒక విధంగా అలౌకికమైనదిగా పరాయితం అయిపోతుంది. ఇందు కోసం మానవజన్మ అనే విషయం గుర్తుంచుకొని మనం మన సమయాన్ని ధన్యం చేసుకోవాలి అన్నది సారాంశంగా చెపుతూ ఉన్నమాట.

# భగవద్భక్తునిస్వరూపస్వభావాలు

మహాత్ములు చెప్పిన విధంగా జీవితాన్ని మలచుకోవాలి. అనేది మంచి మాటే కాని మనం అంతకంటె ఒక్క అడుగు ముందుకు వెళ్లి భగవానుడు చెప్పిన విధంగా జీవితాన్ని మలచుకోవడం సర్వశ్రేష్ఠమైనది. కారణం ఏమంటే మహాత్ములకంటె పరమాత్మ అధికుడు. కాబట్టి మనం మన జీవితాన్ని భగవానుని వచనానుసారంగానే మలచుకోవాలి. గీత సాక్షాత్తూ భగవానుని మంచి మాటలమూట. అందులో భగవానుని ఉపదేశాలు ఉన్నాయి. విశ్వాసం ఉంది. హృదయం ఉంది. అది భగవానుని వాఙ్మయస్వరూపం అన్నమాట కాబట్టి మనం మన జీవితాన్ని గీతామయం చేసుకోవాలి. అయితే వక్త (చెప్పేవాడు) ఎవడు? ఎలాంటి వాడు? శ్రోత ఎవడు? ఎలాటివాడు అన్నది ప్రశ్న. ఈ యిరువురి విషయంలోను లౌకికంగాను, ఆధ్మాత్మికంగాను కూడ సరిపడి ఉండే కథ ఒకటి మహాభారతంలో ఉంది ఎలాగ అంటే -

పూర్వం తులాధారుడు అనే వైశ్యుడు ఒకడు ఉండేవాడు. అతని దగ్గరకు ఒకనాడు జాజలి అనే ఋషి ఒకడు వచ్చాడు. అతడు సముద్రతీరాన తీవ్రమైన తపస్సు చేసినవాడు. తపస్సు చేస్తూ ఉన్నకాలంలో అతని తలమీద పక్షులు గూడు కట్టుకున్నాయి. అయినా అతడు తలను విదిలించలేదు. చలనం లేకుండా మ్రోడువలె అలాగే ఉండిపోయాడు. శౌచాది విధులను కూడ మానివేసాడు. అన్నపానాలు, నిద్ర కూడ విసర్జించి చెట్టువలె స్థిరంగా ఉండిపోయాడు. పక్షిపిల్లలు గ్రుడ్లు పెట్టిన తరువాత మొదటి పక్షులు ఎగసిపోయినవి. మిగిలియున్న పక్షుల జంట చాలకాలం ఆ గూటిలోనే నివసించింది. ప్రతిదినము తెల్లవారగానే అవి మేతలకోసం బయటకు పోయి రాత్రికి మరలా ఆ గూటికి చేరుతూ ఉండేవి.

ఇలా ఉండగా ఒకప్పుడు బయటకు పోయిన ఆ పక్షులు ఒక నెలవరకు వెనుకకు మరలి రాలేదు. అప్పుడు జాజలి ఆ పక్షులు వేరొక చోట గూడు నిర్మించుకుని ఉంటాయి. అందు చేతనే అవి మరలి రాలేదు అని అనుకున్నాడు. అప్పుడు అతడు తన తలమీద ఉన్న బరువును

తొలగించుకున్నాడు అనంతరం నావలె ఇంత తీవ్రమైన తపస్సు చేసినవాడు మరియొకడులేడు. నేను గొప్పవాడను అనే అహంకారం అతనిలో ఉదయించింది. అప్పుడు అతనికి ఓయి జాజలీ! అంతగా అహంకరించకు! తులాధారుడు అనే వైశ్యుడు ఒకడు ఉన్నాడు. అతడు తీవ్రమైన తపస్సు చేసినవాడు. అతని తపస్సు ముందు నీ తపస్సు ఏమియును గాదు. అని ఆకాశవాణి వినవచ్చింది. అంతట సరియే. ఆ తులాధారుడు ఎవడో చూద్దాం అనుకున్నాడు జాజలి. వీరిని, వారిని అడిగి అతని ఉనికి తెలుసుకొని అతడు ఉన్నచోటికి వచ్చిచూచాడు. అప్పుడు తులాధారుడు దుకాణంలో కూర్చుండి పప్పు, ఉప్పు, పంచదార, నెయ్యి, పిండి మొదలైన ఆహారపదార్థాలు అమ్ముతూ ఉన్నాడు. దానితోపాటు రసాన్ని కూడ (పాదరసం) అమ్ముతున్నాడు. మద్యము, లక్కమాత్రం అతడు అమ్మే వస్తువులలో లేవు. ఆ వ్యాపారం తీరును జాజలి చూచాడు. ఆకాశవాణి చెప్పినంత మహత్త్వం ఇక్కడ ఏమి కనిపించడంలేదు. నేను పొరపడ్డాను అనుకున్నాడు. వెంటనే వెనుతిరిగి పోవడం మొదలుపెట్టాడు. అలా అతడు వెళ్ళిపోతూ ఉండగా చూచి తులాధారుడు తాను ఉన్న చోటునుండి లేచి అతనికి ఎదురుగా వచ్చి నమస్కరించి అయ్యా! మీకు ఆకాశవాణి తెలియజెప్పిన తులాధారవైశ్యుడను నేను అని అన్నాడు. ఆ మాట విని నావిషయం ఇతనికి ఎలా తెలిసింది? అని జాజలి ఆశ్చర్యపోయాడు. ఓయి వైశ్యవరేణ్యా! రసాన్ని, ఇతరవస్తువులను క్రయవిక్రయంబు చేస్తూ కాలంగడిపే నీకు ఇంత జ్ఞానం ఎలా కలిగింది? అని అతనిని ప్రశ్నించాడు మహాత్మా. నేను సత్యం పలుకుతాను. అందరితోను సమబుద్ధి కలిగి వ్యవహరిస్తాను. తెలివి గలవాడు కాని, తెలివి లేనివాడు కాని, చిన్న పిల్లవాడు కాని, యువకుడు కాని యెవరు వచ్చినా అందరియెడల సమబుద్ధితో వ్యవహరిస్తాను. అంతేకాదు నింద, స్తుతి, సుఖము, దుఃఖము, గౌరవము, అగౌరవము అన్నిటిని నేను సమానంగా స్వీకరిస్తాను. భగవద్గీతలో చెప్పబడిన గుణాతీతుని లక్షణాలను, భక్తుల లక్షణాలను నాలో నిలుపుకొంటాను. ఆ కారణంగానే నాకు ఇట్టి జ్ఞానం కలిగింది. అని అతడు బదులు చెప్పాడు. అతడు క్రయవిక్రయాలను త్యాగపూర్వకంగా సాగించేవాడు. అతని ప్రతిచర్యకు జగత్కల్యాణం

పరమలక్ష్యం. స్వార్థానికిలోనై రూపాయలను కూడబెట్టడం అతని లక్ష్యం కాదు. అతని మాటలు విని జాజలి ఓయీ! నీవు మాటలు పెద్దపెద్దవే చెప్పుతున్నావు. కాని నీవు చేస్తూ ఉన్న పని నీచమైనది అన్నాడు. మీరు నేను చేసే పనివంకకు చూస్తున్నారా? కాని ప్రస్తుతం బ్రాహ్మణులు తాము ఆచరింపవలసిన యజ్ఞాలను మాని క్షత్రియులు చేసే యజ్ఞాలను ఆచరిస్తున్నారు. ధనం కూడబెట్టడం ప్రధానంగా పెట్టుకొన్న కొందరు జనులు, నాస్తికులును వేదవచనాల భావం తెలియక సత్యంగా తోచే మిధ్యాయజ్ఞాలను ప్రచారం చేసారు. పశుహింసతో కూడిన యజ్ఞాలనే వారు తమ పరిగణనలోనికి తీసుకున్నారు. ఆ యజ్ఞాలు వేదవిరుద్ధమైనవి. పశువులను చంపాలి అని వేదంలో ఎక్కడా చెప్పబడలేదు. బ్రాహ్మణులే ఆ భావాన్ని ప్రచారం చేసారు, అన్నాడు తులాధారుడు. అనంతరం అతడు ఆకాశంలో ఎగురుతూ ఉన్న పక్షులను చూచి, జాజలికి చూపించి మహర్షి. అవిగో. మీతలమీద గూడు కట్టుకున్న పక్షులు. వానిని పిలవండి. మీ దగ్గరకు వస్తాయి అన్నాడు. తన దగ్గరకు రమ్మని జాజలి ఆ పక్షులకు సంకేతం చేసాడు. వెంటనే అవి వచ్చి అతని తలమీద వాలాయి. అప్పుడు అవి తులాధారుడు చెప్పిన ధర్మాలనే మళ్లీ మనుష్య భాషలో వివరించాయి. అంతట జాజలి ఓయీ. నీమాటల సామర్థ్యాన్ని చూచి నీమీద నాకు గురి కుదిరినది. ఈ పక్షులు కూడ నీ మాటలను మన్నిస్తున్నాయి. అని తులాధారునితో పలికి అతనివలన ఉపదేశం పొంది వెళ్లిపోయాడు.

ఇంతకు నేను చెప్పదలచిన సారాంశం ఏమంటే తులాధారుడు అనే ఆ వైశ్యునియందు ఒక విధమైన అలౌకిక శక్తి ఉండేది అన్నమాట. ఒకవిధంగా ఇది ఒక సంసార సంబంధమైన ప్రభావం. అధ్యాత్మవిషయకమైన ప్రభావం ఇంతకంటె ఉన్నతశ్రేణికి చెందినది. కారణం? అది జగత్కల్యాణం కావిస్తుంది. ఇలాంటి మహాపురుషుల గాథలు శాస్త్రాలలో ఉన్నాయి. వారు తమలోని శక్తి ప్రభావం చేత శాపానుగ్రహసమర్థులై, వరములను ఈయగలవారై ఉండే వారని తెలిపే వర్ణనలు అనేకం ఉన్నాయి. ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు, మహాభారతం, వాల్మీకిరామాయణము, భాగవతము మొదలైన గ్రంథాలలో ఇలాంటి విషయాలు, ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. ఎల్లప్పుడు

సత్యం పలికే వాని వాక్కుకి అలాంటి శక్తి ప్రాప్తిస్తుంది. అలాంటప్పుడు సాక్షాత్తు భగవానుని పొందినవారి విషయం వేరుగా చెప్పవలెనా?

ఇక ఇప్పుడు శ్రోతలో (వినేవాడు) ఉండే అద్భుత శక్తిని వివరిస్తాను. హృదయంగమం చేసుకొండి. పాండవుల తల్లి కుంతి. ఆమె కొడుకులతో నాయనలారా! నేటి భిక్షను మీరు సమానంగా పొందండి అని చెప్పింది. అది విని భీముడు అమ్మా! యీనాడు భిక్షగా ఒక స్త్రీని తీసుకొని వచ్చాం అన్నాడు. నాయనా! స్త్రీని తెచ్చాము అన్నమాట మీరు ముందు చెప్పలేదు భిక్ష తెచ్చాము అని మాత్రమే చెప్పారు అన్నది కుంతి. అయ్యో. విషమసమస్య అయిందే. మీరు అయిదుగురు సమానముగా పొందండి అని అనేశానే! ఈమాట సత్యం ఎలా అవుతుంది? అవడం కష్టం. దీనిని సత్యం చేయడం నా చేతిలోని విషయం కాదు. అని తనలో తర్కించుకుని ఊరకుంది. ఆ మాటను సత్యం చేయవలసిన బాధ్యత పాండవుల మీదనే నిలచింది. అప్పుడు యుధిష్ఠిరుడు ఇలా అన్నాడు అమ్మా! నీ యీ ఆజ్ఞను మేం పాలిస్తాం. మేం అయిదుగురము ఆమెను పెండ్లియాడి నీ మాటను సత్యం చేస్తాం. ఇలాచేయడం శాస్త్రవిరుద్ధము, లోకవిరుద్ధము అయిన మాట నిజమే అయినా తల్లివైన నీ మాటకే ప్రాముఖ్యం ఇస్తాం. ఇలా పలికి యుధిష్ఠిరుడు తల్లి ఆజ్ఞను పాలించాడు. ఇలా తల్లి మాటలను కాని, మహాత్ముల వచనాలను కాని ఎవరెంతవరకు పాటించిన దానిని మనం గురుజనం మీద శ్రద్ధ అనవచ్చును. లేదా ప్రేమ అనవచ్చును. ఏమన్నా పాటించడం ప్రధానం.

జబాల కుమారుడు సత్యకాముడు గుర్వాజ్ఞను పాలించి బ్రహ్మప్రాప్తిని అందుకున్నాడు. ద్రుపదమహారాజు పరమశివుని ఆజ్ఞను పాటించి కూతురును కొమరునిగా భావించుకొని యామెకు మరియొక రాజకుమారితో వివాహం చేసి అందు సమయానుకులమైన సాఫల్యాన్ని పొందాడు. ధౌమ్యమహర్షి శిష్యుడు ఆరుణి యనువాడు గుర్వాజ్ఞను పాలించి చదువుకొనకుండానే సకలవిద్యాపారంగతుడు అయ్యాడు. ఇలా ఆజ్ఞలను ఇచ్చినవారు అనేకులు ఉన్నారు. వానిని పాలించిన వారు అనేకులు ఉన్నారు. వారి ఉదాహరణలు శాస్త్రాలలో అనేకం ఉన్నాయి. కాబట్టి శాస్త్రాల ఆదేశాలను, మహాత్ముల

ఆదేశాలను మనం పాటిస్తూ ఉండాలి. వారు చెప్పిన విధంగా నడచుకుంటూ ఉండాలి. అలాంటి శక్తి మనలో ఉండి ఉంటే యీనాడు మనలో వందలు, వేలుగా మహాత్ములు అయి జనులు భగవానుని పొందిన వారితో సమానులో లేక భగవానుని పొందినవారో అయి ఉండేవారు. సోదరులారా. మీకు మేంచెపుతూ ఉన్న యీ మాటలు అభ్యర్థనపూర్వకంగానూ, సవినయంగానూ చెపుతూవున్నాము గాని ఆదేశరూపంలోనో, ఉపదేశరూపంలోనో, గురుశిష్యసంబంధభావంతోనో చెపుతూ ఉన్నట్టివి కావు. మేం ప్రభువులం. మీరు సేవకులు అనే భావంతో గూడ ఈ మాటలు చెప్పటం లేదు. కేవలం మిత్రభావంతో చెపుతున్నాం. ఇలా చెప్పడంలో ఒక రహస్యం ఉంది. అది యేమంటే ఒకస్వామిగా గాని, గురువుగా కాని ఏమైనా చెప్పటకు మాకు అధికారం లేదు అనేది మా భావన. కారణం ఏమంటే నేను వైశ్యుడను. గృహస్థాశ్రమంలో ఉన్నవాడను. మరొక్క విషయం ఏమంటే వేదవ్యాసాదులలో ఉన్న అలౌకికమైన శక్తియుక్తులవంటి శక్తియుక్తులు కూడ మాదగ్గర ఏవీ లేవు. వ్యాసుడు సాధారణుడు కాడు. అతడు సాక్షాత్తు భగవత్స్వరూపుడు. మహాతపోధనుడు వ్యాసోనారాయణో హరిః అన్నారు. అతడు సంజయునకు దివ్యదృష్టిని ప్రసాదించాడు. దానితో ఆ సంజయుని మనస్సు, ఇంద్రియాలు కూడ దివ్యములు అయిపోయాయి. శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు ఇచ్చిన విధంగానే వ్యాసుడు సంజయునకు దివ్యదృష్టిని ఇవ్వడం జరిగింది. 15 ఏళ్ళ తరువాత అలాగే 18 అక్షౌహిణుల సైన్యమును అతనికి ప్రత్యక్షం చేసాడు. మేము అలాంటివారం అయితే భగవానుడు మాకు శక్తినిచ్చి లోకకల్యాణం కోసం మమ్ము పంపించియుండేవాడు. ఆ శక్తితో మేం మీకు లాభం చేకూర్చేవారం. కాబట్టి పిన్నపెద్దలు అందరితోటి సవినయంగా మనవి చేసుకొనేది ఏమంటే నేను చెప్పిన విషయాలను మీరు ఆచరణలో పెడితే నేను మీకు ఎంతయో కృతజ్ఞతను తెలుపుకుంటాను. మీకు నా మీద అపారమైన దయ ఉంది అని తలచుకొని ఆనందం పొందుతాను.

ఇక్కడ మీకు ఒక రహస్యం చెప్పవలసి ఉంది. నేను అధికారం కలవాడను. శక్తియుక్తులు కలవాడను అయితే తదనుసారంగా

గురుశిష్యసంబంధం ఏర్పరచుకొని అందరకు శిక్షణ, ఆదేశాలు, ఉపదేశాలు చేయడం ప్రారంభిస్తే దాని పరిణామం ఏమవుతుందో చెప్పలేను. గుర్వాజ్ఞను పాటించకుండ ఉంటే శిష్యుడు పతనాన్ని పొందవచ్చును. కాబట్టి యిక్కడ మన మధ్య ఉన్న సంబంధం మైత్రీ సంబంధమే కాని గురుశిష్యసంబంధం కాదు. ఒక మిత్రుడు మరియొక్క మిత్రునకు మంచి సలహా ఇవ్వడం వంటివి నేను చెప్పిన మాటలు. వీనిని పాటించకపోతే మీకు పతనమేమీ రాదు. అని నొక్కి చెప్పుటకు వీలు ఉన్నది. అట్లుకాక నేను ఉపదేశాలు చేసే గురువునే అయితే నేను చెప్పినట్లు చేయనినాడు మీకు పతనం కలుగుతుంది. చెప్పినట్లు చేయకపోవడం చేత ఏ విపత్కర పరిణామం ప్రాప్తిస్తుందో అనే భయము ఉంటుంది. అంతే కాదు మాలో శక్తి ఉండి ఉంటే అది మేము చెప్పిన విషయాన్ని మీకు ఇష్టం లేకున్నా మీ చేత బలవంతంగా ఆచరింపజేసేది కూడా అవుతుంది. ఎలాగ అంటే రాజాజ్ఞ ఉంటుంది చూడండి. అది బలీయమైనది. తదనుసారంగా చేసి తీరాలి. దానిలో మార్పు అనేది ఉండదు. ఆ విషయం చెప్పిన వాడు ఎట్టివాడు? వాని శక్తి యెట్టిది? అనే దానిమీద అధారపడి ఉంటుంది. ఇందులో (ఆదేశాన్ని పాటించడంలో) ఒకవంక లాభము ఉంది, రెండవ వంక అనర్థము ఉంటుంది. అంటే చెప్పిన విధంగా చేయకపోతే దండనాన్ని ఎదుర్కోవలసి ఉంటుంది. కాని నేను చెప్పే విధం అట్టిది కాదు. నేను చెప్పిన దానిని అనుసరించకపోతే నేను చెప్పిన లాభాన్ని మీరు పొందకపోవడం ఒక్కటే సంభవిస్తుంది. కాని క్రొత్తగా నష్టం ఏది కలుగదు. పతనమేమీ సంభవించదు. నేను చెప్పిన విధంగా చేయుడని నేను మిమ్ము బలవంతం చేయలేను. మీ యిచ్ఛానుసారంగా చెప్పినవానిని మీరు అనుసరించను వచ్చును. అనుసరించక ఉపేక్షించను వచ్చును. అనుసరిస్తే లాభం ఉంటుంది. అనుసరించకుంటే కలిగే నష్టం ఏదీ ఉండదు. అయితే లాభం పొందడానికి వీలు ఉన్న పరిస్థితిలో దాన్ని పొందకపోవడం మాత్రం నష్టం కాదా? అన్నది ప్రశ్న. నష్టమే, కాదని ఎలా అంటాము? నాయనా! సత్యం పలుకు అన్నాం అనుకొండి. పలికితే లాభాన్ని పొందుతారు. పలుకకుంటే ఆ లాభాన్ని కోల్పోతారు. అయ్యా. బ్రహ్మచర్యాన్ని పాటించండి అంటాం.

పాటించకపోతే దానివలన కలిగే లాభాన్ని మీరు పొందకపోవడం సహజమే అవుతుంది. కాబట్టి శాస్త్రం యొక్క ఆదేశాన్ని పాటించండి! అందువలన ప్రత్యక్షంగా లాభం కలుగుతుంది. అనుట తథ్యం. మనకు పరమశాస్త్రంగా భగవద్గీత ఉంది.

**శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః ।**
**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా ॥**

అది సాక్షాత్తు భగవానుని ముఖపద్మం నుండి వెలువడినట్టిది. దానిని చక్కగా అధ్యయనం చేయాలి, గానం చేయాలి, మననం చేయాలి, అలా చేస్తే ఇక యితర శాస్త్రాలవంకకు పోనక్కరలేదు. ఇలా చెప్పడంలో శాస్త్రాలను తృణీకరిస్తున్నాం అని అనుకోవద్దు. మాదృష్టిలో శాస్త్రాలు అంటే మహత్త్వం ఉంది. కాని దాని కంటెను విశేషమహత్త్వం భగవద్గీతకు నీయబడింది. ఇంతకు సారాంశం ఏమంటే మనకు శాస్త్రాలు ఆవశ్యకమైనవే కాని "గీతా సుగీతా కర్తవ్యా" అనుట చేత గీతాధ్యయనం చేస్తే యితరశాస్త్రాలతో పని ఉండదు అన్నమాట. అయితే శాస్త్రాలు నిరర్థకాలు కావు. అవి బహు మూల్యవంతములు అయినవి. అయినా ఆత్మోద్ధరణం కోసం భగవద్గీతను అధ్యయనం చేస్తే చాలు. ఇతరం ఏదీ అక్కరలేదు. కారణమేమంటే ఇది స్వయంగా భగవానుడైన పద్మనాభుని ముఖంనుండి వినిర్గతం అయింది. పద్మనాభుడు అంటే శ్రీమహావిష్ణువు. అతని నాభినుండి కమలం ఆవిర్భవించింది. అందుచేత అతడు పద్మనాభుడు అనబడ్డాడు. పద్మనాభుడు, ముఖపద్మం అనే రెండు మాటలలోనూ పద్మశబ్దం ప్రయోగించబడింది. భగవద్గీత భగవానుని ముఖకమలంనుండి వెలువడింది. శాస్త్రాలు అన్నీ నాభికమలం నుండి ఆవిర్భవించాయి. నాభికమలంనుండి శాస్త్రాల ఆవిర్భావం ఎలాగ? అంటారా? ఇదిగో! వివరిస్తున్నాను. తెలుసుకోండి. నాభినుండి కమలం ఉదయించింది. దాని నుండి బ్రహ్మ ఆవిర్భవించాడు. ఆయన నుండి వేదాలు ఆవిర్భవించాయి. వానిని ఆధారంగా చేసుకొని యితిహాసాలూ, పురాణాలూ, శాస్త్రాలు, దర్శనశాస్త్రాలూ, ఉపనిషత్తులూ మొదలైనవి ఆవిర్భవించాయి. ఈ విధంగా శాస్త్రాల విస్తరణం జరిగింది. కాని గీత భగవానుని ముఖంనుండియే వెలువడింది. నాభినుండి వెలువడలేదు. వేదాదులు

ఒక్కొక్క మెట్టుగా అవతరించినవి. గీత భగవానుని ముఖారవిందం నుండి వినిర్గతమైనది. అందుచేతనే మేము ప్రథమప్రాముఖ్యం గీతకు ఇస్తున్నాం. ద్వితీయప్రాముఖ్యం శాస్త్రపురాణ, దర్శనశాస్త్ర, రామాయణ, భారత, భాగవత, ఉపనిషదాదులకు ఇస్తున్నాం. కాబట్టి భగవానుని వచనాలను, మహాత్ముల వచనాలను అనుసరించి ఆచరించేవారికి అందరకు శుభం చేకూరుతుంది అన్నది నా ప్రగాఢవిశ్వాసం. నేను ఆచరిస్తే నాకును ఆ శుభం చేకూరుతుంది అనడంలో సందేహం ఏమీలేదు. ఇప్పుడు భగవానుని చర్చ సాగిస్తున్నాము కదా. ఈ చర్చారూపమైన సత్సంగం వలన మీకు ఎంత లాభం కలిగింది? అనేది మీకే అర్థం అవుతుంది. నాకు మాత్రం లాభం కలుగుతోంది. ఇది నా ప్రత్యక్షానుభవం. ప్రతి మానవునకు స్వకీయమైన అనుభవం ఒకటి ఉంటుంది కదా. ఒకడు ఇలా అంటాడు 'నేను రాధికాదేవిలీలను చూస్తున్నాను. అందు నేను పాలుగొంటున్నాను. భగవానుని రాసక్రీడ నాస్థానము. అందు నాకు ప్రవేశం ఉంది. ఆ విషయంలో నా అనుభవం చెప్పగలను'. ఇలాంటి మాటలు చెప్పేవాడు తనను, లోకాన్ని కూడ వంచించేవాడు. అట్టివాని మాటలను నమ్మరాదు. అలాంటి అనుభవం మీకు ఏమైనా ప్రాప్తించిందా? అంటే నాకు ప్రాప్తించినా, ప్రాప్తించకున్నా ఆ విషయంలో నేనును ఏమీ మాటలాడను. డాంబికుని చర్య. అది తగదు అని దేనిని నేను నిషేధిస్తానో దానిని నేను ఎలా అనుసరిస్తాను? నాకు భగవదనుభూతి ఉన్నది అని చెప్పేవానిని నేను డాంబికుడు అని భావిస్తాను. నాకు అట్టిది ఏదీ లేదు అనే వారిలోనే అట్టి అనుభవం ఉన్నవాడు నూటికో, కోటికో ఒకడు ఉండవచ్చును.

ఒక శ్రుతి ఏమంటూ ఉందో ఎరుగుదురా? నేను బ్రహ్మమును తెలిసికొన్నాను అని చెప్పేవాడు తెలుసుకున్నవాడుకాడు. తెలుసుకోలేదు అని చెప్పేవాడు తెలుసుకున్నవాడు అవుతాడు. అని చెపుతోంది. నేను బ్రహ్మమును తెలుసుకున్నాను అని భావించుకున్నవాడు ఏమియు తెలియనివాడే అవుతాడు. అతని భావన తప్పు. నేను ఏమీ తెలుసుకోలేదు. నాకు ఏమీ తెలియదు అనే వారిలో ఎవడో ఒకడు నాకు బాగాతెలిసింది అనీ అనలేను. తెలియలేదు అనీ అనలేను అని అంటాడు. "నాహం

మన్యే సువేదేతి నో నవేదేతి వేద చ యోనస్తద్వేద తద్వేద నో నవేదేతి వేద చ". (కేనోప. 2-10) ఈ విధంగా మన వేదాలలో, శ్రుతులలో సర్వత్రా ఈ విషయం చెప్పబడింది. అయితే నాకు తెలియలేదు అని చెప్పేవానికి ఎప్పుడైన భగవానుడు సాక్షాత్కరిస్తే సాక్షాత్కరించవచ్చును. కాని నేను భగవానుని పొందాను, నాకు ప్రత్యక్షానుభవం ఉంది, అక్కడ నాకు ప్రవేశముంది అని ప్రగల్భాలు పలికే చోటనే గందరగోళం ఉంటుంది. నిజం చెప్పాలి అంటే అది భగవత్ప్రాప్తి కానే కాదు. లేనేలేదు. భగవత్ప్రాప్తి కలుగకుండా కలిగింది అని చెప్పేవానిని పరీక్షించి వానికి భగవత్ప్రాప్తి కలుగులేదన్న విషయాన్ని నేను ధ్రువపరచగలను. కాని నిజంగా భగవత్ప్రాప్తి కలిగిన వాని విషయంలో నేను ఏమీ చేయలేను. నిజానికి ఈ విషయం ఇతరులకు తెలుసుకొనుటకు శక్యమైనది కాదు. ఒకవేళ తెలిసినా ఏదో తెలిసినట్లు ఉంటుంది. చెప్పినవాడు ఏదో చెప్పాడు. విన్నాం అని అనిపిస్తుంది కాని ఆ విన్నవారికి ఏమీ పూర్తిగా అవగాహనకు రాదు. కారణం ఏమంటె ఈ విషయం ఎవరికి వారు స్వయంగా తెలుసుకోవలసినది. ఇతరులకు తెలిపేది కాదు. ఇతరులు తెలుసుకొనగలిగేది కాదు. సాధారణంగా లోకంలో తమ ఆధిక్యాన్ని ప్రకటించి ఇతరులను ప్రభావితులను చేయదలచినవారే ఇట్టిమాటలు చెపుతూ ఉంటారు. ఇలాంటి మాటలు చెప్పి పరులను సమ్మోహితులను చేసేవారు సత్యవర్తనులు, సత్యవచనులునూ కారు.

నిజం చెప్పాలి అంటే లోకంలో జనులు ఈనాడు పేరుప్రతిష్టలకూ, ప్రశంసా సన్మానాలకూ దాసులయి ఉన్నారు. ఈ పేరు ప్రతిష్ఠలను, ప్రశంసాసన్మానాలను అసహ్యించుకొనే నిరసించే మహాపురుషులు ఎక్కడో నూటికి, కోటికి ఒకరు ఉంటారు. సంసారమందు విరక్తి కలవాడై, ఐశ్వర్యాన్ని మట్టిగా భావించేవాడు వేయిమందిలోనో, లక్షమందిలోనో ఒకడు ఉంటాడు. అట్టి విరక్తపురుషులు అనేకులలో ఎవడో ఒకడు తాత్త్వికంగా అర్థం చేసుకొని భగవానుని పొందినవాడు అయి ఉంటాడు. విరక్తులైనవారిని గూర్చి వివరించవచ్చును. కాని భగవత్ప్రాప్తిగన్న వారిని గూర్చి భగవానుడే 'యోమద్భక్త స్సమేప్రియః' అని వరించాడు. భగవద్గీతలో 12 అధ్యాయంలో 13నుండి 19 శ్లోకం వరకు ఈయబడిన వివరణాన్ని చదువుకొని కూడ మానవుడు అట్టివానిని గుర్తించలేడు. అందుచేతనే వారిని గుర్తించడం చాలకష్టం అని

చెప్పవలసివచ్చింది. అయితే అలాంటి పురుషుడు మనకు దొరికేది యెట్లు? అన్నది ప్రశ్న. దొరకాలి అనేకోరిక మనకు ఉన్నది. కాని వానిని గుర్తించగల సామర్థ్యంలేదు. అయితే అట్టివాడు దొరకాలని, వానిని కలియాలనే కాంక్షమనలో ప్రబలం కావాలి. అలా ప్రబలం అయినప్పుడు మనం మన యింటిలో ఉండగానే మనకు అట్టివాడు లభిస్తాడు, లభించాలి అనే కాంక్ష ప్రబలంగా ఉంటే లభించేది అట్టి పురుషుడే అన్నమాట యేమి? భగవానుడు కూడ లభిస్తాడు, లభించాలి అనే కాంక్ష తీవ్రం కావడము, జిజ్ఞాస అధికము కావడము ప్రధానం. మరొక్క విషయం ఏమంటే ఇలాంటి పురుషులు భగవదనుగ్రహం వలన ప్రాప్తిస్తారు.

ఆ కృప అన్నది యెప్పుడూ ఉన్నదే. అది యెప్పుడూ ఉంటూనే ఉంటుంది. కాని దానిని నమ్మేవాడు ఎవడు? నమ్మితేనే ఆ కృపఫలిస్తుంది. నమ్మకుంటే ఫలించదు. ఒక్క కృపయే కాదు. సాక్షాత్తు భగవానుడే ప్రత్యక్షం అయినా అతనిని భగవానుడని నమ్మకపోతే భగవద్దర్శనలాభం కలుగదు. శ్రీకృష్ణుడు ప్రత్యక్షంగా ప్రకటమై ఉన్నా అతనిని దుర్యోధనుడు భగవానునిగా భావించలేదు. అందుచేత అర్జునుడు పొందిన లాభాన్ని దుర్యోధనుడు పొందలేక పోయాడు. ప్రతివిషయం నమ్మకం మీద ఆధారపడి ఉంది, ఉంటుంది. ఏ పరిస్థితిలోనూ వికారం ఉండరాదు. అత్యంత నిర్వికారపరిస్థితి కావాలి. కాని అది ఉండడంలేదు. అందరి మనస్సులోనూ ఏదో గందరగోళమే ఉంటోంది. పరిస్థితులు అనుకూలంగా ఉంటే రాగము (ఇష్టము) ప్రతికూలంగా ఉంటే ద్వేషము కలగడం, అనుకూలతకు హర్షించడం, ప్రతికూలతకు విచారించడము అనేవే వికారాలు. రాగద్వేషాలు, హర్షశోకాలు కలుగుతునే ఉంటాయి. ఈ వికారాల నుండి విముక్తి పొందడానికి ఒక ప్రమాణం ఉంది. ఒక పని యేదైనా జరుగుతోంది అంటే అందు ఏకభావన అనగా భగవద్భావన ఒకటి ఉన్ననాడు ఈ వికారాల వైవిధ్యం ఉండదు. ఈ వైవిధ్యమే మనకు బాధాకరమైనది. ఏకత్వం ఏదో అదే సమత్వం. ఆ సమత్వమే భగవత్స్వరూపం. ఏకత్వం అనండి. సమత్వం అనండి, భగవత్స్వరూపం అనండి లోతుగా ఆలోచించి చూస్తే మూడూ ఒకటే. మన దృష్టిలో ఉన్న ఏకత్వభావన, సమత్వభావన అనేదే అచ్చమైన భగవానుని ప్రతిబింబం. ఆ స్వామివలననే ఆ భావన భాసమానం అవుతూ ఉంటుంది.

చంద్రుని ప్రతిబింబం చంద్రునికంటె భిన్నమైనది కాదు. అలాగే సూర్యుని ప్రతిబింబం సూర్యునికంటె భిన్నమైనది కాదు. ఆ సూర్యచంద్రులు తెరమరుగు కావడంతో ఆ ప్రతిబింబాలు కూడ లోపించిపోతాయి.

మహాత్ములకు ఎప్పుడు అనుకూలంగా ఉండాలి అని ఆరంభంలో చెప్పియున్నాను. వారికి అనుకూలురం కావడం చాలతేలిక. వారు దొరకడమే కష్టం. ఎంతో అదృష్టం ఉంటే కాని వారు దొరకరు. లేదా భగవానుని కృప ఉంటే కాని లభించరు అని చెప్పవచ్చును. లభించిన తరువాత వారిని గుర్తించడం కష్టం. భగవానుని దయవలన వారిని గుర్తించగలిగితే ఆ భగవానుని పొందడంలో ఇక విలంబం ఉండదు. సారాంశం ఏమంటే మహాత్ముని మహాత్మునిగా భావించిన వానిలో ఒక విధంగా మహత్తత్త్వం ఉదయిస్తుంది అన్నమాట. భగవద్గీతలో 12వ అధ్యాయంలో 13 నుండి ఆ అధ్యాంలోని 19వ శ్లోకం వరకుచూడండి. 13వ, 14వ శ్లోకాలలో భగవానుడు ఇలా అన్నాడు -

**శ్లో॥ అద్వేష్టా సర్వభూతానం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥**
**సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పితమనోబుద్ధిః యోమద్భక్త స్సమే ప్రియః ॥**

ఈ శ్లోకాలలో చెప్పిన లక్షణాలు కలవాడు నాకు ప్రియుడు అన్నది భగవానుని భావన. ఆ భావనయే మహాత్మునియందు ఉంటుంది. ఈ లక్షణాలు మనలో పెరిగిన కొలది మనకు మహత్తత్త్వం వస్తుంది. ఆ లక్షణాలు ఏవి అంటే సమస్తప్రాణులయందు ద్వేషవృత్తిలేకుండడం, అందరి యెడల నిర్హేతుకమైన స్నేహభావం కలిగియుండడం, అందరియందూ నిర్హేతుకమైన దయను చూడగలుగడం, హృదయంలో దేనియందూ నాదియనే భావన లేకుండడం. అహంకారాన్ని వర్జించడం, క్షమాగుణం కలిగియుండడం (ఇతరులు చేసిన నేరాలకు ప్రతిక్రియ చేయకుండడం అనేది క్షమాగుణం అనబడుతుంది). సుఖదుఃఖాలనుసమానములని భావించుకొని స్వీకరించడము, ప్రారబ్ధవశమున ఏది ప్రాప్తిస్తే దానియందే తృప్తిపొంది సర్వదా సంతోషంగా ఉండడం, బుద్ధిని స్థిరంగా ఉంచుకోవడము అనేవి ఆ లక్షణాలు.

ఎవడు తన మనస్సును నిగ్రహించుకొని దానిని, తన బుద్ధిని భగవదర్పణం చేస్తాడో వాడు నాకు ప్రియుడు అని భగవానుడు చెప్పియున్నాడు. (మయ్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్త స్సమేప్రియః) ఈ భావన మనలో నాటుకుంటే మనం మహాత్ముని అర్థం చేసుకున్నవాళ్ళం అన్నమాట. ఎవడైనా అర్థం చేసుకుంటేనే మహాత్మత్వం పొందడం సంభవం అవుతుంది. ఎంతగా అర్థం చేసుకుంటే అంతగా ఆ భావం కలవాడు అవుతాడు. ఆ అర్థం చేసుకునే స్థాయి సాధారణంగా ఉంటే సాధారణగుణాలు, విశేషంగా ఉంటే విశేషగుణాలు ప్రాప్తిస్తాయి. అర్థం చేసుకున్నమీదట వానిలో అలౌకిక శ్రద్ధ, విశ్వాసము ఏర్పడతాయి. శ్రద్ధావిశ్వాసాలు ఎవనిలో ప్రవేశిస్తే వానిలో అవి అంకితం అయిపోతాయి. అవి కొరవడితే ప్రయోజనము కొరవడుతుంది. శ్రద్ధావిశ్వాసాలు ఎంతగా ఉంటే అంతగా వాడు చెప్పిన విషయాన్ని గ్రహించడము, ధారణ చేయడము జరుగుతుంది. ఫోనోగ్రాంలో ఏ ధ్వనిని నింపితే దానినది గ్రహిస్తుంది. కెమెరాలో ఏ దృశ్యాన్ని ప్రవేశపెడితే దానినది పట్టుకుంటుంది, ప్రదర్శిస్తుంది. అలాగే మనం నమ్మిన మహాత్ముల ఆచరణములు, లక్షణాలు మన మనః ఫలకంమీద ముద్రితములు అయిపోతాయి. సారాంశం ఏమంటే మహాత్ముని ఆచరణాన్ని చూస్తూఉంటే అది హృదయంలో అంకితమవుతుంటుంది. క్రమంగా చూచేవాని ఆచరణలు కూడ మహాత్ముని ఆచరణల వంటివిగా రూపుదాలుస్తాయి. అనంతరమతడు మహాత్ముని సంకేతాన్ని అనుసరించి ఆచరించడం మొదలుపెడతాడు. అతనికి ఇక వేరుగా ఏమీ చెప్పనక్కరలేదు. మహాత్ముని సంకేతానుసారం అతని ప్రయత్నం దానంతట అదే సాగిపోతూ ఉంటుంది. కారణం ఏమంటే మహాత్మునిలో విశేషంగా నిష్ఠ ఉంటుంది. నమ్మకం కుదిరినప్పుడు ఆ మహాత్మునిలోని లక్షణాలు క్రమంగా అతనిలో స్థిరపడిపోతాయి. అతడు మహాత్ముని అనుకరించడం మొదలుపెడతాడు. తన ప్రాణం కన్నా అధికప్రాముఖ్యం అతడు మహాత్ముని మాటలకు ఇస్తాడు. ఈ విధంగా తన సాధనలో అభివృద్ధిని సాధిస్తూ అతడు కూడ క్రమంగా స్వయంగా మహాత్ముడైపోతాడు.

# భగవానునిదయలోని ఆంతర్యం

ఉత్తమదేశంలో, ఉత్తమకాలంలో, ఉత్తమజాతిలో, ఉత్తమధర్మంలో(సాంప్రదాయం) మనకు జన్మ లభించింది అంటే అది భగవానునకు మనమీద ఉన్న కృపయొక్క పరిణామం అనుకోవాలి. దానితో బాటు మన సమయం అంతా భగవచ్చర్చలో గడచిపోయింది. అంటే అది మరింత విశిష్టవిషయం అనుకోవాలి. అలాగే రానున్న భావికాలం కూడ మనం ఉత్తమకార్యాల నిర్వహణలో గడపగలిగితే దానిని భగవానుని కృపావిశేషం అనుకోవాలి. అట్లుకాక సమయాన్ని చెడు పనులలో గడపడం సంభవిస్తే దానిని మన స్వభావదోషం అనుకోవాలి. మంచి పని జరిగితే భగవానుడు దయతో మనకు అట్టి సదవకాశాన్ని కలుగజేసాడు అనుకోవాలి. భగవానుని కృపాఫలం పరమకల్యాణాన్ని చేకూరుస్తుంది. స్వభావం యొక్క ప్రేరణకులోనై మనం చేసే పని దుఃఖాన్ని కలిగిస్తుంది. అయినా భగవానుని కృప ఉంటే అది క్షమింపబడుతుంది. ఇది సిద్ధాంతము. మన వలన యజ్ఞం, దానం, తపస్సు, తీర్థగమనం, వ్రతం, సేవ, ఉపకారం భగవద్ధ్యానం, సత్సంగం, స్వాధ్యాయం మొదలైన పనులు ఏవి జరిగినా దానికి మూలం భగవత్కృపయే అనుకోవాలి. భగవానుడే మనలను లోకంలోని చెడ్డ పనులనుండి మరలించి మంచి పనులలో ప్రవర్తిల్లునట్లు చేస్తూంటాడు. కల్లలాడుట, కపటం, చౌర్యం, దోపిడి, విశ్వాసఘాతం, మొదలైన పనులు చేయడం జరిగితే దానికి మూలం మన స్వభావదోషమే అవుతుంది. చెడుసాంగత్యం కుసంగం చేత మహాత్ములు ఎన్నడు ప్రభావితులు కారు. కాబట్టి దానిని మన స్వభావదోషంగానే ఎన్నుకోవాలి. నేను సహజంగా మంచివాడనే. ఫలానా దుష్టుని సాంగత్యంవలన నాలో ఈ దోషం ప్రవేశించింది అని నీవు నీ దోషాన్ని ఇతరులమీదకు త్రోసివేయవచ్చును. కాని ఆ దోషాన్ని నీవు స్వీకరించావు. అందుచేతనే అది మీలో ప్రవేశించగలిగింది. బలవంతంగా మాత్రం ప్రవేశించలేదు అన్నది నిజం అని నేనంటాను. కాబట్టి దుర్జనసాంగత్యం విడిచిపెట్టాలి. వానివంకకు పోరాదు. దానిపేరు కూడ తలపరాదు. దుష్టసాంగత్యం వలన

హానియే కలుగుతుంది. లాభం ఎన్నడు కలుగదు. కాబట్టి మనం సర్వదా సత్సాంగత్యమే చేయాలి.

సత్సంగం అనేది భగవానుని దయవలననే ప్రాప్తిస్తుంది. సత్సంగం వలన కలిగే లాభం కూడ ఆ భగవత్కృపవలననే కలుగుతుంది. సత్సంగం చేసే మేలునకు అవధులు ఉండవు. ఈ విషయం లాభం పొందినవారికి తెలుస్తుంది. భగవానుని దయను మనం అర్థం చేసుకున్నది చాల తక్కువ. అతని దయకు అవధులు లేవు. అతని దయ అపారం. అది మనకు తెలియవచ్చినది పరిమితం. అయితే ఆ దయ మన మీద ఉత్తరోత్తరా పెరుగుతున్నది అన్న విషయాన్ని మనం అర్థం చేసుకోగలిగితే శీఘ్రంగా మనకు భగవత్ప్రాప్తి కలుగుతుంది. కాబట్టి అనుక్షణము ప్రతి విషయంలోను, ప్రతి లీలయందు అతని దయను పరికిస్తూ ఉండాలి. పరికించి పరికించి ముగ్ధులంకావాలి. భగవానుడే వచ్చిమనలను తెలివిలోనికి వచ్చేటట్లు చేసేటంతగా మనం పరవశించిపోవాలి. భగవానుని ప్రత్యక్షదర్శనం లభించేటంతవరకు అతని దయను మనం పూర్తిగా అర్థం చేసుకోలేదనే చెప్పాలి లేదా అనుకోవాలి.

భగవానుని దయ అపరిమితం అయినది. దాని తత్త్వాన్ని, రహస్యాన్ని సమగ్రంగా అర్థం చేసుకుంటే అర్థం చేసుకున్నవానికి వెంటనే భగవత్ప్రాప్తి కలుగుతుంది. అది కలుగడంలో ఆలస్యం అవుతోంది. అంటే అతని దయను అతడు తగిన విధంగా అర్థం చేసుకోలేదు అన్నమాట. మనచూపు పోయినంత మేర మనకు భగవానుని దయయే. దయ కానరావాలి. దయారసపు సముద్రం నిండుగా ఉన్నట్లు గోచరించాలి. మనం అందు మునిగియున్నట్లు మనకు భాసించాలి. లౌకికమైన యీ సముద్రానికి తీరం ఉంది. కాని, ఆ దయా సముద్రానికి మాత్రం తీరంలేదు. భగవానుని ఆ దయను చూచి మానవుడు ఆనందంతో నవ్వుకుంటూ కాలంగడపాలి. నవ్వుతూ నవ్వుతూనే ప్రాణాలు విడవాలి. అలా జరగడం ఆనందజనకమైన విషయం అవుతుంది. అంతకంటె వాంఛనీయమైన మహత్త్వం వేరొకటి ఉండదు. కాబట్టి భగవానుని దయాసముద్రంలో మునిగిపోవాలి. కాని, యీ సంసారసముద్రంలో మునిగిపోకూడదు. మానవుడు తనను తాను భగవానుని దయా సముద్రంలో

ముంచి ఉంచుకోవాలి. ఆ భగవానుడు మన జీవననిర్వహణకోసం మనకు సూర్యునిద్వారా వెలుతురును, మేఘాలద్వారా జలమును, చాలినంత గాలిని ప్రసాదించాడు. ఆ ప్రకాశము, జలము, గాలి వంటి వానిని మనం లక్షలు ఖర్చుపెట్టినా సంపాదించుకొనలేము. భగవానుడు ఇచ్చిన వీనికై మనం మూల్యం చెల్లింపనక్కరలేదు. మనకు భగవానుడు ఈ వస్తువులను ఉచితంగా ఇచ్చాడు అంటే, అతనికి మనమీద ఎంత దయ ఉంది? అంతే కాదు. అతడు మనకు భార్య, బిడ్డలు, ధనము, ఇట్లా శారీరకంగా బుద్ధి, బలము, జ్ఞానము మొదలైన వానిని ఎన్నిటినో ఇచ్చేడు. ఇది మరియింతగా అతని దయావిశేషాన్ని ప్రకటించే విషయం. ఈ వస్తువులనన్నిటిని అతడు మనకు ఎందుకిచ్చాడు? తనను అనగా, పరమాత్మను పొందడం కోసం అన్నమాట. ఇన్ని వస్తువులను మనకు అందచేయడంలో అతని విశేషకృప ప్రకటం అవుతునే ఉంది. అతడు మనమీద ఇంతకంటెను మిక్కుటంగా దయను ప్రదర్శించే సందర్భాలు ఉన్నాయి. అది యెలాగ? అంటే ఒక్కొక్కప్పుడు అతడు సర్వత్రా మనకు ప్రతికూల పరిస్థితులను కల్పిస్తు ఉంటాడు. కష్టాలు కలిగిస్తూ ఉంటాడు. తాను ఇచ్చిన వస్తువులను మరల మన దగ్గరనుండి హరించివేస్తూ ఉంటాడు. అనగా భార్య చనిపోవడం, పుత్రుడు మరణించడం, ధనం నశించడం, వ్యాధిపీడ కలుగడం వంటి సందర్భాలు అన్నీ అతడు మనమీద విశేషంగా ప్రదర్శించే దయకు తార్కాణాలు.

సుఖం కలిగితే మనం దైవాన్ని మరచిపోతుంటాం. అలా మనచేత దైవాన్ని మరపింపజేసే సౌఖ్యం ఏదియైన దాని తలమీద బండరాయి పడాలి. క్షణక్షణము భగవానుని స్మరింపజేసే దుఃఖం ఏదియైన దానికి ధన్యవాదాలు అర్పించుకోవాలి, కారణం ఏమంటే భగవానుడు మనకు కష్టాలలోనే తలపుకు వస్తాడు. ఒక భక్తుడు ఏమన్నాడో చూచారా?-

**ఆ. తలతురెల్లవారు దైవమ్ము గష్టాల,**
**దలపబోడు సౌఖ్యదశనొకండు ।**
**నట్లుగాక సుఖములందును దలపోయు**
**చున్న నింక దుఃఖ మొదవగలదె? ॥**

కష్టాలలో అందరూ భగవానుని స్మరిస్తారు? సుఖాలలో ఎవడూ స్మరించడు. ఒక్క కష్టదశలో మాత్రమే కాక సుఖావస్థలో కూడ ఎవడు భగవానుని స్మరిస్తూ ఉంటాడో వానికి ఇక దుఃఖం అన్నది కలుగనే కలుగదు. కాబట్టి కష్టమే లేక దుఃఖమే మనచేత భగవత్స్మరణం చేయించేది. మనకు జ్వరం వచ్చింది అనుకోండి. లేదా యేదైనా జబ్బు వచ్చింది అనుకోండి. ఆ సమయంలో బాధ భరించలేక భగవానుని స్మరించుకోవడం సంభవమైతే అందుకు కారణభూతం అయిన ఆ జబ్బు మనకు విశేషలాభకరం అయినది అన్నమాట. కాబట్టి సాంసారికంగా ఏ ఆపద వచ్చినా దానిని భగవానుని కరుణాకటాక్షంగా భావించుకోవాలి. కారణం ఏమంటే మనకు ఏదైన వ్యాధిబాధ మొదలయింది అనుకోండి. అది మన పాపఫలం అవునా? కాదా? అవును అని అనుకున్నప్పుడు దానిని అనుభవించివేయుటతో ఆ పాపం నివృత్తం అయిపోతుంది. మనం పవిత్రులం అయిపోతాము. మనలను పరిశుద్ధులను గావించుటకే భగవానుడు మనకు ఈ బాధలను కలిగిస్తు ఉంటాడు. అందుచేతనే భీష్ముడు - దేవా! నేను చేసిన సమస్తపాపాల ఫలాన్ని నాకు వ్యాధిరూపంగా ప్రసాదించి నన్ను శీఘ్రంగా పరిశుద్ధుని గావింపవే అని భగవానుని వేడుకొన్నాడు. ఆ పాపాల ఫలాన్ని అనుభవించడం కోసం మరల జన్మ యెత్తడం తనకు ఇష్టంలేదన్నాడు. మరొక్క మాట చెపుతున్నాను. తపస్సు అంటే తపించుట లేక శారీరకంగా క్లేశాన్ని భరించుట అని అర్థం. కాబట్టి మనకు ఏదైనా జ్వరము, జబ్బు, ఇతరములైన పీడలు ప్రాప్తించినప్పుడు వానిని భరించడం ఒక తపస్సుగా భావించుకోవాలి. సహర్షంగా స్వీకరించాలి. అలా చేస్తే మహాతపస్సు చేసినంత ఫలం కలుగుతుంది. అది ఒక లాభం. కష్టాలు ఏవి యెప్పుడు కలిగినా మనం ఇంతకు ముందు ఏవోపాపాలు చేసాం, దాని ఫలం యీ రూపంగా మన ముందుకు వచ్చింది. అనుభవిస్తున్నాం అనే భావన మనలో పనిచేస్తూ ఉండాలి. దానితో మనలో ఎన్నడూ పాపం చేయకూడదనే భావన బాగుగా నాటుకుంటుంది. భగవానుని మనకు తలపునకు తెచ్చేది దుఃఖమే. కాబట్టి దానినిసుఖం కన్న మిన్నయైనదని ఎన్నుకోవాలి. ఏ కష్టం వచ్చినా భగవానుని కృపావిశేషం అనుకోవాలి. ఎప్పుడో ఒకప్పుడు భగవానుడు అందరకూ

జ్ఞాపకం వస్తూనే ఉంటాడు. అనే మాట వేరు. జ్ఞాపకం రాడు అనుకోండి. అప్పుడు ఏం చేస్తారు? ఏమీ చేయలేరు. అప్పుడప్పుడు భగవానుడు తలపునకు రావడం అతని కృపావిశేషమే. అయితే అలా జ్ఞాపకం వచ్చినా తరువాత మనం అతనిని మరచిపోతాం. విడిచిపెట్టేస్తాం. అలా చేయడం మన మూర్ఖత్వం. అదే కాకుంటే మనం ఎందుకు మరచిపోతాము? స్వాభావికంగానే ఎప్పుడైనా మనకు భగవానుడు తలపునకు రావడం అనేది భగవానుని ప్రత్యక్ష దయా స్వరూపం అన్నమాట. అతడు తలపునకు రాకుంటే మనకు ఉన్న శక్తి యేపాటిది? మనం ఏమి చేయగలం? కాబట్టి మనకు ఏ విషయం ప్రాప్తించినా దాని వెనుక భగవానుని దయనుపరికిస్తూ ఉండాలి. భగవానుడు గీతలో కూడ ఇలా అన్నాడు -

**శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥**

(గీత 6-30)

ఎవడు సర్వత్రా నన్ను చూస్తూ ఉంటాడో, సర్వమును నాయందు ఉన్నట్లు పరికిస్తూ ఉంటాడో వాడు నాకు దూరము కాడు. వానికి నేనూ దూరము కాను అని భావం. ఈ విధంగా చూచే జ్ఞానం కూడ భగవానుని వలననే ప్రాప్తిస్తుంది. సర్వత్రా భగవానుని చూడాలి. సర్వాన్ని భగవానుని యందు ఉన్నట్లు చూస్తూ ఉండాలి. అనే బుద్ధి మనలో ఉండాలి. అలా ఉన్ననాడు మనకు మీదుమిక్కిలి శాంతి, ప్రసన్నతా చేకూరుతాయి. భగవత్సంకీర్తనం చేస్తూచేస్తూ ఉండగా భగవత్ప్రేమావేశంలో ఒడలు ఎరుగని దశ మనకు ప్రాప్తించాలి. మనం మనలను మరచిపోవాలి. సంకీర్తనం ఒక్కటి తప్ప మరి యే విషయము మనకు తలపులో ఉండకూడదు. భావావేశం పెరిగిపోతూ ఉండాలి. అలాంటి దశలో భగవానుడు ప్రత్యక్షం అవుతాడు. ద్రౌపది ఒక్కమారే సకామభావంతో భగవానుని పిలిచింది. తోడనే అతడు పరుగిడి వచ్చాడు. ఇట్టివే భావము, దయ, నామజపము, భగవత్ప్రేమ అనే విషయాలు.

భగవత్ప్రేమావేశం పెరిగిపోవడం మొదలుపెడితే ఒడలు తెలియనంతగా పెరిగిపోవాలి. మూర్ఛావస్థ వచ్చేయ్యాలి. అలాంటి దశలోనే భగవానుడు

ప్రత్యక్షం అవుతాడు. శాస్త్రాలలో ముక్తికంటె సత్సంగానికి విశేషమహత్త్వం చెప్పబడింది. అదృష్టం ఉంటేే లభిస్తాడు. లేకుంటే లేదు అని ఊరకుంటే ఆ భగవానుడు అదృష్టం వలన లభించేవాడు కాడు. ఆస్వామి యొక్క దయను మనమీద ప్రసరించినప్పుడే మనకు ఆయన దర్శనం లభిస్తుంది. అతనిపై మనలో ఏర్పడిన ప్రేమావేశం కారణంగానే అతడు మనకు లభిస్తాడు. మనలో అలాంటి ప్రేమ, శ్రద్ధ కొరవడినప్పుడు మనం భగవానుని దయనే ఆలంబనం చేసుకోవాలి. అతడు దయ చూచినప్పుడే లభించేవాడు కాబట్టి అతనికై మనం రోదించాలి. స్తుతించాలి, ప్రార్థించాలి, హార్దికంగా రోదనదశను కలుగచేజే ప్రార్థన అచ్చమైన ప్రార్థన అవుతుంది. అది భగవానుని విశేషంగా ఆకర్షించేది అవుతుంది. ఆ రోదనం హృదయ పూర్వకమైనదికాక కేవలము కరుణ కలుగుటకై తెచ్చిపెట్టుకున్న రోదనం అయితే భగవానుని హృదయం కరుగదు.

ఒక పిల్లవాడు తన తల్లిని పిలుస్తాడు, అమ్మా! అమ్మా! అంటూ ఏడవడం మొదలుపెడతాడు. తల్లి వాని విషయం పట్టించుకోదు. మరొక స్త్రీ ఏమమ్మా! నీబిడ్డ ఎంత సేపటినుండియో ఏడుస్తున్నాడు. వాని విషయంమీ ఏమీ పట్టించుకోవు ఏమమ్మా అని వాని తల్లితో అంటుంది. వాని ఏడుపు నిజమైనది కాదు. దొంగ ఏడుపు ఏడుస్తున్నాడు. కంటినుండి ఒక్క చుక్కకూడ కన్నీరు రావడం లేదు. చూడు! అంటుంది వాని తల్లి. ఇక్కడ కృత్రిమ రోదనంతో పిల్లవాని తల్లి యెలా ప్రభావితురాలు కాలేదో అలాగే హృదయపూర్వకంగా కాని రోదనం చేత భగవానుడు కూడ ప్రభావితుడు కాడు. మన హృదయంలోని భావావేశము, కరుణ వెలికి ఉరుకునట్లు స్వభావసిద్ధంగా మన రోదనం ఉన్ననాడు బాధ్యతతోడ భగవానుడు మన ముందుకి రావడం సంభవం అవుతుంది. కాబట్టి మన హృదయంలో భావావేశం పెరగాలి. భగవానుని ముందు రోదించడానికి హేతువుగా మన హృదయంలో ఆరాటం పెరగాలి. ఆ పెరగడం కూడ మనలో యోగ్యత లేకపోవచ్చును. గుణం లేకపోవచ్చును. ఆదరం లేక పోవచ్చును. వైరాగ్యం లేకపోవచ్చును. భక్తి లేకపోవచ్చును. జ్ఞానం లేకపోవచ్చును. ఎట్టి అర్హత లేకపోవచ్చును. కాని కేవలము ఒక్క కోరిక భగవానుని పొందాలనేది

ఉంటే చాలు. భగవానుడు వీడు పాత్రుడా? కాదా? అన్న విషయం పరిగణించడు.

దయాస్వభావుడైన ఒక ధనవంతుడు ఉన్నాడు. అతడు మిఠాయి తింటున్నాడు. అప్పుడు ఒక బీదవాడు అక్కడకు వచ్చి ఆ మిఠాయి తనకు కొంచెం పెట్టమని కోరాడు. ధనికుడు దయతో వానికి కొంచెం మిఠాయి పెట్టాడు. అది తిని అతడు మిక్కిలి సంతోషించాడు. కారణం ఏమంటే అతడు అంతకుముందు మిఠాయి తిని యెరుగడు. వాని ప్రసన్నతను గాంచి దాతకు ప్రసన్నత కలిగింది. ఇది మానవుల పరిస్థితి. కాని భగవానుని పరిస్థితి దీనికి భిన్నమైనది. అతడు ఉన్నతశ్రేణికి చెందిన దాత. మనం ఇతరం ఏమి కోరక అపాత్రులం అనుకుంటూ ఉన్నా ఒక్క భగవద్దర్శనం కోరుకుంటే ఉంటే చాలు. ఆ కోరిక ప్రబలంగా ఉంటే చాలు. భగవానుడు దర్శనం ఈయాలనే అనుకుంటూ ఉంటాడు. పాత్రుడు అయిన వాడికి డబ్బులు ఇస్తే బజారులో మిఠాయి ఎక్కడైనా దొరుకుతుంది. డబ్బులు లేనివానికి కూడ మిఠాయి తినాలన్న కోరిక ఉంటే లభిస్తుంది. అది యెలాగ అంటే బాబూ! మిఠాయి ఎన్నడూ తినలేదు, నాకు ఒక్కటి ఇప్పించు? అని అర్థిస్తే ఎవరికో ఒకరికి జాలి కలిగి యిప్పించడం జరుగుతుంది. అయితే ఇది మనలో ఉండే సాధారణ దయాస్వరూపం. భగవానుడు దయాసముద్రుడు. అతడు పాత్రతను చూడనే చూడడు. వీనికి దర్శనకాంక్ష ఉన్నది. వీనికి దర్శనం ఇవ్వడం నా కర్తవ్యం అని అతడు అనుకొనే విధంగా మన కోరిక పెరగాలి. మనం అతని బిరుదం, దయ, స్వభావము తలపోస్తు అతని దర్శనాన్ని కోరుకోవాలి. అప్పుడు మనం అపాత్రులం అయినా పాత్రులం అయిపోతాము. భగవానుని స్వభావం బహు కోమలమైనది. అతడు పరమదయాళువు. తన దాసులు దుఃఖపడుచుండగా చూచి ప్రకటం కాకుండ ఉండలేడు. అతడు దోషాలను చూడనే చూడడు. ఈవిధంగా మనం భగవానుని దయాప్రభావాన్ని హృదయంగమం చేసుకొని ఆ దయాబలం మీద దర్శనం పొందవచ్చును. మనం అపాత్రులం అందుచేతనే భగవానుని బడయలేకున్నాము అని అనుకోవడం మన తెలివితక్కువతనం. మనలో ప్రతి సోదరుడు భగవానుని దయవలన తాను పొందుతూ ఉన్న లాభాన్ని

ఆత్మ పరిశీలన దృష్టితో చూడాలి. మనం పొందుతూ ఉన్న లాభం అసంభవం అని మనకే అర్థం అవుతుంది. కారణం ఏమంటే మనం ఎక్కడ? భగవానుడు ఎక్కడ? తులసీరామాయణం ఉత్తరకాండలో భరతుడు - ప్రభూ! మీరు నా చేతలవంకకు చూడడం సంభవం అయితే నూరుకోట్ల కల్పాలు గడచినా నేను ఉద్ధరింపబడడం సంభవం కాదు అంటాడు. నాథా! మీరు దాసుల దోషాల వంకకు చూచువారు కారు. మీ స్వభావం బహు కోమలం అయినది. మీరు దీనబాంధవులు. నేను దీనుడను, అని కూడ అంటాడు.

దీనిని బట్టి భగవానుడు మనకు లభిస్తాడు అనే నమ్మకం కలుగుతోంది. రాములవారు భరతునికోసం పలికిన ప్రతి పలుకు మనకు కూడ వర్తిస్తుంది అని మనం అనుకోవాలి. మన అపరాధాలు భరతుని అపరాధాలకంటె అధికంగానే ఉండవచ్చును. ఎంత ఎక్కువగా ఉన్నా భగవానుని దృష్టిలో వానికి పరిగణనం లేదు. సూర్యకాంతి ప్రసరించినచోట చీకటి ఎక్కువగా ఉందా? తక్కువగా ఉందా? అన్నది ప్రశ్నయే కాదు. కాంతి ప్రసరించుటతో ఎంత చీకటి ఉన్నా పటాపంచలు అవుతుంది. ఇక్కడ ప్రతి సోదరుడు గమనించవలసిన విషయం ఏమిటి అంటే మనం మన విషయంలో ఆలోచించుకొని చాల నిమ్నస్థాయివాళ్లం అని తెలుసుకొంటున్నాం. భగవానుని వంకకు చూస్తే అతడు మన వంటి వాళ్లమీదనే అపారమైన దయను ప్రదర్శించేవాడు అవుతున్నాడు. మన వంటి వారినే కరుణిస్తున్నాడంటే ఇతరుల విషయం వేరే చెప్పవలెనా, అన్న భావన కలిగి మనకు పరమాశ్చర్యం కలుగుతుంది. మేము మీకు ఇన్ని శాస్త్రీయ విషయాలు చెపుతున్నాము అంటే ఇది మాకు ఏమైనా పిత్రార్జితమైన ఆస్తియా? ఇది మా సంపాదనయు కాదు. మూలసంగ్రహము కాదు. ఇది కూడ కేవలము భగవానుని దయయే కాని వేరుకాదు. నాకంటెను నిమ్నస్థాయికి చెందిన వాళ్లు ఎందరో ఉన్నారు. వారు కూడ భగవానుని దయా ప్రభావం చేత బ్రహ్మపదాన్ని కూడ పొందగలరు అంటే ఆశ్చర్యపడనక్కరలేదు. అయితే భగవానుని దయాప్రభావం మన మీద పనిచేస్తూ ఉందని, అది మన సాఫల్యాలకు అన్నిటికీ ప్రధానకారణం అని మనం అర్థం చేసుకోవాలి. విశ్వసించాలి. కాని నేను భగవానుని దయాప్రభావాన్ని ఒప్పుకొనేవాడను కానని ఎరిగిన

వాడను కానని ఆ దయా ప్రభావం ఎట్టిదో, దాని తత్త్వము, రహస్యము అంటే ఏమో నాకు ఏమీ తెలియదనీ, ఇట్టి విషయాలను నేను నమ్మనని అనేవానిమీద కూడ భగవానుడు దయచూపుతునే ఉంటాడు. అతని దయా ప్రభావాన్ని అర్థం చేసుకుని, విశ్వసించి చరించేవానిమీద దయ చూపుతాడని వేరుగా చెప్పవలెనా? కాబట్టి నేను చెప్పదలచిన సారాంశం ఏమంటే తనమీద భగవానుని దయ పని చేస్తోంది అని అనుకొనేవానిమీద అతడు అనుకొన్నదాని కంటె ఎక్కువగనే అది పని చేస్తూ ఉంటుంది. భగవానుని దయను, దాని తత్త్వాన్ని, రహస్యాన్ని ఎరిగిన వానికే ఆ దయచే అతడు ఎంత లాభం పొందుతున్నాడో తెలుస్తుంది. అయితే ఆ దయను దాని తత్త్వాన్ని, రహస్యాన్ని విశ్వసించని వానిమీదనే అపారంగా భగవానుని దయ ఉంది అన్నప్పుడు విశ్వసించేవానిమీద ఉండడంలో అబ్బురం ఏమి ఉంటుంది? వానిమీద దయ ఉండడం న్యాయము, సహజము కూడ, అందుచేతనే అపాత్రుని మీద కూడ భగవానునకు దయ ఉంటుంది అని చెప్పడం సంభవం అయింది.

భగవానునకు నా మీద అపారమైన దయ ఉంది. నేను అందుకు పాత్రుడను కాను. అయినా నామీద విశేషకృప ఉంది. అని ప్రతి మానవుడు అనుకోవాలి. అలా అనుకునేవానికి నమ్మేవానికి నాలుగు వంకల దయయే దయ గోచరిస్తుంది. తాను దయా సముద్రంలో మునిగి ఉన్నాడా? అనిపిస్తుంది. అతడు ఒక విధంగా దయానుభూతిని పొందుతూ ఉన్న కొలది అతనికి సర్వత్రా భగవద్దర్శనం కలగడం మొదలవుతుంది. అనుక్షణము భగవానుని లీల సాగుతూ ఉన్నట్లు గోచరిస్తుంది. ప్రతి వస్తువునందు, ప్రతి పదార్థమునందు భగవత్స్వరూపం కానవస్తుంది. జడచేతనముల ద్వారా సాగించబడే అతని క్రియ అనగా లీల గోచరిస్తుంది. అప్పుడప్పుడు మనం సాగించే రామలీల, కృష్ణలీలవంటి లీలలు మనం కల్పించుకొన్నవి కృత్రిమములైనవి. కాని సర్వత్ర కానవచ్చే ఆ లీల వాస్తవమైనది. అనుక్షణము భగవానుని దయను పరికించేవానికి అనుక్షణము భగవల్లీల గోచరిస్తుంది. లోకంలో వీస్తూ ఉన్నగాలి, లేదా మనస్సు, ఇంద్రియాల ద్వారా శరీరానికి అనుకూలంగా కాని, ప్రతికూలంగా కాని సాగే ప్రతిక్రియ భగవానుని లీలగానే భాసిస్తుంది.

మీరే ఆలోచించి చూడండి! మనం సినిమా చూచుటకు వెడతాము. అందులో ఎన్నో వింతలను చూస్తాము. అవి అన్నీ అసత్యస్వరూపాలు అని, నటనరూపమైన సినిమాప్రదర్శనం అది అని మనం యెరుగుదుము. అయినా చూచి ఆనందిస్తూ ఉంటాము. పర్యాయంగా చూడడానికి వెళుతూఉంటాం. నిజం చెప్పాలి అంటే సినిమా అనేది ఒక తమాషా, ఒక వినోదప్రదర్శన. అది నిజం కాదు. కల్పితం అయినది. మానవాకృతం అయినది. దానిని చూడడం మూర్ఖత్వం. భగవానుడు రచించి సాగిస్తూ ఉన్న తమాషా ముందు మానవకృతమైన తమాషా ఏ పరిగణనలోనికిరాదు. భగవానుని రచనకు సాటియే లేదు.

భగవానుడు ప్రకటమై లీలను ఆరంభిస్తే, మనం అతనిని భగవానుడు అని విశ్వసిస్తే అతని లీలను చూడగా చూడగా మనకు ఆనందంకలుగుతుంది, కలగాలి. ఆ భగవానుడే అలనాడు కృష్ణావతారంలో లీలలను సాగించాడు. నాటి భగవానుని ప్రతిక్రియా గోపికలకు లీలారూపంగానే గోచరించింది. కాని అతనిని భగవానునిగా నమ్మనివారికి అది లీలారూపంకాదు. బ్రహ్మదేవుడు భగవానుని భగవానునిగ గుర్తించలేదు, భావించలేదు. అందుచేత భగవానుని బాలలీల అతనికి లీల కాకుండ పోయింది. భగవానుడు లీల సాగిస్తున్నాడని, అట్లే కాకుంటే గోపకులను, గోవులను లేగలను గుహలోపలకు ఏల కొనిపోవును? గోపకులు ఆ లీలను లీలగానే భావించేరు. గోపికలు యింతగా భావించారు. భగవానుడు ఈ త్రోవనే వెడతాడు అని వాళ్ళు తమయింటి గుమ్మాల దగ్గర అతని దర్శనం కోసం నిలువబడి వుండేవారు. భగవానుడు గోవుల వెంట, గోవత్సముల వెంట వెడలువాడు. లేగలగిట్టల ఘట్టనం కారణంగా ఎగసి ధూళి భగవానుని దేహం మీద పడేది. అతడు ధూళిధూసరితుడు అయిపోవువాడు. ఒడలి నిండ ధూళియే ధూళి నిండిపోయేది. అతని ధూళిధూసరితస్వరూపాన్ని చూచి గోపికలు ప్రసన్నతను పొందేవారు. ఒడలి నిండ ధూళిపడినంత మాత్రాన సౌందర్యం పెరిగి మహత్త్వం వస్తుంది అంటే ఇతరులు కూడ ఒడలి నిండ ధూళి పులుముకొని ఆ మహత్త్వాన్ని పొందవచ్చును. కాని అలా చేయడం వలన ఎవరికీ ప్రసన్నత కలుగదు. అది గోపికల భావన. అందుచేతనే ఏరూపంలోనైన, ఏవిధంగానైన వారికి

భగవానుడే గోచరించేవాడు. అతని ప్రతి చేష్ట లీలారూపంలో గోచరించేది. భగవానుడు ఒక రూపంలో ఉండగా చేసిన ప్రతి చేష్ట లీల అయ్యేది. అనేక రూపాలు అనగా గోపబాలురు, లేగల రూపాలు ధరించినప్పుడు అతని చర్య విస్తృతలీల అయ్యేది. ఆ స్వరూపాల ద్వారా జరిగే ప్రతి చర్య భగవద్లీలయే అయ్యేది. అతనిని భగవానుడని భావించనివారికి అతడు ఏమి చేసినను ఏమీ కాదు. లోకం తత్త్వాన్ని, రహస్యాన్ని బాగా అవగాహనం చేసుకుని వర్తమానసమయంలో ఎన్ని సంసారస్వరూపాలు ఉన్నాయో అన్నీ భగవత్స్వరూపాలే అని యెవడు భావించుకుంటాడో, ఆ స్వరూపాలద్వారా జరిగే ప్రతి చర్య భగవద్లీలయే అని తలపోస్తాడో వానికి శ్రీకృష్ణపరమాత్మ, అతని లీలలు బాగా చేరువగా సాగుతున్నాయి అన్నమాట. సమస్తబ్రహ్మాండంలోనూ జరిగే చర్యల అన్నిటి కంటె బృహత్తరం అయిన లీల అవుతుంది. ఈ భావమే (గీత 6-31)లో ఈవిధంగా చెప్పబడింది.

**శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

సమస్త ప్రాణులందున నెలకొనియున్న పరమాత్ముడనగు నాతోడ ఏకత్వం పొంది అనగా సర్వత్రా పరమాత్ముడనైన నా స్వరూపాన్ని అనుభవపూర్వకంగా గ్రహించేవారి అనుభవంలో నేను తప్ప ఇతరం ఏదీ ఉండదు. సర్వత్రా భగవానుని దర్శించువాడు లోకంలో ఏమి చేసినా ఏ విధంగా ప్రవర్తించినా అది అంతా తనయందే చేస్తున్నవాడు అవుతాడు. తనతో కూడి యుండి తన లీలాకార్యక్రమాన్ని నడిపిస్తూ ఉంటాడని భగవానుడు చెప్పియున్నాడు. అందరును భగవత్స్వరూపాలుగా భావిస్తూ అందరితోడను అతడు సాగించే వ్యవహారప్రక్రియ అంతా భగవానునితోడ సాగించినట్టిదే అవుతుంది. అందరును భగవద్రూపులుగా అనుభవపూర్వకంగా గుర్తించినప్పుడు గుర్తించినవాని వ్యవహారము భగవానునితోడ ఎలా ఉండాలో అలాగే ఉంటుంది. అట్టివాడు అందరనూ భగవత్స్వరూపులుగా భావనం చేస్తూ రసాస్వాదనపూర్వకమైన ఆనందాన్ని పొందుతూ ముగ్ధుడు అవుతూ ఉంటాడు. అతని చేష్ట అంతా భగవానునితోడ రమణం అనగా క్రీడించుటలోనే సాగిపోతుంది. భగవత్స్వరూపానుభవం అన్నది కేవలము భావసంబంధమైనది.

అందరియందు భగవానుడు ఉన్నాడు. నేను భగవానునితోడ క్రీడిస్తున్నాను. ఆడుతున్నాను, రమణం చేస్తున్నాను అనే సహజభావన కావాలి. క్రీడ, రమణము, ఆట - ఈ మూడూ ఒకటే. అతని ఆనందానికి, కాంతికీ అవధులు ఉండవు. ఈ ఆనందము శాంతి అందరియందు ఉంటాయి. కేవలము వారిలో భగవద్భావన కావాలి. ఇప్పుడు ఈ విషయాలు అవగాహనకు రాకపోయిన భగవానుని మాటలను అర్థం చేసుకుని విశ్వసించినమీదట క్రమంగా ముందుముందు అవగాహనకు వస్తాయి. భగవానుడే స్వయంగా చెప్పాడు. ఏమని అంటే -

**శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥**

(గీత 6-30)

ఏ పురుషుడు సర్వత్ర నన్ను చూస్తాడో, సర్వమును నాయందు చూస్తాడో ఎలాగ అంటే మేఘాలలో ఆకాశాన్ని, ఆకాశంలో మేఘాలను చూచే విధంగా అన్నమాట. కన్ను మనస్సు ఎక్కడకు పోతే అక్కడ భగవానుని చూడాలి. ఇది సాకారానికి సంబంధించిన దృష్టాంతం. భగవానుని గోపికలు చూచేవారు కదా! అతడు వారి కన్నులలో మనస్సులలో నెలకొని ఉండేవాడు. ఇలా చెప్పడంలో ఉద్దేశ్యం ఏమంటే కన్నులలో ఏ వస్తువు నెలకొని ఉంటుందో అదే బయట కానవస్తుంది. ఆ కానరావడం సూక్ష్మంగా కావచ్చు. అలాగే మనం భగవానుని మన కన్నులలో, హృదయంలో నెలకొల్పుకుంటే మనకన్ను. హృదయము ఎక్కడకు పోయిన అక్కడ మనకు భగవానుడు గోచరిస్తాడు. భగవానుడు సర్వగతుడు, సర్వత్ర ఉన్నాడు అన్న భావనతో చూడాలి. అలా చూస్తే "తస్యాహం న ప్రణశ్యామి స చమే న ప్రణశ్యతి" అన్న పరిణామం కలుగుతుంది. అట్టివాని దృష్టిలో నేను దూరం కాను. అతడు నాకు దూరం కాడు, అన్నది భగవానుడు చెప్పేమాట అలా ఉండడంలో వచ్చేఫలితం -

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః**

(గీత 6-31)

సర్వభూతములందు నేనున్నాను. సర్వము పరమాత్మనైన నాయందు ఉన్నది. పరమాత్మనైన నాయందు ఉంటూ శారీరకంగా లోకవ్యవహారం చేసేవాడు నాయందే వ్యవహరించినవాడు అవుతాడు. అన్నది భగవద్వచనం. బ్రహ్మాండం అంతా పరమాత్మ యందు ఉందని, తాను కూడ పరమాత్మయందు ఉన్నవాడే అని, పరమాత్మ సర్వమునందు పరిపూర్ణుడై ప్రకాశించువాడని అనుభవపూర్వకంగా తెలుసుకొన్నవాడు లౌకికంగా సర్వవ్యవహారాలను సాగించువాడైనను పరమాత్మయందు సాగించినవాడే అవుతాడు. సర్వము పరమాత్మయందు ఉంది. తన శరీరం కూడ పరమాత్మయందు ఉన్నదే. పరమాత్మయందు అతడు తన్మయుడు అయిపోతాడు. అదియే ఏకత్వస్థితి. అలా ఏకత్వాన్ని పొంది పరమాత్మయందు నెలకొనియుండి అతడు వ్యవహారం సాగిస్తాడు. అతడు తనను తాను పరమాత్మకు సమర్పించి వేసుకుంటాడు. అనగా తనను భగవానునియందు విలీనం చేసుకుంటాడు. అతనిలో ఏకం అయిపోతాడు. అతనియందే ఆనందిస్తాడు. పరమాత్మతోడ తద్రూపుడు అయిపోతాడు. అతని చేష్టలు అన్ని పరమాత్మయందే సాగుతాయి. అతని లీల పరమాత్మయందే సాగుతుంది. వెలుపల కాదు. జ్ఞానం లేనివారం అయిన కారణంగా మనకు ఆ లీల భగవానునికంటె భిన్నంగా జరుగుతూ ఉన్నట్లు తోస్తుంది. మనచూపు నిరర్థకం ఏకత్వం పొందినవాని చూపు యుక్తం అవుతుంది. అతని ఆనందానికి, శాంతికి అవధులు ఉండవు. అతడు భగవానునితోడ ఆడుతూ ఉంటాడు. గోపబాలురు శ్రీకృష్ణభగవానునితోడ ఆడేవారు, పాడేవారు. కాని వారి ఆటపాటలు భగవానునితోడ అప్పుడప్పుడు మాత్రమే సాగేవి. కాని ఏకత్వం పొందినవాని లీల 24 గంటలు సాగుతునే ఉంటుంది. గోపకుల లీలకంటె ఇతని లీల మూల్యవంతమైనది. మహత్తరమైనది.

# భగవానుని అవ్యాజసుహృద్భావము

భగవానుడు దయామయుడు. దయ వహించియే అతడు అందరినీ ఉద్ధరిస్తూ ఉంటాడు. అతడు గొప్ప ప్రేమలక్షణం కలవాడు. భగవద్గీతలో అతడు తనను గూర్చి స్వయంగా - "సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి"(5-29) అని చెప్పియున్నాడు. అనగా ఎవడు నన్ను సమస్తప్రాణుల యందు సుహృద్భావం కలవానిగా గుర్తిస్తాడో ఆ సాధకుడు శాంతిని పొందుతాడు అని భావం.

మేము భగవానుని పరమదయాళువని. విశేష ప్రేమలక్షణాలు, కలవాడని, అవ్యాజంగా దయ చూసేవాడని భావిస్తున్నామని మీరంటే భావించడంలేదు. కేవలం నోటిమాటగా చెపుతున్నారు. ఆ భావన హృదయపూర్వకంగా మనం భగవానుని ఎప్పుడు గుర్తిస్తామో, అప్పుడు ఆ స్వామిని విడిచి మఱియొకనిని ప్రేమించనే ప్రేమించము. భగవానుడు తన్ను ప్రేమించే వారికి అధీనుడుగా అమ్ముడైపోతాడు. భగవానుని హార్థికంగా ప్రేమించేవాడు ఆ స్వామిని కొననూగలడు. అమ్మివేయనూగలడు. ప్రేమ భక్తి మార్గాన్ని అవలంబించి వారికి ఆ స్వామియొక్క దర్శన భాగ్యం కలగడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

"హరి బ్యాపక సర్వత్ర సమానా, ప్రేమ తే ప్రగటహోహి మై జానా" (తులసీదాసు) అనగా హరి సర్వత్రా వ్యాపించి ఉంటాడు. ఎక్కడ ప్రేమ ఉంటే అక్కడ ప్రకటం అవుతూ ఉంటాడు అని భావం. అయితే ఆ స్వామి తనను ప్రేమించే వానికి దర్శనం మాత్రం ఇచ్చి ఊరకుంటాడని అనుకోరాదు. అతనికి వశవర్తి కూడ అవుతాడు. అందుకు ప్రమాణంగా 'అహం భక్తపరాధీనః అని ఆస్వామి చెప్పే ఉన్నాడు అంటే నేను భక్తుని వశంలో ఉంటాను అని భావం - అంతేకాదు భక్తుడు ముందు ముందు నడుస్తూ ఉంటే ఆ స్వామి భృత్యుని వలె వాని వెనుక నడుస్తూ ఉంటాడు. ఆ భక్తుని పాదధూళి తనమీద పడాలని దానివల్ల తనకే పవిత్రత వస్తుందని భావిస్తూ ఉంటాడు. ఇందుకుప్రమాణం ఏది?

అంటారేమో? ఇదిగో ఆ స్వామి చెప్పినమాట.

**"అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః"**

అనగా భక్తుని పాదధూళి సోకితే అనుగమిస్తాను అని భావం. కారణం ఏమంటే" భక్తునికి అట్టి సదవకాశం ఉంది. ఇందుకు ప్రమాణం - "యే యథా మాంప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్". అన్నమాట అంటే ఎవరు నన్ను ఏవిధంగా సేవిస్తే వారిని నేను కూడ ఆ విధంగానే భజిస్తాను అని భావం.

అంతేకాదు, ఏ భక్తుడైనా తన్ను ఎవరికైనా అమ్మివేస్తే అనగా అర్పించివేస్తే భగవానుడు ఏమంటాడో ఎఱుగుదురా? అవును! నా భక్తుడు నన్ను ఇచ్చివేయగలడు అమ్మివేయగలడు అనియే అంటాడు. అట్టి ఉదాహరణ గాథలు కూడా ఉన్నాయి. నరసీమెహతా (ఒక భక్తుడు) విషయంలో భగవానుడు ఏమన్నాడు? "బేచే తో బిక్ జాఊ, నరసీ మ్హారో సిర ధనీ" అన్నాడు. అంటే నరసీమోహతా నా ప్రభువు. అతడు నన్ను అమ్మివేస్తే అమ్ముడైపోతాను అని భావం.

నరసీమెహతా ఒకసారి శ్యామల్‌షా అనే పేరుతో భగవానుని పేరన రూ.750/-లకు ఒక చెక్కు వ్రాసి ద్వారకకు పోవుచున్న వారికి ఇచ్చేడు. వాళ్లు ఆ చెక్కును తీసుకుని ద్వారకకు వెళ్లి అక్కడ శ్యామల్‌షాను వెదకి పట్టుకుని ఈ చెక్కును అతడికి చూపి అతడి దగ్గర డబ్బు తీసుకోవలసి ఉంది అన్నమాట! ద్వారకలో 'నరసీమెహతాకు పెద్ద దుకాణం ఏదో ఉంది. శ్యామల్‌షా అనేవాడు అందులో ఉండే గుమస్తా' అని వాళ్లు అనుకున్నారు. నరసీమెహతా మహాభక్తుడు. శ్యామసుందరుని (శ్రీకృష్ణుడు) పేరే శ్యామల్‌షాగా ఒక్కగొప్ప సేటుగారి పేరు లాగ అతడు మార్చి వ్రాసేడని పాపం! వాళ్లు ఏమెఱుగుదురు? ఆ చెక్కును తీసుకొని వాళ్లు ద్వారకకు వెళ్ళేరు. అక్కడ శ్యామల్‌షా కోసం విచారణ చేసేరు. అతడు దొరకలేదు. మీ దగ్గర చిరునామా ఏదీ లేదా? అని అచ్చటివాళ్ళు వీరిని అడిగేరు. ద్వారకాధీశుని ఆలయము దగ్గర ఉండే శ్యామల్‌షా అని వీరు సమాధానం చెప్పేరు. ఇక్కడ ఆ పేరుగలవాడు ఎవ్వడూ లేడు. అతని దుకాణమూ ఏదీ లేదు. మిమ్మల్ని ఎవరో మోసం చేసేరయ్యా! అక్కడివాళ్ళు బదులు చెప్పేరు. అప్పుడు

చెక్కుతెచ్చుకున్న వాళ్లు పశ్చాత్తాపంతో తిరుగుముఖం పట్టిపోయి నరసీమెహతాను బాగా అవమానించాలని నిశ్చయించుకున్నారు. అప్పటికి చీకటిపడి రాత్రి సమయం అయింది. అప్పుడు ప్రయాణం అనుకూలం కాక వాళ్లు ద్వారకాధీశుని (శ్రీకృష్ణపరమాత్మ) ఆలయం ప్రక్క పరున్నారు. చాలా దుఃఖదశలో ఉండడం చేత వాళ్లకు నిద్రపట్టడం లేదు. ఊరికే మెలకువగానే పరున్నారు. అంతలో మాఋవేషంలో భగవానుడు వాళ్ల దగ్గరకు వచ్చి అయ్యలారా! ఇక్కడ ఎవరి దగ్గరైనా నా పేర వ్రాయబడిన రూ.750/-ల చెక్కు ఉందా? నేను ఆ చెక్కు తెచ్చినవారికోసం ఎదురు చూస్తూ ఉన్నాను. అని ప్రశ్నించేడు. ఆ! ఆ! ఆ చెక్కు మాదగ్గరే ఉంది. మేమే తెచ్చేము. మీరున్న చోటు తెలియక ఇక్కడ పడి ఉన్నామని వీళ్లు బదులు చెప్పేరు. అప్పుడు గుమాస్తావలే ఉన్న భగవానుడు బాబూ! ఇదిగో రూ.750/-లు తీసుకోండి! ఆ చెక్కు నాకు ఇచ్చెయ్యండి! అంటూ డబ్బు ఇచ్చి చెక్కు తీసుకున్నాడు. తరువాత అతడు చెక్కు తెచ్చినవాళ్లతో - బాబూ! మీతో నాది ఒక్క మనవి. సేటు నరసీమెహతా దగ్గరకు వెళ్లినప్పుడు మీరు బాబ్బాబూ! నన్ను గూర్చి చెడ్డగా చెప్పకండి? మీరే నన్ను మన్నించి నా తప్పు కాయాలి. నావల్ల చాలా పొరపాటు అయింది. పాపం! మీరు నాకోసం వెదుకుతూ ఉన్నట్లు ఎవరోనాతో చెప్పారు. విని పరిగెత్తుకొని వచ్చాను. కాబట్టి మా అయ్యగారి దగ్గర నేను అపరాధం చేసినట్లు చెప్పకండి? నన్ను క్షమించండి! అంటూ సవినయంగా క్షమాభిక్ష కోరుకొని వెడలిపోయాడు. ఔర! ఈ గుమస్తా ఎంత మంచివాడు? మనం ఇక్కడనుండి వెళ్లిపోయి ఉంటే నరసీమెహతాను ఎన్నో తిట్లు తిట్టి ఎంతగానో అవమానించి ఉండేవాళ్ళం గదా! ఇతడు ఎవడో మనం ఉన్న చోటుకే వచ్చి డబ్బు ఇచ్చిపోయేడు. అని వాళ్లు తమలో తాము అనుకొని ఎంతో సంతోషపడ్డారు.

అనంతరం వాళ్లు మళ్లీ రెండవసారి నరసీ దగ్గరకు వెళ్లి తమకు మళ్లీ చెక్కువ్రాసి ఇమ్మని కోరేరు. ఎవరిపేరిట? అన్నాడు నరసీ. శ్యామల్‌షా పేరటనే అన్నారు వాళ్లు. అంతేకాదు. వాళ్లు ఇంకా ఇలా అన్నారు - మీ గుమస్తా ఎంత ఉత్తముడు అండీ? మా చెక్కుకు చెల్లుబడిగా డబ్బును మేము ఉన్న చోటుకే తెచ్చి ఇచ్చి వెళ్ళాడు తాను ఏ అపరాధం చేయకపోయినా

తన అపరాధం మన్నించమంటూ ఎంతో వినయంగా మాటలాడాడు. అతని యింటిదగ్గర అతడు మాకు దొరకలేదు. అతడే మమ్మల్ని వెదుక్కుంటూ మేము ఉన్న చోటుకి వచ్చాడు. అంతమంచి గుమస్తాను ఎక్కడా మేం చూడలేదు. ఆహా! మనిషి అంటే అతడే మనిషి, ఉత్తముడు. ఈ మాటలు విని నరసీ ఇలా అన్నాడు. మీరు బహుపుణ్యాత్ములు, ధన్యాత్ములూనూ. అయ్యా! ఆ వచ్చినవాడు సాక్షాత్తూ ద్వారకాధీశభగవానుడయ్యా! నేను మీకు చేతులు జోడించి నమస్కరిస్తూ ఉన్నాను. మీకు భగవత్సాక్షాత్కారం అయింది.మాకు అక్కడ దుకాణమూ ఏదీ లేదు. గుమస్తా ఎవ్వడూ లేడు. మీరు చెక్కో! చెక్కో! అని నన్ను వేధిస్తూ ఉంటే మిమ్మల్ని వదలించుకోవడానికి నేను మీకు అలా శ్యామల్‌షా అనే పేరుతో భగవానుని పేర చెక్కు వ్రాసి ఇచ్చాను. ఆ చెక్కు చెల్లుబడి అయింది అంటే అది మీ మహాభాగ్యం. ఈ మాటలు విని వాళ్లు ఎంతో పశ్చాత్తాప పడ్డారు. మళ్లీ ద్వారకకు వెళ్లి ఆ వ్యక్తికోసం వెదకేరు. కాని ఇప్పుడు అతడు వీరికి ఎక్కడ దొరుకుతాడు? చూచేరు కాదా? భగవానునిపేర చెక్కువ్రాసి ఇవ్వడం అతడిని అమ్మకం వంటి చర్యే అయింది. అయితే ఇందులో మరొక విశేషం ఉంది. అదేమంటే భక్తుడు ఇతరులకు కూడ భగవద్దర్శనం చేయించగలడు అనేది. అట్టి భక్తుడికి స్వయంగా భగవద్దర్శనం ప్రాప్తించడంలో ఆశ్చర్యం ఏముంటుంది?

భగవానుని ప్రేమ విషయం చాలా లోతైనది. అది యిట్టిది అని చెప్పడానికి వాక్కుకు శక్తి లేదు. ఇలాంటిది అని ఊహించి వాక్కు ద్వారా దృష్టాంతాలను ప్రతిపాదించడానికి మనస్సుకి సామర్థ్యం లేదు. ఇదమిత్థం అని నిర్ధారించడానికి బుద్ధికి పట్టు దొరకదు. అసంఖ్యాకమైన బ్రహ్మాండాలకు అధిపతియైన భగవానునికి మనవంటి అల్పప్రాణులతో సుహృద్భావమా? ఆ స్వామికి మనతోటి సమానత్వమా? అనే విషయాన్ని మనం విచారణ చేసి అర్థం చేసుకోవాలి. అయితే ఒక్క ఐశ్వర్యం అనే అంశాన్ని దృష్టిలో పెట్టుకొని ఆ స్వామి ప్రభావాన్ని అంచనా కట్టడమా? అన్నది నా ప్రశ్న. నేను ఇక్కడ భగవానుణ్ణి ఏమన్నాను? అసంఖ్యాకబ్రహ్మాండాధిపతి అని కదా అన్నాను! ఈ మాట ఆ స్వామి ప్రభావాన్ని పూర్తిగా వ్యక్తం చేయగల

మాటయా? కాదు. బాగా నిమ్నస్థాయికి చెందిన మాట. అన్నన్నా! ఏమి? అసంఖ్యాకబ్రహ్మాండాధిపతి బహునిమ్నస్థాయివాడా? అని ప్రశ్నించవచ్చును. కాని ఇది ఐశ్వర్యాపేక్ష కలవారికోసం చెప్పిన మాట. భగవానుని ఐశ్వర్యమయరూపం మాత్రమే ఇందులో వ్యక్తం చేయడం జరిగింది. ఒకటా? రెండా? మూడా? ఇరువదా? లక్ష లక్ష బ్రహ్మాండాలకు అధిపతి ఆ స్వామి. ఇలా మనం ఆ స్వామిని భావన చేస్తే కోరినవారికి ఆ ప్రభువు ఒకటి రెండు బ్రహ్మాండాలు మాత్రం ఇవ్వగలడన్న భావమే వస్తుంది. అంటే మనం భగవానుని ప్రభావాన్ని బ్రహ్మాండపు ఐశ్వర్యంతో కొలత వేస్తున్నా మన్నమాట! ఈ విధంగా ఆ స్వామి ఐశ్వర్యవంతుడు మాత్రమే అయ్యాడు. వేలాది గ్రామాలకు ఒక ఏలిక అన్నట్లు వేలాది బ్రహ్మాండాలకు ఆయన ప్రభువు. ఏలిక సంతోషిస్తే ఒకటి రెండు గ్రామాలు ఇస్తాడు. భగవానుడు ఐశ్వర్యానికి అధిపతినో లేక బ్రహ్మనో చేస్తాడన్న మాట! భగవానుని మహత్త్వం విషయంలో మన భావాలు ఇలా బహుసంకుచితంగా ఉన్నాయి.

భగవానుడు ఐశ్వర్యమయుడు మాత్రమే కాదు. అతడు ఈశ్వరుడు, ఆనందమయుడు, చిన్మయుడు, జ్ఞానమయుడు కూడ. కాని ఈ అంశాలను మనం తలపులోకి అయినా తెచ్చుకోవడం లేదు. నా ఆత్మ అల్ప జ్ఞానం కలది. పరమాత్మ సర్వజ్ఞానం కలవాడు. నేను ఘటాకాశం వంటివాడను. పరమాత్మ మహాకాశంవంటివాడు అని అనుకోండి! ఇక్కడ భగవానుని ఔదార్యం ఎలా ఉందో చూచేరా? ఘటాకాశంలాగా ఉన్న జీవుడు పరమాత్ముని శరణు పొందితే ఘటాకాశస్థానంలో ఉండే ఆ పరమాత్మ ఆ జీవుని చేతిలో ఆత్మసమర్పణ చేసుకుంటున్నాడు.

సారాంశం ఏమంటే ఎవరైతే భగవానుని ముందు తన్నుతాను ఆత్మసమర్పణంగా అర్పించివేసుకుంటాడో వాని ముందు భగవానుడు కూడ తన్ను తాను అర్పించేసుకుంటాడు. చూచేరా? ఆ స్వామి ఎంత పరమౌదార్యం కలవాడో? నిజం ఆలోచిస్తే ఆస్వామిముందు మన స్థాయి ఎంత? మనం ఏ పరిగణనలోనికి వస్తాము? మనం బహు అల్పజ్ఞులం. బహు కొంచెపువాళ్లం. పరమాత్మయో? అవధులు లేనంత మహత్త్వం కలవాడు. నాయనలారా! మీదృష్టిని ఆయన మహత్త్వం మీద నిలపకండి!

ఆ స్వామి మహాజ్ఞానస్వరూపుడు. చేతన స్వరూపుడు. ఆ సర్వజ్ఞుడైన పరమాత్మ తన సర్వజ్ఞత్వాన్ని తన్ను శరణుపొందిన అల్పజ్ఞులకు అర్పించినాడు, మనం మన అల్పజ్ఞత్వాన్ని ఆ సర్వజ్ఞునకు అర్పిస్తున్నాము కాబట్టి నాయనలారా! మీరు ఆ స్వామియొక్క సర్వజ్ఞత్వాన్నీ గుర్తించండి. మీ అల్పజ్ఞత్వాన్ని తెలుసు కొండి! అట్లు చేస్తే మీరు భగవానుని ప్రభావాన్ని జ్ఞానం దృష్టితో కొలిచినట్లు సర్వజ్ఞత్వం దృష్టిలో తూచినట్లూ అవుతుంది. ఆ స్వామి మహత్త్వానికి ఐశ్వర్యం కొలబద్ద కానేకాదు. ఐశ్వర్యం నశ్వరం అయినది. అది మిథ్యాపదార్థం. దానిని కొలబద్దగా చేసుకొని మీరు ఆ స్వామి ప్రభావాన్ని కొనడం ప్రారంభిస్తే మీరు ఆ స్వామిని సరిగా అర్థం చేసుకున్నవారు కానేకారు.

ఈవిధమైన పరిజ్ఞానాన్ని పొందిన మానవుడు భగవానుని విడిచి మరియొకరిని ప్రేమించనే ప్రేమించడు. అతడు ఐశ్వర్యాన్ని చూచి మోహాన్ని పొందడు. ఇదంతా మాయ మిథ్య. స్వప్నతుల్యం అనే అవగాహన వాడికి కలుగుతుంది. తనను ప్రేమించేవాని చేతిలో తాను అమ్ముడుపోయేటంత పరమోజ్జ్వలప్రేమలక్షణం కలవాడు పరమాత్మ. అతడు ఈయలేనిది ఏమీలేదు. తనను ప్రేమించేవానికి తనను తాను అర్పించివేసుకుంటాడు. ఒక వ్యక్తి తనను ప్రేమిస్తూ ఉన్నందులకు బదులుగా పరమాత్మ తననే వానికి అర్పించుకుంటున్నాడు అంటే అది ఎంతటి పరాకాష్ఠకు చేరిన ప్రేమ? ఎంత అవధులు మీటిన ఔదార్యం?

భగవానుని మనం దయాసముద్రుడు అంటాం. ఈ దయాసముద్రుడు అన్న శబ్దం కూడ ఆ స్వామిలోని సమగ్రదయాస్వరూపాన్ని వ్యక్తం చేయగలది కాదు. ఇది కూడ నిమ్నస్థాయికి చెందిన శబ్దమే అవుతుంది. కారణం ఏమి అంటే సముద్రానికి కూడ ఒక హద్దు ఉంది. కాని ఆ హద్దు భగవానుని దయకు లేదు. లోకంలో సర్వత్రా వ్యాపించియున్న దయ అంతా ఏకత్రితం చేయబడితే అది ఆ దయాసముద్రానికి సంబంధించిన ఒక బిందువు మాత్రమే అవుతుంది. కాబట్టి ఈ శబ్దం భగవానుని దయను పూర్తిగా వ్యక్తం చేయలేదు. నన్ను దయాళువుగా భావించు! నీకు శాంతి చేకూరుతుంది. అని భగవానుడే అన్నాడు అని మనం అంటాం. అయినా

ఆ దయాస్వరూపం పూర్తిగా మన అవగాహనకు రాలేదనే చెప్పాలి.

ఆ పరమపురుషుని చేరడానికి లేదా ఆ స్వామి దయను పొందడానికి మనం అర్హులం కాము అని అనుకున్నాం అనుకోండి. అర్హులం కానిమాట నిజము. మనకు భగవద్దర్శనం ప్రాప్తించడం అసంభవం అని మనం అనుకున్నాం అనుకొండి! అందువల్ల మనలో నైరాశ్యం ఏర్పడుతుంది. ఈ నైరాశ్యం భగవానుని కృప విషయంలో మనకు సరియైన పరిజ్ఞానం లేకపోవడం వల్ల వచ్చిన పరిణామం. భగవానుడు అనవధిక మహాదయారాశి. ఆ స్వామి మనలోని అవగుణాలవంకకు కన్నెత్తి కూడ చూడడు అని మనం అనుకున్నాం అనుకొండి! అప్పుడు మనలో నైరాశ్యం పుట్టనే పుట్టదు. భగవానుడు భక్తుని దీనత్వాన్ని పాత్రతను గమనించి దయతో దర్శనం ఇస్తూ ఉంటాడు. అనే తాత్త్విక విషయాన్ని అర్థం చేసుకున్ననాడు మనకు నిరాశత్వం కలుగదు. మనం ఎన్నో అపరాధాలు చేస్తున్నాం. అయినా ఆ స్వామి మనలను దండించడం లేదు అంటే అందులోనే ఆ స్వామి ఎంత దయామయుడో వ్యక్తం అవుతుంది. అయినా దండించడంలేదు అనుకోరాదు. ఆ స్వామి తన దర్శనం ఇవ్వని రూపంలో దండిస్తూనే ఉన్నాడు. ఆ దర్శనరాహిత్యాన్ని దండనము అనే అనుకోండి! ఆ పరమాత్మ మనలోని అవగుణాలను తలపెట్టను కూడా తలపెట్టకుండా ఉంటూ ఉన్నప్పుడు. మనలో ఉన్న అవగుణాలను చూచియే ఆ స్వామి దర్శనం ఇవ్వడంలేదని మనం ఎందుకు అనుకోవాలి? ఆ స్వామి మనలోని దోషాలను తలపెట్టను కూడ తలపెట్టనివాడా? మనమేమో మన అవగుణాలను ఆ స్వామి గమనిస్తూనే ఉన్నాడని అంటున్నామా? ఇక మన దృష్టిలో భగవానుని యందు దయాళుత్వం ఎక్కడ నిలిచింది? అట్లు కాదు. మనం భగవానుని పరమదయాళువుగా భావించాలి. అతని ప్రశస్తిని గుర్తించాలి. మనకు భగవద్దర్శనం తప్పక లభిస్తుంది. అనే నమ్మకం ఉండాలి. అట్లున్ననాడు మనం ఆ స్వామి దర్శనానికి ఎన్నడూ దూరం కాము. భగవానుడు ఎంత దయామయుడో మనం అర్థం చేసుకున్నది ఏదీ? అతణ్ని దయామయుడని భావిస్తూ ఉండికూడ అతని దర్శనం పొందలేకున్నాం అంటే అతని దయాగుణాన్ని మనం సరిగా అర్థం చేసుకోలేదనే చెప్పాలి. నిజంగా భగవానుణ్ని మనం

దయామయుడని భావించలేదనే చెప్పాలి. భగవానుడు పాత్రుడు అయినవానికి దర్శనం ఇస్తూనే ఉన్నాడు. ఇది పరిపాటియే. ఇందులో ఆశ్చర్యపడవలసిన విషయం లేదు. భగవానుడు జిజ్ఞాసువు అయినవానికి, శ్రద్ధాళువైనవానికి. తనను ప్రేమించేవానికి దర్శనం ఇస్తూఉంటాడు. అది న్యాయమే ఒక విధంగా, భగవానుడు ఎవడు ఎంతనీచుడైనా, ఎంత పాపాత్ముడైనా వాని నీచత్వం వంకకు, పాపం వంకకు చూడకుండ అపాత్రునకు కూడ దర్శనం ఇస్తూ ఉంటాడు. ఇంతకంటె మరియొక కుపాత్రుడు లేడు. ఇంతకంటెపరమనీచుడు లేడు అని అనబడేవానికి కూడ భగవానుడు దర్శనం ఇస్తూ ఉంటాడు. అయితే మనం చేయవలసినది మాత్రం ఇది. ఆ స్వామిని సర్వులయందు సుహృద్భావం కలవాడని అకారణంగా దయ చూపేవాడని, అవ్యాజంగా ప్రేమించేవాడని త్రికరణ శుద్ధిగా భావించుకుంటూ ఉండాలి. నమ్మాలి.

మేము అపాత్రులం కనుకనే భగవానుడు మాకు దర్శనం ఇవ్వలేదు. అని మనం అంటాం అనుకోండి! అప్పుడు భగవానుడు అకారణంగా దయ చూపేవాడని, అవ్యాజంగా ప్రేమించేవాడని, అందరియందు సుహృద్భావం కలవాడని భావిస్తున్నాం అని మనం ఎలా చెప్పగలం? అప్పుడు మనం ఏదో ఒక కారణం ఉంటేనే భగవానుడు దయ చూపుతాడని భావించేవాళ్ళం అయ్యేమన్నమాట. నిజం చెప్పాలంటే ఆ స్వామి హేతురహితంగానే దయ చూపుతూ ఉంటాడు. మనకు ఈ మానవశరీరం ప్రాప్తించింది. అంటే దానికి కూడ ఆ స్వామియొక్క నిర్హేతుకమైన కృపాకటాక్షమే కారణం. ఈ శరీరాన్ని మనకు ఆ స్వామి మన ఆచరణలను చూచియే ఇచ్చేడంటారా? భగవానుడు ప్రజలకు ఉపదేశం చేస్తూ తులసీరామాయణంలో ఏమన్నాడో చూడండి!-

**"కబహుక కరి కరునా నర దేహీ! దేత ఈశబిను హేతు సనేహీ".**

అనగా భగవానుడు ప్రేమశీలుడు. దయామయుడు అవడం చేత తన ప్రశస్తిని అనుసరించి ఒక్కొక్కప్పుడు నిర్హేతుకమైన కుణా లక్షణాన్ని ప్రదర్శిస్తూ దర్శనం ఇస్తూ ఉంటాడు అన్నమాట. అట్లు కాక ఆ స్వామి జీవులవంకకు చూచి, వా పరిస్థితులను పరిశీలిస్తూ ప్రవర్తిల్లేవాడు అయితే

మానవసృష్టి జరిగేదే కాదు.

ఆ స్వామి సదయుడై మనుష్యులను సృజిస్తూ ఉండడం చేతనే మానవసృష్టి సాగుతూ వస్తోంది. ఆచరణలను బట్టి ప్రవర్తిల్లాలి అంటే ఏ జీవునకూ మానవ శరీరం రావడం అసంభవమే అవుతుంది. అందుచేత భగవానుడు మానవశరీరాన్ని ధరించే అవకాశం అందరికీ ప్రాప్తించవలసిందే అనే భావంతో కుపాత్రుడు, అపాత్రుడు అని చూడకుండా జీవులను మానవులుగా పుట్టే అవకాశం కలుగజేస్తున్నాడు.

ఒకవిధంగా తనను ప్రేమించనివాడిని కూడా భగవానుడు ప్రేమిస్తూ ఉంటాడు. భగవానుడు మానవులకు ఎప్పుడూ దర్శనం ఇవ్వాలనే ఆరాటపడుతూ ఉంటాడు. దర్శనం ఇవ్వడానికి ఏమి నెపం దొరుకుతుందా? ఏ నిమిత్తం ఏర్పడుతుందా? అని పరికిస్తూ ఉంటాడు. కాబట్టి భగవానుడు పాత్రుడు, అపాత్రుడు అనే వివక్ష లేకుండా అందరియందు సమానమైన దయాప్రసారం కలిగి ఉంటాడు. అని మనం త్రికరణశుద్ధిగ హృదయపూర్వకంగా భావించుకుంటూ ఉంటే చాలు! ఆ స్వామి హృదయంలో దయ ఉదయిస్తుంది. ఒక తల్లి బిడ్డలకు అందరకూ సమానంగానే మధుర పదార్థాలను పంచి ఇస్తుంది. వారిలో ఒకడు దుర్మార్గుడు, దుండగుడు అయి ఉన్నాడనుకోండి! వాడికి కూడ అందరికీ ఇచ్చినట్లు మధురపదార్థం చేస్తేనే కాని ఆమెకు మనసు ఒప్పదు. కాని తనకు ఇచ్చినదాన్ని ఆ పిల్లవాడు కాలదన్ని వెడలిపోతే ఆమె ఏమి చేస్తుంది? ఆ విధంగానే భగవానుడు. సదయుడై దర్శనం ఇవ్వడానికి సిద్ధంగానే ఉంటాడు. కాని మనమే ఆ దర్శనాన్ని పొందలేకున్నాము. కారణం మనం ఆ స్వామి యొక్క దయలోని అంతర్యాన్ని గుర్తెఱుగకపోవడమే. గుర్తెఱిగి ఉంటే మనం మన ఆచరణ వంకకు దృష్టిని ఎందుకు మరలిస్తాము? భగవానుని దయాపూరితమైన స్వభావం వంకకే దృష్టిని మరలించుకునే వాళ్లం. ఆ స్వామియొక్క కరుణ మీదనే మన దృష్టి నిలిచిననాడు మనకు భగవానుడు లభించకుండా ఎలా ఉంటాడు? అంటే ఆ లోపం ఏదో మనలోనే ఉందన్నమాట. మనం భగవానుని ప్రభావాన్ని ఎరుగనే ఎరుగము. పైగా అతణ్ని దయలేనివాడు అని కూడ అంటున్నాము. నిర్దయాత్ముడిగా భావిస్తూ

ఉన్నట్లు మీరు ఎట్లు చెప్పగలరు? అంటారేమో? దయాళువని భావించి ఉంటే ఆహా! ఎంత అపారదయ? అంటూ ఆ స్వామి దయను తలచుకుంటూ ముగ్ధులం అయిపోయేవారమే కదా!.

తన దర్శనం కావాలని కోరని వాడికి కూడ భగవానుడు దర్శనం ఇచ్చిన సందర్భాలు ఉన్నాయి. అయినా వాడు స్వీకరించకుంటే భగవానుడు ఏం చేస్తాడు? దుర్యోధనుడు ఉన్నాడు అనుకోండి! భగవద్దర్శనం పొందడానికి వాడికి అర్హత ఉందంటారా? శ్రీకృష్ణ భగవానుడు తన అవతార రూపంలో దుర్యోధనుడికి. తదితరులకు కూడ దర్శనం ఇస్తూనే ఉండేవాడు. అయితే అతడు మానవమాత్రుడో భగవానుడో ఎలా తెలుస్తుంది? అని మీరు అంటారు. కాని ఆ దుర్యోధనుని సభలోనే ఆ శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు కదా! అలా విశ్వరూపప్రదర్శనం ఏ మానవుడైనా చేయగలడంటారా? కాబట్టి అతడు సాధారణమానవమాత్రుడు కాదనడం తథ్యం. ఈ విధంగా భగవానుడు తనను వాళ్లు కోరకుండానే. అపేక్షించకుండానే అపాత్రులకు కూడ దర్శనం ఇచ్చాడు. కాని వాళ్లుదర్శనం పొంది కూడ అతడిని భగవానుడని గుర్తింపలేకపోయారు. దర్శనం పొంది కూడ భగవత్ప్రాప్తికి దూరం అయ్యారు. అయితే భగవానుని దయలో మాత్రం లోపం ఏదీ లేదు.

ఆ స్వామి తనకు విషం ఇచ్చిన పూతనకు కూడ మోక్షం ఇచ్చాడు. ఏ విధంగా అయితే ఏమి? ఈమెకు నాతో సంబంధం ఏర్పడింది కదా! దాని దుండగాల వంకకు నేను ఎందుకు చూడాలి? నాకర్తవ్యాన్ని, నా ప్రశస్తిని నేను అనుసరిస్తాను అన్నదే ఇక్కడ భగవానుని భావన, భక్తుని కర్తవ్యంతో ఆ స్వామికి పనిలేదు. ఇతర దుష్టాత్ముల కర్తవ్యాల వంకకు కూడ ఆ స్వామి చూడడు అయితే భక్తుని పనివంకకు కూడా చూడడు. అనివేరుగా చెప్పాలా? ఆయన ఎప్పుడూ తన ప్రశస్తి వంకకే చూచుకుంటాడు. అతడు తన ప్రశస్తినే చూచుకొనే పరిస్థితిలో మనం అందరమూ పాత్రులమే అవుతాము. కాని ఆ స్వామి దయను మనం స్వీకరించకపోతే ఆ స్వామి ఏం చేస్తాడు? భగవానుడు పరమదయాళువు అనడాన్ని మాత్రం మనం ఒప్పుకు తీరాలి. ఆ స్వామి దయవంకే మనం చూచిననాడు మన హృదయం

ద్రవించిపోతుంది. కదలిపోతుంది. తరువాత భగవానుడు లేకుండా మనం నిలువనే లేము.

చంటిపిల్లవానికి తల్లియొక్క దయాప్రభావం కొంచెం తెలుస్తుంది. ఒకటి రెండు ఏళ్ల పిల్లవాడైతే తల్లిని విడిచి ఉండనే లేడు. వానిని విడిచి తల్లి దూరంగా వెడితే ఆమె తిరిగి వచ్చేవరకు వాడు ఏడుస్తునే ఉంటాడు. ఏడవడం తప్ప వాడు ఏమీ చేయలేడు. కాని మనమో? తల్లి దూరంగా వెళ్లినా, దూరం అయినా కూడ ఏడవం. తల్లియొక్క దయాప్రభావాన్ని పిల్లవాడు ఎక్కువగా గుర్తిస్తాడు. వాడు ఆమె మా అమ్మ అంటాడు. మా అమ్మ మంచిది. దయగలది అంటాడు. మా అమ్మకు నేనంటే ఎంతో ఇష్టం అంటాడు ఇలా తల్లిదయను గుర్తించిన పిల్లవాడు ఆ తల్లివియోగాన్ని భరించలేడు. కాని మనమో భగవద్వియోగాన్ని సహిస్తున్నాం. అందుచేతనే మనకు వియోగం ప్రాప్తిస్తోంది.

మనకు భగవానుని దర్శనం లభించడంలో విలంబం అవుతోంది. అంటే దానికి కారణం ఆ స్వామియొక్క సుహృద్భావతత్త్వాన్ని సరిగా అర్థం చేసుకోకపోవడమే. భగవానుడు అందరియందూ సుహృద్భావం కలవాడే అని భావించుకొన్ననాడు మనకు ఆ స్వామి దర్శనం కలగడంలో విలంబం కానేకాదు. భగవానుని పట్ల శ్రద్ధ, ప్రేమ లేనివాళ్లు ఉన్నారు. అసలు భగవానుడు అనేవాడు ఒకడు ఉన్నాడంటే నమ్మకంలేనివాళ్ళు ఉన్నారు. ఆ స్వామి యొక్క దయాతత్త్వరహస్యం బొత్తిగా తెలియనివాళ్లు ఉన్నారు. భగవానుణ్ని ఇష్టపడనివాళ్ళు ఉన్నారు. వీరికి అందరికీ కూడ దర్శనం ఇవ్వాలనే ఆ స్వామి ఆరాటపడుతూ ఉంటాడు. ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. అని చెపుతూ అంటే తనను గాఢంగా ప్రేమించేవారికి ఆ స్వామి దర్శనం ఇవ్వడానికి ప్రయత్నిస్తూనే ఉంటాడని వేరుగా చెప్పవలసిన పని ఏమి ఉంటుంది?

ఉత్తంకుని చరిత్రము పరిశీలించండి! తన ముందున్న వాడు భగవానుడని అతడు ఎఱుగడు. భగవానుడని అతడు అనుకోలేదు. అయినా భగవానుడే అతనితో చెప్పాడు - ఓయీ! నేను భగవానుడను. నన్ను శపించకు! శపిస్తే నీ గురుభక్తి చెడుతుంది. గురువును సేవించడం వల్ల

వచ్చే ఫలం నాశనం అవుతుంది. నేను ఇప్పుడు మానవరూపంలో అవతారధారణం చేసియున్నాను. నేను సాక్షాత్తూ పూర్ణబ్రహ్మను. పరాత్పరుడను. లోకంలో విప్లవాలు చెలరేగినప్పుడల్లా అవతారధారణం చేస్తూ ఉంటాను. మహామత్స్యకూర్మవరాహరూపాలలో అవతరించినవాడను నేనే. ఆవశ్యకతను బట్టి దేవయోనిలోనో, మానవయోనిలోనో, పశుయోనిలోనో ఆవిర్భవిస్తూ ఉంటాను. ఇప్పుడు మానవయోనిలో జన్మగ్రహణం చేసేను. ఇలా చెప్పిన మీదట ఉత్తంకుడు - అలాగా? అలా మీరు సాక్షాత్తూ పరాత్పరులే అయితే ఏదీ? ఒకసారి నాకు మీ విశ్వరూపం చూపండి! అన్నాడు. భగవానుడు విశ్వరూపం చూపాడు. కాని ఇక్కడ విశేషం ఏమంటే భగవానుడే తనను గురించి అతనికి పరిచయం చేసుకున్నాడు. ఇక్కడ భగవానుని భావన ఏమిటి? ఆత్మకళ్యాణాన్ని కోరి ఇతడు ఎంతగానో గురువును సేవించాడు. గురువుపై అమితభక్తిని ప్రదర్శించాడు. కాబట్టి ఇతడికి ఆత్మకల్యాణం చేకూర వలసిందే అన్నది. ఆ భావనతోటే ప్రేరితుడై అతడు ఉత్తంకునకు ఆత్మోద్ధరణం కలిగించేడు. ఇక్కడ తనకు ఆత్మోద్ధరణం కలిగించమని అతడు భగవానుణ్ని కోరనేలేదు. అతడు భగవానుని ఎఱుగనే ఎఱుగడు. ఇక కోరడం ఎలా జరుగుతుంది? ఈ విధంగా వెదకి వెదకి వ్యక్తులకు దర్శనం ఇచ్చే భగవానుడు కావాలని కోరే వానికి దర్శనం ఎందులకు ఈయడు? భగవానుడు పరమసుహృద్భావం కలవాడని తెలుసుకుంటే చాలు! గుర్తిస్తే! చాలు! ఆ గుర్తించినవాడు ఎంతటి నీచుడైనా ఎంతటి పాపాత్ముడైనా వాని పాపాలన్నీ చెల్లిపోతాయి. ఒక గుహ ఉంది. అందులో ఎన్నో ఏళ్లుగా చీకటి ఉంది అనుకోండి! అక్కడ విద్యుద్దీపాన్ని వెలిగిస్తే ఆ చీకటి అంతా ఒక్కసారిగా పటాపంచలు కావడం లేదా? అలాగే జ్ఞానజ్యోతి వెలగగానే ఎంతటి అజ్ఞానపు తిమిరం క్షణంలో సమసిపోతుంది. జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః (గీత 19వ శ్లో. -4) అనగా ఏ జనుడు ఈ విధంగా జ్ఞానాగ్ని చేత సమస్తకర్మక్షయం చేసుకుంటాడో వానిని జ్ఞానులైనవాళ్లు పండితుడుగా పేర్కొంటారు అని భావం.

మరొక్క విషయం :-

శ్లో॥ అపి చేదసి పాపేభ్యః స్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥
(గీత 4-36)

అనగా భగవానుడు అర్జునునితో - అర్జునా! నీవు పాపులను అందరినీ మించి పాపాలు చేసినవాడవు అయినాసరే! జ్ఞానము అనే నౌకను అధిరోహిస్తే నిస్సందేహంగా పాపాలను అన్నిటినీ అధిగమించిపోగలవు సుమా! అని చెప్పేడు అని భావం.

అయితే బుద్ధిపూర్వకంగా మాత్రం ఎవడూ ఎన్నడూ పాపం చేయకూడదు. తన వెనుకటి పాపాల విషయంలో భగవానుడు నిర్హేతుక కరుణాలక్షణం కలవాడని, అవ్యాజంగా ప్రేమించేవాడని. ఆస్వామి అనుగ్రహం వల్ల పాపాలు అన్నీ నశించిపోతాయని. ఆ స్వామి దయకు అవధులు లేవని భావించుకుంటూ ఉండాలి. అలా చేస్తే ఏ పాపాత్ముడూ కూడ ఆ స్వామి దయకు దూరం కాడు. మనం పాపాలు చేసినవాళ్ళమే! కాని ఆ స్వామి నిర్దయుడు మాత్రం కాదు. మనలను మనం పాపాత్ములుగా భావించుకుని భగవానుని నిర్దయుడుగా తలపోయడమే మనం చేస్తూఉన్నతప్పు. మన పాపాలను చూచుకుని మనం ఏమనుకుంటున్నాము? ఇన్ని పాపాలు చేసిన మనం ఎలా ఉద్ధరింపబడతాము? మనం ఉద్ధరింపబడడం అసంభవం అని అనుకుంటున్నాము? అలా అనుకోవడం భగవానుని దయను తిరస్కరించడమే. మా యింట్లో మామూలు చీకటి ఉంది. అది సూర్యుడు ఉదయించినా పోదు అనడం మూర్ఖత్వం కాక మఱి ఏమిటి? ఆ అంధకారం ఎంతవరకూ ఉంటుంది? సూర్యుడు ఉదయించేవఱకే. సూర్యభగవానుడు అందరియందూ దయ వహించియే రోజూ ఉదయిస్తున్నాడు. రాత్రి మనం ఏమి అనుకోవాలి? ఈనాడు సూర్యుడు ఉదయిస్తాడు. అతడు ఉదయించగానే ఈ చీకటి పటాపంచలు అవుతుంది. అని అనుకోవాలి. మనం వెలుతురులో చేయదలచుకున్నపని సూర్యుని వెలుతురులో చెయ్యాలి. ప్రాతఃకాలంలో విధిగా వెలుగు వస్తుంది. నేను ఎవరికోసం ఉదయించాలి? ఎవరికోసం మానాలి? అనే సంకల్పవికల్పాలు సూర్యునకు లేవు. అతడు ఉదయించక మానడు. విధిగా ఉదయిస్తాడు. అతడు ఉదయించినప్పుడు గ్రుడ్డగూబకే

ఏమీ కానరాదు. దాని కన్నులు మూతపడిపోతాయి. అంటే అందులో సూర్యుని తప్పు ఏముంది? భగవానుని దయ ఆ సూర్యప్రకాశం లాగా ఉదయించింది. దాని విషయంలో మనం కళ్లు మూసుకుని ఊరుకుంటే మనకు దక్కేది అంధకారమే అవుతుంది. భగవానుని దయవల్ల లాభం పొందకపోవడం మన మూర్ఖత్వం. ఆ దయముందు మనపాపాలు చిన్నవా? పెద్దవా? అను వివక్షతో పనిలేదు. మనకర్తవ్యం వల్లనే మనం ఉద్ధరింపబడే పరిస్థితి అయితే అప్పుడు భగవానుని దయ కొరగానిదే అవుతుంది. కాబట్టి అలా అనడానికి వీలులేదు. జరిగేది అంతా భగవానుని దయతోటే జరుగుతుంది. మన కర్తవ్యంవల్ల మనం ఉద్ధరింపబడడం జరుగుతుంది. అని మనం అనుకుంటున్నాం. ఇంకా మనం ఆస్థాయికి చేరలేదు. చేరినప్పుడు మనకు మేలు కలుగుతుంది. మన భావన ఎలా ఉంటే అలా తదనుగుణమైన ఫలితం మనకు దక్కుతుంది. మన భావనానుసారము మనం ఎప్పుడు పాత్రులం అయితే అప్పుడే శుభమును పొందుతాం. నిజం ఆలోచిస్తే భగవానుని దయకు పాత్రత, అపాత్రతలతో పనిలేదు. ఆ విషయాన్ని గుర్తించి నప్పుడు మనం ఆ దయకు ఎందుకు దూరం అవుతాము? భగవానుని దయను మనం ఒప్పుకోవడంలేదు. పైగా ఆ స్వామికి నిర్దయత్వదోషాన్ని కూడ అంటకడుతున్నాం. ఇది ఒకరకంగా అపరాధమే.

మనం భగవానుని దయకు పాత్రులం కాము. అందు చేతనే వంచితులం అయ్యాము. అని అనడంలోనే మనం భగవానుని నిర్దయునిగా భావిస్తూన్నట్లు వ్యక్తం అవుతోంది. ఆ స్వామి ముందు ఎల్లరూ దయకు పాత్రులే! ఆ దయను పొందడానికి పాత్రులం కాము అని మనం అనుకుంటున్నాం. కనుక మనం అపాత్రులం. నీవు దయకు పాత్రుడవు కాదని భగవానుడు నిర్ణయం ఏదీ చేయలేదే! ఆ స్వామికి అందరిమీద అపారంగా దయ ఉంది. ఆయన అందరికీ పంచిపెట్టడానికి వీలుగా తన దయాకోశాగారాన్ని తెరుచుకుని కూర్చున్నాడు. ఒక మహానుభావుడు బహిరంగంగా తన యింటిలో నిత్యాన్నదానం ఆరంభించేడు. ఎవరు వచ్చి కోరినా లేదనకుండా ఆహారపదార్థాలను అందజేసే కార్యక్రమం మొదలు అయింది. ఆ సందర్భంలో ఒక వ్యక్తి మరొకవ్యక్తిని అక్కడకు నీవు వెళ్లేవా? అని అడిగేడు. లేదు

అన్నాడు అతడు. ఎందుకు వెళ్ళలేదు? అన్నాడు ఇతడు. వాళ్లు ఆకలితో బాధపడుతున్నవారికే ఇస్తారు. నాకు ఎందుకు ఇస్తారు? అన్నాడు అతడు. అసలు నీవు వెళ్లి ప్రయత్నించి చూచేవా? అన్నాడు ఇతడు. నేను వెళ్లినా నాకు ఇవ్వరని నేను నమ్ముతున్నాను. అని అతడన్నాడు. సోదరా! నీవు ఆ దాతను నిర్దయుడని భావించేవు. ఆ దాత ఎవరు వచ్చినా, ఎప్పుడు వచ్చినా లేదనకుండా పంచిపెట్టే ఉద్దేశ్యంతోనే ఆ దానవిధానాన్ని మొదలుపెట్టేడు కదా? అక్కడ నీకు ఏమీ లభించదని నీవు ఎలా అనుకున్నావు? అని ఇతడు మళ్లీ అన్నాడు. నేను జనాలను అడిగి తెలుసుకున్నాను. అక్కడ ఆహారం బిచ్చగాళ్లకు మాత్రమే పెడతారట. నేను ఆహారాన్ని పొందుటకు అర్హుణ్నికాను. అని అతడు మళ్లీ సమాధానం చెప్పేడట. ఇదిగో ఈ విధంగానే ఉన్నాయి. భగవానుని విషయంలో మన మనోభావాలు కూడ. భగవానుని దృష్టిలో వీడు అర్హుడు వీడు అనర్హుడు అనే వివక్షలేదు. ఆ స్వామిముందు అందరూ బిచ్చగాళ్లే. అందరూ పాత్రులే. ఆ స్వామి అందరినీ పాత్రులుగానే పరిగణిస్తారు.

లోకంలో కొందరు నిరాకారపరబ్రహ్మమును ఉపాసిస్తారు. వారికి దర్శనం ఇవ్వవలసిన బాధ్యత భగవానుడికి లేదు. కారణం? వాళ్ల దృష్టిలో భగవానుడికి ఆకారంలేదుగా! కాని నిండు భక్తితో తన సాకారమూర్తిని ఉపాసించేవారికి దర్శనం ఇవ్వవలసిన బాధ్యత భగవానుడు వహిస్తాడు.

**శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥**

(గీత 11-54)

కాని పరంతపా ఓ అర్జునా! నేను అనన్యమైన భక్తిచే చతుర్భుజ రూపమును దర్శించుటకు, తత్త్వముచే యథార్థమెరుంగుటకు, నాలో ప్రవేశించి ఏకీ భావము నొందుటకు లభ్యమైన వాడను. అని భావం.

భక్తునకైతే దర్శనం ఇవ్వడానికి భగవానుడు బాధ్యుడే కాని నిర్గుణనిరాకారతత్త్వాన్ని ఉపాసించేవారి విషయంలో బాధ్యుడు కాడు. అయితే వారికి దర్శనం ఈయడు అనడానికి వీలులేదు. తనను ప్రేమించనివారికి దర్శనం ఈయడు అనడానికి వీలులేదు. కుపాత్రులు, అపాత్రులు

అయినవారిని ఉద్ధరించడు అనడానికి వీలులేదు.

భగవానుడు నిర్హేతుకంగా అందరియందూ దయ చూపుతాడు. నిర్హేతుకంగానే అందరినీ ప్రేమిస్తాడు. అని మనం నోటిమాటగా మాత్రం అంటున్నాం. కాని నిజంగా అట్టి భావన మనలో లేనేలేదు. ఆ విషయాలలో మనకు జ్ఞానమూ లేదు. భావనవల్లనే తెలుసుకొనే పరిస్థితి వస్తుంది. ముందు మనం భగవానుని భావించాలి. నమ్మాలి. కానీ అలా చేయడం లేదు. ఎందుకు భావించాలి? ఎందుకు నమ్మాలి? అంటూ బహుసంకుచిత వృత్తిని అవలంబిస్తున్నాము. భగవానుణ్ని భగవానుడిగా భావించడానికి, నమ్మడానికి కూడ మనకు సంకోచమూ, లజ్జానుభవము కలుగుతున్నాయి. ఎవడైనా ముందు భగవానుణ్ని భావించాలి. నమ్మాలి. తరువాత క్రమంగా ఆ స్వామిని అర్థం చేసుకునేందుకు వీలు కలుగుతుంది. మొట్టమొదట భగవానుడు ఒకడు ఉన్నాడని నమ్మాలి. నీవు నావాడవు అని ఆ స్వామిని స్వీకరించాలి. అలా స్వీకరించడానికి అర్హమైనవాడు భగవానుడు ఒక్కడే. కాని మనం అలా స్వీకరిస్తున్నామా? లేదు.

లోకంలో ఒక కన్య ఉంటుంది. ఆమెకు ఒక వరుడు ఉంటాడు. ఆమె వరింపదగిన వాడు వాడు. భర్తగా స్వీకరింపదగినవాడు. భావింపదగినవాడు. అయితే ఏమి? ఆమె వాడిని భర్తగా స్వీకరించుటకు ఇష్టపడదు. వాడిని తనకు భర్తగా ఉండుటకు అర్హుడని భావింపదు. అలా అయినప్పుడు ఆ వరుడు ఏమి చేస్తాడు? ఇదిగో ఈ విధంగానే ఉంది మనకు భగవానుని యెడల ఉన్న ప్రవృత్తి కూడ. నిజం చెప్పాలి అంటే మనం కేవలం ఒక్క భగవానునే స్వామిగా స్వీకరించాలి. అందుకు అర్హుడు భగవానుడు ఒక్కడే! కాని అతనిని కూడ మనం స్వామిగా అంగీకరించడం లేదు. ఇష్టపడడంలేదు. ఆ పరిస్థితిలో మనకు ఏదైనా దుర్గతి ప్రాప్తిస్తే అందులో భగవానుని దోషం ఏముంటుంది? ఆ కన్య పెండ్లి కాకుండా కుమారిగానే ఉండిపోతే దానికి కారణం ఎవరు అంటారు. ఆమెయొక్క మూర్ఖత్వమే కారణం. కాబట్టి మనం భగవానుణ్ని మన స్వామిగా భావించాలి. స్వీకరించాలి. స్వామి అని భావించినా భావించకున్నా కనీసం భగవానుడు అనేవాడు ఒకడు ఉన్నాడు. అని యైనా నమ్మాలి. అతని అస్తిత్వాన్ని

(ఉనికిని) అంగీకరించినా కూడ మనుష్యుడు శ్రేయస్సును పొందుతాడు. భగవానుడు అనేవాడున్నాడు. నిశ్చయంగా ఉన్నాడు. అని భావించినా కూడ ఎంతయో మేలు కలుగుతుంది. అతడు ఎవరికైన స్వామిగా స్వీకరించుటకు తగినవాడు. అని చెపుతూంటే అతడిని ధ్యానించేవానికి, స్మరించేవానికి శుభం కలుగుతుంది. అనడంలో సందేహం ఏముంటుంది? గాయత్రీమంత్రంలో 'వరేణ్యం' అనే శబ్దం ఒకటి ఉంది. దానికి శ్రేష్ఠుడు, శ్రేష్ఠమైనది అని అర్థం. ఈ అర్థం ఇంతకు ముందు నేను చెప్పినదే. ఎవడు భగవానుణ్ని ఈ శబ్దంయొక్క అర్థంగా భావిస్తాడో లేదా ఒప్పుకుంటాడో వాడు పాత్రుడు అయినట్లే లెక్క.

కాబట్టి భగవానుని అందరూ స్వామిగా స్వీకరించాలి. అట్లు స్వీకరించనివారి క్షేమం కోసం కూడ ఆ స్వామి ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. చూడండి! వాళ్లు పరమదయాళువులు అయిఉంటారు. వాళ్లు తమను ఒకడు మహాత్ముడని భావించకపోయినా, మఱియొకడిని మహాత్మునిగా భావించినా బాధపడరు. వికారమును పొందరు. ఏ విధంగా అయినాసరే మానవుడు ఆత్మోద్ధరణం పొందాలి అనే అకాంక్షిస్తారు. తమను కాదని మఱియొక్కని మహాత్మునిగా భావించి అతడిని ఆశ్రయించి ఆత్మోద్ధరణం, పొందినా కూడ ఎంతో సంతోషిస్తారు.

ఉదాహరణగా చెప్పాలి అంటే చూడండి! ఒక మహాత్ముడు ఉంటాడు. అతడు నాయనా! రామనామాన్ని భజించుకోవోయీ! నీకు మేలు జరుగుతుంది అని ఒకరితో చెపుతాడు. కాని ఆ చిన్నవానికి ఈ చెప్పినవానిమీద గురి లేదు. నమ్మకం లేదు. అతడికి గాంధీగారంటే గౌరవం ఎక్కువ. అందుచేత అతడు మాగాంధీగారు మహాభక్తులండీ! ఆయన రామనామాన్ని ఉపాసిస్తూ ఉంటారు అని ఇతనిలో అంటాడు. అప్పుడు ఇతడు అతనితో చూడు! బాబూ! రామనామంతో సమానం అయినది మఱియొకటిలేదు అని ఆ గాంధీగారే అన్నారు కదా! కాబట్టి ఆయననే మహాత్మునిగా భావించి ఆయననే అనుకరించి రామనామాన్ని ఉపాసించుకో! అని బదులు చెపుతారు. అటుపై అతడు గాంధీగారి సిద్ధాంతాల్ని అంగీకరించి. ఆయనను మహాత్మునిగా భావించి ఆయనపై గురుభావం కలిగి ఉండి రామనామాన్ని ఉపాసించడం

ఆరంభిస్తాడు అనుకోండి! అప్పుడు ఈ మహాత్ముడు తనలో బాగుంది. ఇతడు మంచిమార్గం త్రొక్కేడు. ఇతడికి మేలు కలుగుతుంది అని తలచి ఎంతో సంతోషిస్తాడు. ఏ విధంగా అయినా లోకకల్యాణం జరగాలనే మహాత్ములు ఆకాంక్షిస్తూ ఉంటారు. వారు పరమదయాస్వభావులు. భగవానుడు ఎలా దయామయుడో అలాగే అతని భక్తులు సాధువులు మహాత్ములు కూడ దయామయులై ఉంటారు. అందుచేతనే ఇట్టి దయామయులు తనకు ఇష్టులని భగవానుడు గీతలో చెప్పియున్నాడు.

**శ్లో॥ "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ"।**
**"మయ్యర్పితమనోబుద్ధిః యోద్భక్తస్స మే ప్రియః"॥**

(గీత 12/13-14)

సకలభూతముల యందు ద్వేషము లేనివాడై స్వార్థము లేనివాడై సర్వుల యందును హేతు రహితమైన దయతో మమతాహంకారములు లేక, సుఖ దుఃఖముల యందు సమత్వము గల్గి అపరాధులను సైతము క్షమించుచూ నిరంతర సంతుష్టుడై, మనోబుద్ధి యింద్రియముల వశము నందుంచుకొని నా యందు దృఢమైన నిశ్చయము గలవాడై మనోబుద్ధులను నా యందర్పించి యుండు నా భక్తుడు నాకు ప్రియుడు అని భావం.

అతడు నాకు ప్రియమైనవాడు అన్న ఈ భావన భగవానునిది. భక్తులలోకూడ ఈ భావనే ఉంటుంది. కాబట్టి ఉన్నతస్థాయికి చెందిన భక్తులంతా ఒకడు శుభం పొందితే సంతోషిస్తారు. ఎవడైనా భగవద్భక్తి మార్గాన్ని తొక్కితే చూచి వాళ్లు ఎంతో ఆనందిస్తారు. ఎవరిని గురువుగా భావిస్తే ఏమి? ఎవరిని మహాత్ముడిగా పరిగణిస్తే ఏమి? మన పరమప్రియతమదైవతం మీద భక్తి కలిగి ఉన్నాడు కదా! అని వాళ్ళు అంటారు. ఎవరి మాటను అనుసరిస్తే ఏమి? భగవద్భక్తి మార్గాన్ని అనుసరిస్తే చాలు భగవానుని గుమస్తా (మహాత్ముడు) వాడిని గూర్చి బాగుంది మంచిపని చేస్తున్నాడు మన పరమప్రభువునకు భక్తుడు

అయ్యాడు అంటూ సంతోషాన్ని వ్యక్తం చేస్తాడు. ఈ గుమాస్తా తాను మధ్యవర్తిగా ఉంటూ భగవద్భక్తి మార్గంలో లేనివాళ్లను ఆ మార్గంలో ప్రవేశపెట్టడానికి ప్రయత్నం చేస్తూ ఉంటాడు. ఒకడు తన సారథ్యంలో కాక మరియొకని సారథ్యంలో భక్తిమార్గంలో ప్రవేశించినా ఈ గుమాస్తా సంతోషాన్నే ప్రకటిస్తాడు కాని ఆ పని నావల్ల జరగలేదే అని అసంతృప్తి పొందడు. మధ్యవర్తి ఎవడు అయితే ఏమి? అతడు భక్తిమార్గంలో ప్రవేశించాడు కదా! ఎవరు ఏ ప్రయత్నం ఎలా చేసినా లక్ష్యం మాత్రం భక్తిమార్గంలో లేనివాడు ఆ మార్గంలో ప్రవేశించి శుభమును పొందడమే. ఈ విధంగా ఎవరి మాటను అనుసరించి అయినా మానవుడు మాత్రం తప్పక భగవద్భక్తుడు కావాలి.

# భగవత్ప్రేమ ప్రాప్తించే విధం

భగవానుడు సాక్షాత్తు ప్రేమస్వరూపుడు, ప్రేమించువాడు, ప్రేమించబడేవాడు. ప్రేమి, ప్రేమించగలవాడు, ప్రేమ అనే మూడూ ఒక్కటే. భక్తుడు ప్రేమించేవాడు. భగవానుడు ప్రేమించబడేవాడు. వారి నడుమ ఉన్న పారస్పరిక సంబంధం ప్రేమ. అయితే యిక్కడ ప్రేమించేవాడు, ప్రేమించబడేవాడు, ప్రేమ అనేవి మూడుగా ఉన్నా వస్తుస్థితిలో అవి మూడు ఒక్కటే. మూడూ చిన్మయములైనవే. చిన్మయప్రేమయే భగవత్స్వరూపం. మన ప్రజల నడుమ పారస్పరికంగా సాగే ప్రేమ ఆ చిన్మయప్రేమకు ప్రతిబింబం. ఆకాశంలో చంద్రుడు ఉంటాడు. అతని ప్రతిబింబం అద్దంలో పడుతోంది. అంటే అది ఆ చంద్రునివలననే పడుతుంది. సూక్ష్మంగా ఆలోచిస్తే అది ఆ చంద్రుని స్వరూపం అవుతుంది. దానికి ఆధారం ఆకాశంలో ప్రకాశించే వాస్తవ చంద్రుడే. అలాగే లోకవ్యవహారంలోని మన ప్రేమ పరమాత్మస్వరూపం అయిన చిన్మయప్రేమకు ప్రతిబింబం అవుతుంది. దానికి మూలకారణం పరమాత్మయే. పరమాత్మ చేతనుడు, పరమాత్మయొక్క స్వరూపం చేతనస్వరూపం. మన లోకవ్యవహారపు ప్రేమ జడం. అయినా అది భగవానుని కోసమే ఉద్దిష్టం అయితే, భగవానుని కొరకే అయితే, నిష్కామభావనాపూర్వకం అయితే, భగవానుని పొందుటకో, భగవానుని మీద ప్రేమ కలుగుటకో, భగవదాజ్ఞాపాలనం కోసమో అయితే అది జడం అయినా చిన్మయప్రేమయే అవుతుంది. కాబట్టి మనం పారస్పరికంగా ప్రేమభావాన్ని పెంపు చేసుకోవాలి. స్త్రీకి బిడ్డమీద, పురుషునకు ధనం మీద, కుటుంబమీద, తన శరీరంమీద ఉండే ప్రేమ, ప్రేమకాదు. అది ఆసక్తి, ఏది సహేతుకం అవుతుందో అది ప్రేమ కాదు ఆసక్తి, దానినే కామం అనికూడ అనవచ్చును. దానికి ఫలం భగవత్ప్రాప్తి కాదు. ఆలు, బిడ్డ, ధనము, గృహము, పేరు, ప్రతిష్ఠ మొదలైన వానియందు ఉండే ప్రీతియే ఆసక్తి. అది బంధనకారక మైనది. అది మనకు బహు

ప్రమాదహేతువైనది. దానిని తొలగించుకోవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది. నిజానికి దానిని ప్రేమ అని అనకూడదు. ఆసక్తి అనియో కామం అనియో అనడమే యుక్తం. కాని నిష్కామభావపూర్వకము, హేతురహితము, భగవానుని కోసం ఉద్దిష్టము అయిన ప్రేమ ఇతరుని మీద ఉన్నా భగవానుని మీద ఉన్నట్టిదే అవుతుంది. భగవానుడు అందరియందు ఉన్నాడన్న భావంతో ఎవరిని ప్రేమించినా భగవానుని ప్రేమించడమే అవుతుంది. భగవానునితో కల్పించుకున్న ప్రేమ సంబంధం సంసారబంధవిముక్తిని కలిగిస్తుంది. మానవుని భవసాగరంనుండి ఉద్ధరిస్తుంది. సంసారసంబంధం అయిన విషయభోగాలను ఉద్దేసించికాని ఏదైన ఒక కోరికతోనో, స్వార్థంతోనో, ఆసక్తితోనో కాని ప్రకటించబడే వ్యామోహమూలకం అయిన ప్రేమ కాదు. అది చెప్పుకొనుటకు మాత్రమే ప్రేమ. అది మానవుని పతనానికి గురి చేస్తుంది. దానికి సర్వదా దూరంగా ఉండాలి.

పేరుప్రతిష్ఠలను, పరులవలన లభించే గౌరవాన్ని ఆశించక నిష్కామభావంతో అందరియందు పారస్పరిక ప్రేమ కలిగి మెలుగుతూ ఉండాలి. అట్లు కాక ప్రేమకు బదులుగా ఒకరిపై ఒకరు ఈర్ష్యాద్వేషాలు. వైమనస్యమూ కలిగి మెలగుతూ ఉంటే అది బహు ప్రమాదహేతువు అవుతుంది. ఆత్మనాశనం కలిగిస్తుంది. అందు చేతనే భగవానుడు - "నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాండవ!" (గీత 11-55) అన్నాడు. అంటే సమస్తభూతములందు వైరభావం లేనివాడు ఎవడో వాడు నన్ను పొందుతాడు అర్జునా! అని భావం. ప్రపంచాన్ని అంతనూప్రేమిస్తూ ఉన్నా అందు ఏ ఒక్కనితో వైరము, ద్వేషము ఉన్నప్పటికీ అట్టివానికి భగవత్ప్రాప్తి కలుగదు. ఎలాగ అంటే ఒక సోదరుడు ఉన్నాడు అనుకోండి! అతనికి నా యందు భక్తి ఎక్కువ అతడు నా శరీరాన్ని అంతనూ పూవులతో పూజిస్తాడు, అలంకరిస్తాడు, గౌరవిస్తాడు, నమస్కరిస్తాడు. కాని ఒక వ్రేలికి గుడ్డ చుట్టి కిరసనాయిలుతో తడిసి అగ్గిపుడక వెలిగించి అంటించబోతే నేను హర్షిస్తానా? అదేమి పని? నాయనా! అంటాను. అయ్యా! దీపం పెడుతున్నాను. దీపం, మీరు మహాత్ములు మీకేమి? మేం మిమ్ము పూజించుకుంటున్నాం. నమస్కరించుకుంటున్నాం. మీకు

సత్కారం చేస్తున్నాం. పర్యాయంగా దండాలు పెట్టుకుంటున్నాం అని అతడు బదులు చెప్పవచ్చును. అయితే మాత్రం కిరసనాయిలు పోసి వ్రేలును వెలిగించి దీపం పెడుతున్నామంటే హర్షించగలమా? పోవయ్యా! నీ పూజలు మాకు అక్కరలేదు అనియే అతనిని తిరస్కరిస్తాం. అతని పూజను నిరాకరిస్తాం. కాబట్టి మనకు యావత్ప్రపంచకంతోను ప్రేమ ఉండి ఏ ఒక్కరితో విరోధం ఉన్నా అది కళంకహేతువే అవుతుంది. అట్టి దశలో ఉన్నవారికి భగవత్ప్రాప్తి కలుగదు. కాబట్టి మనం అందరును నిష్కామభావంతో ప్రేమించాలి. లేదా ఎవరితోడను ప్రేమ, ద్వేషము రెండు లేకుండా ఉండాలి. లేదా అందరిలోను ఆత్మరూపంలో పరమాత్ముడే ప్రకాశిస్తూ ఉన్నాడు అన్న భావంతో అందరనూ ప్రేమిస్తూ ఉండాలి. ఇది పరమోన్నతస్థాయికి చెందిన విషయం.

నేను మీ యెడల అపరాధం చేసాను అనుకొండి, మిమ్మల్ని కొట్టాను దుర్భాషలాడాను, మీరు నా మీద కోర్టులో దావా వేస్తారు, కేసు పెడతారు. అధికారితో నాకు స్నేహం ఉంటుంది. ఏమిటి మిత్రమా! నీవు అతన్ని కొట్టావా? తిట్టావా? అని అతడు నన్నుఅడుగుతాడు. ఆ మాట నిజమే. కాని, నీవు నన్ను క్షమించి యీ కేసునుండి తప్పించాలి. ఏకాంతంలో నిన్ను అడుగుతున్నాను అని నేను అంటాను. నాకు కాదు సరి కదా! నన్ను పుట్టించినవానికి కూడ నిన్ను క్షమించే అధికారం లేదు అంటాడు అతడు, న్యాయప్రియుడైన అధికారి క్షమించడు గదా! అయితే నేను తప్పించుకోవడానికి ఉపాయం ఏదైన ఉందా? అని మళ్లీ నేను అంటాను. నీవు పోయి నీమీద కేసు పెట్టినవాని చేత రాజీ చేయించి కేసును ఉపసంహరింపజేస్తే నేను నిన్ను క్షమించగలుగుతాను. క్షమించడానికి కాని క్షమించకపోవడానికి కాని నాకునూ అధికారం ఉంది అనుకో! అయినా నీవు ఎవరి యెడల అపరాధం చేసావో అతడు మేము ఇద్దరమూ సఖ్యపడ్డాము. నేను పెట్టిన కేసు ఎత్తివేసుకుంటున్నాను అని ఒక అర్జీ వ్రాసి దాఖలు చేస్తే దానిని మేము స్వీకరించవచ్చును. దానిని స్వీకరించడము, స్వీకరించకపోవడము మా చేతిలోని విషయం. ఆమేరకు నేను సాయపడగలను అధికారి బదులు చెపుతాడు. అయితే దీనిని బట్టి తేలిన సారాంశం ఏమి అంటే మేం

మీయెడల అపరాధం చేస్తే మమ్ము క్షమించగలవాడు ఎవ్వడూ ఉండడు. ఇహమందూ ఉండడు, పరమందూ ఉండడు. ఈ లోకంలో రాజులు, మహారాజులు, అధికారులు అయిన వారూ క్షమించలేరు. పరలోకంలో యమధర్మరాజు క్షమించలేడు. కాని ఒక్క సాధారణవ్యక్తి మాత్రం క్షమించగలడు. అతడు ఎవడు అంటే ఎవని యెడల మేము అపరాధం చేసామో వాడు. అతడు మమ్ము క్షమిస్తే ఇక మమ్ము ఎవరూ దండించలేరు. దానిని బట్టి మనం నేర్చుకోవలసిన నీతి ఏమంటే మనం ఎవరియెడల అపరాధం చేసామో వారినే క్షమాభిక్ష కోరుకోవాలి. ఇది సాధారణవిషయం. అట్లుకాక వ్యవహారం ప్రభుత్వ పరిశీలనదశలో ముందుకు సాగిపోతే మరియింత కష్టం అయిపోతుంది. వైమనస్యపు వ్యవహారం బాగా ముదిరిపోతే భగవానుని దగ్గర కూడ మరింత క్లిష్టదశను తెచ్చిపెడుతుంది. కాని అది యిక్కడనే అయితే సాధారణసమస్య అవుతుంది. కాబట్టి తల్లులను, చెల్లెళ్లను, సోదరులను మేము సవినయంగా కోరేది ఏమంటె మీకు ఈ లోకంలో ఎవరితోడ ఏ కొంచెం వైమనస్యం కలిగినా, రాగద్వేషాలు ఉదయించినా వానిని సాధ్యమైనంత శీఘ్రంగా ఇక్కడే నివృత్తం చేసివేసుకోవాలి. మీరు ఎవరియెడల అపరాధం చేసారో వారిని క్షమాభిక్ష వేడుకొని ఆ వ్యవహారాన్ని అంతటితో సమాప్తం చెయ్యాలి. ఈ విషయం బహు మూల్యవంతం అయినది, ప్రధానమైనది. ఆడువారిలో కలహాలు, కొట్లాటలు జరిగితే అయిరువురిలోను ఎవరు ఓరిమి వహిస్తారో, ఎవరు దుఃఖమును దిగమ్రింగుకుంటారో వారు మంచివారు అవుతారు. తమ అపరాధమును గూర్చి క్షమాభిక్ష వేడుకున్నవారు మరియింత మంచితనం కలవారు అవుతారు. అపరాధం ఆవలియామెది అయితే ఈవలయామె క్షమాభిక్ష కోరడం ఇంకనూ శ్రేష్ఠం. అనగా అపరాధం చేసినవాడను నేను కాగా నా అపరాధానికి గురి అయిన వారు నన్ను క్షమాభిక్ష కోరేరు అంటే అది వారిలోని ఉన్నతస్థాయి మహత్త్వాన్ని వ్యక్తం చేసేది అవుతుంది. ఏ అపరాధము చేయకుండా క్షమాభిక్ష వేడుకోవడం అనేది అత్యంతమహత్త్వపూర్ణం అయిన విషయం. మొత్తం మీద సారాంశం ఏమంటే మనలో పారస్పరికవైమనస్యం లవలేశమూ ఉండరాదు. అలా ఉండకపోవడం అనేది భగవానుని దృష్టిలో బహు ఉత్కృష్టమైన విషయం.

తరచుగా మనవలన ఇలాంటి రాగద్వేషపూర్వకాలు వైమనస్యహేతుకాలు అయిన పనులు జరుగుతూనే ఉంటాయి. అందులో ముక్తిని ప్రసాదించేది ఒకటి, స్వర్గాన్ని సమకూర్చేది ఒకటి, స్వర్గనరకాలలో ఏదీ ఈయనిది ఒకటి, అధోగతిని కలిగించేది ఒకటిగా నాలుగు మార్గాలు ఉంటాయి. ఈ నాలుగూ బాగా అర్థం చేసుకోవలసిన విషయాలు. ఎలాగ అంటే నాకు మీ మీద కోపం వచ్చింది అనుకోండి అప్పుడు మీరు నాతో అయ్యా! మీకు కోపం రావటానికి నేను కారణభూతుడను అయ్యాను. కాబట్టి నేను మహాపరాధం చేసాను. మీరు దయాపరులు. నా అపరాధాన్ని పరిగణించక నన్ను క్షమించండి! నేను చేసినదానిలో ఏ చేష్టవలన మీకు కోపం వచ్చిందో నాకు తెలియ చెప్పండి! భవిష్యత్తులో అలాంటి పని నావలన మళ్లీ జరగకుండ జాగ్రత్తపడతాను. అని పలికి సవినయంగా నన్ను ప్రార్థించారు అనుకోండి! అప్పుడు మీ యీ భావన కామనారహితమూ, అహంకారరహితమూ అయి మహోత్కృష్టమైనది అవుతుంది. దీనికి పరమాత్మప్రాప్తియే ఫలం. ఈ భావమే మీకు లోకంలో పేరుప్రతిష్ఠలు, గౌరవము పొందాలి అన్న లక్ష్యంతో కలిగితే మీకు లోకంలో కీర్తి కలుగుతుంది. మరణానంతరం స్వర్గమూ ప్రాప్తిస్తుంది, ఇది రెండవ మార్గానికి చెందిన విషయం. మీరు ఏ అపరాధమూ చేసియుండరు. ఎవరినీ ఎట్టి క్షమాభిక్షను అర్థించరు. ఆ అపరాధం ఏదో అది నాది అనుకొండి! మీ అపరాధం ఏది లేదు. ఆ విషయంలో మీరు తటస్థంగా ఉన్నారు అనుకొండి. ఆ దశలో మీకు పుణ్యము లేదు. పాపము లేదు. స్వర్గము రాదు. నరకము రాదు. ఇది మూడవ మార్గానికి చెందిన విషయం. వైమనస్యపూర్వకంగా ఒక సంఘటనం జరిగినప్పుడు మీరు నేను ఏ పాపమూ ఎరుగను. తప్పు అంతా ఎదుటివానిదే అని వానిమీదకు త్రోసివేస్తూ ఉంటారు. చూడండి అయ్యా! ఇతడు అకారణంగా నన్ను దూషిస్తున్నాడు. ఇష్టం వచ్చినట్లు పరుషవచనాలు ఆడుతున్నాడు. నన్ను అవమానించడానికి ఇతనికి ఏమి అధికారం ఉన్నదండీ? అని యితరులతో చెప్పుతూ దోషం వానిదే అని బుకాయింప యత్నిస్తారు. ఇది మీలోని నీచవృత్తికి అద్దం పట్టే విషయం. దీనివలన మీకు పతనం వస్తుంది. ఇది నాలుగవ మార్గానికి సంబంధించిన విషయం.

ఈ విధంగానే రెండవస్థాయికి సంబంధించిన విషయాన్ని వివరిస్తున్నాము. అర్థం చేసుకొండి నేను ఒకరిమీద కోపం చూపుతాను అనంతరం నా తప్పు నేను తెలుసుకొని నేను ఎవరి మీద కోపం చూపానో వారి దగ్గరకే పోయి అయ్యా! నావలన పొరపాటు అయింది. తప్పునాదే. దీనికి నా స్వభావదోషమే కారణం. కాబట్టి యిందుకు మీరు నన్ను క్షమింతురు గాక అని వారిని ప్రార్థిస్తాను అనుకోండి. ఈ నా ప్రార్థన నిష్కామభావంతో కూడినది, అహంకారరహితం అయినది. అభిమానపూర్వకం కానిది, ఆత్మకల్యాణం కోసం ఉద్దేశించబడినది అయితే దానికి ఫలంగా ఆత్మోద్ధరణం కలిగితీరుతుంది. కాని అది లోకంలో నలుగురూ నన్ను మెచ్చుకోవాలి, నా పేరుప్రతిష్ఠలు పెరగాలి అనే ఉద్దేశ్యంతో చేయబడినది అయితే జనులు అందరు నన్ను ఆహా! ఇతడు ఎంత మంచివాడు? ఇతనికి ముందు కోపం వచ్చినా తరువాత తనను తాను సంభాళించుకున్నాడు. తన తప్పిదాన్ని గూర్చి క్షమాభిక్ష వేడుకున్నాడు. అంతకంటె అతడు జరిగిపోయినదానికి ఏమి చేయగలడు? అని ప్రశంసిస్తారు. ఈ విధంగా నాకు లోకంలో కీర్తి దక్కుతుంది. మరణానంతరం ఉత్తమగతీ ప్రాప్తిస్తుంది.

ఇక మూడవస్థాయికి సంబంధించిన విషయం - నాకు కోపం వస్తుంది. అపరాధం నాదే అవుతుంది. అయినా నేను ఏమీ మాటలాడను. మౌనం వహించి ఊరకుంటాను. అయ్యా! మీదే తప్పు. ఇలాంటి పని చేయడం మీకు తగదు. అని యితరులు నన్ను పరుషవచనములు ఆడుతారు. మందలిస్తారు. కోపం ప్రదర్శిస్తారు. మీ వ్యవహారం ఏమీ బాగుగా లేదు. అని నన్ను నిరసిస్తారు. నేను ప్రతివచనం చెప్పక నా తప్పును ఒప్పుకుంటాను. అనుకోండి అప్పుడు నా తప్పిదానికి నేను ప్రాయశ్చిత్తం చేసుకున్నవాడను అవుతాను. ఇక నాకు ఆ అపరాధానికై దండనం పరలోకంలోనూ ఉండదు. ఇహలోకంలోనూ ఉండదు.

ఇక నాలుగవస్థాయికి సంబంధించిన విషయం - ఒకనికి నా మీద కోపం వస్తుంది. అతడు నాదే తప్పు అనిపించడానికి ప్రయత్నిస్తాడు. నాతప్పు లేదు అని నేను వాదిస్తాను. అతని మాటలను ఖండిస్తాను. నా తప్పులేదు. నీదే తప్పు అంటాను. ఎంత చెప్పినా తప్పు నాదని ఒప్పుకోను.

అనుకోండి! ఈ విధమైన ప్రవర్తనం మంచిది కాదు. ఇది మానవుని నరకానికి కొనిపోతుంది. కాబట్టి మనం గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే మనకు కోపం వచ్చినా మనమే క్షమాభిక్ష వేడుకోవాలి. మన మీద ఇతరులకు కోపం వచ్చినా మనమే క్షమాభిక్ష వేడుకోవాలి. మనకు కోపం వచ్చిందంటే అదీ మన తప్పే అనుకోవాలి. మన మీద పరులకు కోపం వస్తే దానికి కారణం అయినవారం మనమే కాబట్టి అదీ మన తప్పే అనుకోవాలి. ఇలా అనుకోవడం బహు ఉన్నతస్థాయికి చెందిన విషయం. ఇది ఇహంలో కీర్తిని కలిగిస్తుంది. పరమందు స్వర్గాన్ని ప్రసాదిస్తుంది. సారాంశం ఏమంటే కామనారహితంగానూ, అహంకారరహితంగానూ ఉండే మన ప్రవర్తన మనకు మోక్షాన్ని ఇస్తుంది.

ఇప్పుడు రెండవ పక్షం విషయం వివరిస్తున్నాను. నాకు మీ మీద కోపం వస్తుంది. అప్పుడూ నా తప్పులేదు, మీదే తప్పు అంటాను. నా తప్పు ఉన్నా నా తప్పులేదు, మీదే తప్పు అని వాదిస్తాను. నా మీద మీకు కోపం వచ్చింది అంటే అందుకు కారణభూతం అయిన అపరాధం ఏదో నా పక్షంలో ఉండియే ఉంటుంది. కాని నేను దానిని ఒప్పుకొనక దోషాన్ని మీ మీదకే త్రోసివేయడానికి యత్నిస్తాను అనుకోండి ఈ ప్రవర్తన నరకానికి మార్గం అవుతుంది. తన అపరాధం ఏదీ లేనప్పుడు లేదని తన నిర్దోషిత్వాన్ని ప్రకటించుకోవడంలో తప్పులేదు. అందువలన నరకమూ రాదు స్వర్గమూ రాదు. నిజానికి అపరాధమే లేనప్పుడు దానికి దండనం ప్రశ్న ఎలా ఉత్పన్నం అవుతుంది? కాబట్టి తల్లులు, చెల్లెండ్రు, సోదరులు మొదలైనవారు నేర్చుకోవలసిన విషయం ఏమంటే ఇతరులు ఎవరైన మన మీద కోపం ప్రకటిస్తే దానికి కారణం మనమే అనుకొని, తప్పు మనదే అనుకొని వారిని క్షమాభిక్ష కోరుకోవాలి. మనకు ఎవరిమీదనైన కోపం వస్తే అప్పుడు మనమే ఎదుటివారిని క్షమాభిక్ష కోరుకోవాలి. ఈ పద్ధతి ఉత్తమమైనది. తప్పు మీది అయినా నాదే తప్పు అనడమూ, నాది అయినా నాదే అని తప్పును ఒప్పుకోవడమూ అనేది సభ్యత, శిష్టాచారము, ఉదాత్తవర్తనము అవుతుంది. నాకు కోపం వచ్చినా దానికి మూలకారణం మీరు అని ఎదుటివానినే దోషులుగా పరిగణించడము, ఎదుటివారికి నా మీద కోపం

వచ్చినా వారినే దోషులుగా నిర్ణయించడము అనేది ఒక విధమైన కుతంత్రం అవుతుంది. అది మనకు పతనాన్ని కలిగిస్తుంది. సోదరసోదరీమణులు అందరూ ఇట్టి సందర్భాలలో తమ తప్పిదాలను ఒప్పుకోవడానికి, ఒప్పుకొని క్షమాభిక్ష కోరుకోవడానికి సర్వదా సన్నద్ధులుగా ఉండాలి, క్షమాభిక్ష కోరేవాడు ఎంత సరళస్వభావంతో, ఎంత ప్రేమతో క్షమ కోరుకొంటాడో అంత ఉన్నతశ్రేణికి చెందినవాడు అవుతాడు. ఈ విషయాన్ని స్త్రీ పురుషులు అందరూ గుర్తుంచుకోవాలి. లోకంలో పరుల మీద దోషారోపణం చేసేవాడు. స్వయంగా అపరాధియై పతనం పొందుతాడు. పరుల అపరాధాలను తన నెత్తిమీద వేసుకునే వాడు తాను దోషియైనా దోషవిముక్తుడై ఉత్తరోత్తరము (పోనుపోను) అభివృద్ధిని పొందుతాడు. శీఘ్రంగా పరమాత్మనూ పొందుతాడు.

తల్లులు, చెల్లెండ్రు,సోదరులు అయిన మనం అందరము గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే మనం ఏమి అపరాధం చేసాము? ఏ అపరాధం, ఏ దోషం మనం ఉద్ధరింపబడడానికి అవరోధంగా నిలుస్తోంది? మనకు పరమాత్మప్రాప్తి కలగడంలో ఆలస్యం ఎందుకు అవుతోంది? మన సాధనలో లోపం ఉందా? వేరే ఏదైన లోపం ఉన్నదా? అని ఆత్మపరిశీలనం చేసుకుంటూ ఉండాలి. సాధన లోపం కూడ మనలో ఉండియే ఉంటుంది. మనలో పరులదోషాలను పరికించే సంకుచిత బుద్ధి ఏది ఉన్నదో అది మాత్రం బహు ఘాతుకమైనది. దీని వలన మానవుడు ఎక్కువగా పతనాన్ని పొందుతాడు. మీరు అందరు కూడ ఆలోచించి చూడండి. మా బుద్ధిని అనుసరించి కొన్ని యేండ్లుగా మేము సాధన చేస్తూనే ఉన్నాము. అయినా ఆశించినంత లాభం మాకు కలగడం లేదు అని మీరు అంటారు. అయితే దానికి కారణం ఏమిటి? అని మనం గంభీరంగా ఆలోచించాలి. దానికి మనమే కారణం అని తెలిసికొని భవిష్యత్తులో ఆ కారణం పునరావృత్తం కాకుండ జాగ్రత్తపడుతూ ఉండాలి. భగవద్భజనం వలన కలిగే లాభం కంటె పాపాచరణం వలన పరులను ఏవగించుకోవడం వలన మనకు కలిగే నష్టమే అధికంగా ఉంటుంది. నేను శ్రేష్ఠుడను. ఒక విధంగా నేనే మంచివాడను. ఎదుటివాడు చెడ్డవాడు అని యీ విధంగా పరులయందు దోషదృష్టి, తనయందు ఆధిక్యభావన కలిగి ఉండడం

వలన మానవునకు పతనం ప్రాప్తిస్తుంది. కాబట్టి స్త్రీలు, పురుషులు ఎల్లరు తమ తమ యిండ్లలో అనగా తమ తమ హృదయాలలో దాగియున్న దోషాలు అనే దొంగలను వెదకి వెదకి బయటకు పారద్రోలుతు ఉండాలి. ఇక ఎన్నడు మాలో ప్రవేశించకుమా! అని చీత్కరించి నిరసిస్తూ ఉండాలి. మనలో కామం, క్రోధం, లోభం, మోహం, అహంకారం, రాగం, ద్వేషం ఆదిగా ఎన్నో అవగుణాలు దొంగలవలె దాగి ఉన్నాయి. మనం ఇతరులను ఏవగించుకోవడానికీ, ద్వేషబుద్ధితో చూడడానికి, వారితో వైరం కలిగియుండడానికి, ఈర్ష్యతో ప్రవర్తించడానికి కూడ మూల కారణం మనలో ఉన్న ఆ అవగుణాల ప్రేరణయే అన్న విషయం మనం మరచిపోకూడదు. మనం దోషరహితులము, అధికులము అని, వారు కొంచెపువారు నీచులు అని భావించుకోవడం ఎంతో అనర్థానికి కారణం అవుతుంది.

నేను శ్రేష్ఠుడను, మంచివాడను అని మిమ్ము మీరు భావించుకొంటారు, నిజమే కావచ్చును. అలాగే క్రింది స్థాయికి చెందినవానిని ఒకనిని మీరు నీచులుగా భావిస్తారు. అది నిజమే కావచ్చును. అయినా ఇలాంటి తారతమ్య బుద్ధి భగవత్ప్రాప్తి మార్గంలో మనకు అవరోధమై నిలుస్తుంది. మనకు పరమాత్మప్రాప్తించడంలో విలంబాన్ని (ఆలస్యం) కలుగజేస్తుంది. పైన చెప్పిన రెండు విషయాలలోనూ ఒకటి యుక్తమైనది కాదు. మనం ఎవనినీ నీచుడని భావించరాదు. మనచేత నీచుడని భావింపబడేవాడు నీచుడు కాదు. దోషియని భావింపబడేవాడు దోషికాడు. వానిని నీచుడని, దోషియని నిర్ధారణ చేయడం పాపహేతువూ, నరకకారణము అవుతుంది. సత్యాసత్యాలు తెలిసికోకుండ ఒకనిని దోషిగా నిశ్చయించడం కూడ పాపకారణమే అవుతుంది. అయితే ఇది చిన్న పాపమూ, అది పెద్ద పాపమన్నమాట. నేను మంచివాడను కాకున్నా, మంచివాడను అని అనుకోవడమూ, ప్రకటించుకోవడము అనేది కపటవృత్తి, దంభవర్తనము అవుతుంది. దీనికి కూడ ఫలం నరకమే. ఇతరులను ప్రభావితులను చేయడంకోసం నేను శ్రేష్ఠుడను, మంచివాడను, మహాత్ముడను అని ప్రకటించుకోవడం కూడ బహు భయంకరవిషయం అవుతుంది. ఇది కూడ పతనాన్ని కలిగిస్తుంది. తాను మంచివాడే అయినా పరులను

ఏవగించుకోరాదు. ఒకడు పాపాత్ముడైనా వానిని పాపియని, నీచుడని భావించరాదు. ఈవిధమైన వర్తనం మనకు లాభాన్ని కలిగిస్తుంది. దీనికి విరుద్ధమైన వర్తనం పతనాన్ని కలిగిస్తుంది. నిజం చెప్పాలి అంటే నీచుని నీచునిగా భావించడము, తనను శ్రేష్ఠునిగా భావించుకోవడము తగదు. ఈ ప్రవృత్తి పరమాత్మ ప్రాప్తికి అవరోధం అవుతుంది. కారణం ఏమంటే మనం ఎవనిని నీచునిగా భావించేమో వాడు నిజంగా నీచుడేకావచ్చును. మనలను మనం మంచివారు అని అనుకున్నాము. వాస్తవంగా మనం మంచివారమే కావచ్చును. అయినా ఎదుటివానియందు మనకు ఉన్న కొంచెపు బుద్ధి కారణంగా మనలో ఉన్న యీ మంచితనం యొక్క ఫలితం మనకు దక్కకుండ పోతుంది. అదియే మనకు పతనం అన్నమాట. భగవత్ప్రాప్తిని నిరోధించే అంతరాయాలలో ఇది కూడ ఒకటి అని గుర్తు ఉంచుకోవాలి. తగినంత శ్రద్ధలేకపోవడం ఎలా భగవత్ప్రాప్తిని నిరోధిస్తుందో అలాగే నేను మంచివాడను అనే అహంకారవృత్తి కూడ నిరోధిస్తుంది. తన అపరాధం లేనప్పుడు తన నిర్దోషిత్వాన్ని ధ్రువపరచుకోవడంలో తప్పులేదు. పాపంలేదు. కారణం ఏమంటే విషయం నిజమైనది. నిజమైన దానిలో పాపం ఉండదు. కాని అలా ధ్రువపరచుకోవడం అనేది మనకు లజ్జాజనకం అవుతుంది. మన నిర్దోషిత్వం మనం ఏమీ మాటలాడకుండానే పరులచేత గుర్తింపబడాలి. కాని మన మాటల చేత ప్రభావితులై పరులు గుర్తించడం యుక్తంకాదు. ఒకడునన్ను అపరాధిగా భావించాడు అనుకోండి నిజానికి నేను అపరాధిని కాను అనుకోండి అయినా అతని భావానానుసారం అపరాధిని నేను అని ఒప్పుకొన్నాను అనుకోండి! అలా చేసినప్పుడు నాకు లోకంలోనూ గౌరవం దక్కుతుంది. భగవానుని దగ్గర స్థానంప్రాప్తిస్తుంది. ఈ విషయాలను అన్నిటినీ దృష్టిలో ఉంచుకొని మనం మనలను ఎవరైన అపరాధిగా భావించినప్పుడు అయ్యా! అపరాధం నేనే చేసానని మీరు భావిస్తూ ఉంటే ఇదిగో? దోయిలి గట్టుకొని నేను మిమ్ము క్షమాభిక్ష కోరుకుంటున్నాను. అని సవినయంగా మనం పలకాలి. అలాక్షమాభిక్ష కోరడం ఉన్నతస్థాయికి చెందిన విషయం. బహు గౌరవప్రదం అయిన విషయం అవుతుంది. ఈ క్షమాయాచనయే నిష్కామభావంతోనూ,

నిరభిమానంగానూ, కర్తవ్యబుద్ధితోనూ చేయడం జరిగితే అది మరింత మహత్త్వపూర్ణమైన విషయం అవుతుంది. పరులు పాపులు అని, నీచులు అని, అపరాధులని వారిలో ఉన్నవన్నీ అవగుణాలే అని అంటూ పరులందు దోషాలను మనం పరికించకుండా ఉండడం మనం అలవరచుకోవాలి, నేర్చుకోవాలి. వాని విషయాలలో ఉపేక్ష వహించాలి. అలా చేయడంలోనే మనకు లాభం ఉంటుంది. పరుల అపరాధాలనూ, పాపాలనూ, కష్టాలనూ తనమీద పెట్టుకొని భరించే వానిని చూచి భగవానుడు ప్రసన్నత చెందుతాడు. తన అపరాధాలనూ, పాపాలనూ, కష్టాలనూ పరులమీదకు త్రోసివేయువానిని పరిత్యజించివేస్తాడు. అట్టివాడు కడకు పతనాన్ని పొందుతాడు. కాబట్టి మన అపరాధాలనూ, పాపాలనూ, కష్టాలనూ పరులు కోరినా వాని పరం చేయకూడదు. బలవంతంగా వానిని పరుల నెత్తిమీదకు పడద్రోయడం మహాపాపహేతువు అవుతుంది. ఎవరైన తమ నెత్తిమీద పెట్టుకుంటామని కోరినా మన సమస్యలను వారికి అప్పగించకూడదు. పరుల పాపాలను, అపరాధాలను, అప్పులను, ఆపదలను కోరి మన నెత్తిమీద పెట్టుకోవడం మన ఔదార్యానికి అద్దం పడుతుంది. ఇది బహు ఉన్నతస్థాయికి చెందిన భావన. ఈ ఔదార్యమే నిష్కామభావనాపూర్వకం అయితే దాని మహత్త్వానికి పరిధులే ఉండవు. కాని యిందులో నేను చాల గొప్ప కార్యసాధన చేసాను. పరమౌదార్యాన్ని ప్రదర్శించాను అనే అహంకారం ఉదయించడానికి వీలుగా ఉంటుంది. ఉదారతాపూర్వకంగా వ్యవహరించి ఉన్నతమైన కార్యసాధనం చేసినమీదట చిత్తంలో ఏ కొంచెం అభిమానము, అహంకారము ఉదయించినా మన శ్రేష్ఠత్వంలో లోపం కలుగుతుంది. మనకు కలుగవలసినంత లాభం కలుగకుండ పోతుంది.

అహంకారము, అభిమానము ఉదయిస్తే మానవునకు రావలసినంత కీర్తి రాదు. మరణానంతరం స్వర్గప్రాప్తికి కూడ అవరోధం ఏర్పడుతుంది. అనగా దానివలన ఇహమందూ, పరమందూ కూడ నష్టమే కలుగుతుంది. ఇది శాస్త్రసమ్మతము, యుక్తియుక్తము అయిన విషయం అన్నమాట. బుద్ధిమంతుడైన మానవుడు ఈ విధంగా చెప్పబడినవానిలో ఉత్తమోత్తమమైన పద్ధతి యేదో దాని ప్రకారమే తన జీవితాన్ని మలచుకోవాలి. కాని యీ

విషయంలో సాధారణ సోదరుల ఆలోచనలు స్వాభావికంగా నిమ్నస్థాయిలోనే ఉంటూ ఉన్నాయి. వారు పరుల అపరాధం ఆవంత ఉన్నా కొండంతగానూ, తమ అపరాధం కొండంత ఉన్నా ఆవంతగానూ పరిగణిస్తూ ఉంటారు. కాని యీ పరిగణన యిందుకు విరుద్ధంగా ఉండాలి. పరులతోడ మన వ్యవహారం ఒక మిత్రునితో వ్యవహరించడం కంటె మేలైనదిగా ఉండాలి, మన అపరాధం ఆవంత అయిన కొండంతగా భావించుకోవాలి. పరుల అపరాధం కొండంత అయినా ఆవంతగా పరిగణించాలి. శ్రీరామచంద్రమూర్తి వారు కూడ ఇదే చెప్పారు.

నిజ దుఖ గిరి సమ రజ కరి జానా ।
మిత్రక దుఖ రజ మేరు సమానా ॥

పరుల అపరాధాన్ని ఆవంతగా కూడ పరిగణించకపోవడం మరీ మంచిది. తన మిత్రుని విషయంలో ఈ విధంగా వ్యవహరించని వానిని నిందిస్తూ తులసీదాసు - ఎవడు తన మిత్రుని దుఃఖాన్ని చూచి దుఃఖితుడు కాడో వాడు పరమనీచస్థాయికి చెందిన మానవుడు. వాని ముఖం కూడ చూడకూడదు. చూస్తే మహాపాతకం చుట్టుకుంటుంది అని చెప్పాడు.

జే న మిత్ర దుఖ హోహి దుఖారీ ।
తినహి బిలోకత పాతక భారీ ॥

మీకు మరొక్క నూతన విషయం చెపుతున్నాను వినండి! అది ఏమంటే మనకు హాని కలిగించేవాడు ఉంటాడు. వానిని మనం శత్రువు అంటాం కదా! ఆ శత్రువే దుఃఖగ్రస్తుడైతే వాని యందు సానుభూతిని వహించి దుఃఖాన్ని పొందడం అనేది బహు ఉన్నతస్థాయికి చెందిన ఉత్తమలక్షణం అవుతుంది. అట్టివాని దుఃఖాన్ని చూచి దుఃఖం పొందనివాడు నిమ్నస్థాయికి చెందిన పురుషుడు అవుతాడు.

మిత్రుని చూచి దుఃఖానుభవం పొందనివాని ముఖం చూడకూడదు అని ముందు చెప్పియే ఉన్నాము కదా! అంతకంటెను విశిష్టమైన విషయం ఏమంటే తన శత్రువుయొక్క దుఃఖాన్ని చూచి దుఃఖం పొందకపోవడం కూడ తక్కువ పాపహేతువుకాదు. శత్రువు దుఃఖపడుచుండగ చూచి సుఖమును పొందేవాడు బహు నీచస్థాయికి చెందినవాడూ మహాపాపి

అవుతాడు. మిత్రుని దుఃఖాన్ని చూచి అందరూ దుఃఖాన్ని పొందుతారు. శత్రువు యొక్క దుఃఖాన్ని చూచి దుఃఖం పొందడమే మహత్త్వపూర్ణమైన విషయం. శత్రువు సుఖం పొందగా చూచి సుఖం పొందేవానిని గాంచి భగవానుడు ప్రసన్నుడు అవుతాడు.

ఇక్కడ మీకు మరొక్క రహస్యవిషయం చెప్పవలసియున్నది. అదేమి అంటే రెండు పార్టీలు ఉన్నాయి అనుకోండి! అందులో ఒకటి మనది, మరొకటి ఇతరులది. ఆ రెండు పార్టీలమధ్య అభిప్రాయభేదాలు ఉన్నాయి. అందులో అపరాధం మన పార్టీది అయినప్పుడు మనం రెండోపార్టీవారిని క్షమాభిక్ష వేడుకోవాలి. మన పార్టీవారు అలా చేయడానికి ఇష్టపడకపోవచ్చును మన మీద కోపాన్ని ప్రదర్శించవచ్చును. అయినా వారి మాటను కాదని మనం క్షమాభిక్ష కోరుకోవాలి. అపరాధం మన పార్టీది. కాబట్టి మనం క్షమాభిక్ష వేడుకొంటే భగవానుని దగ్గర మనం దండనం పొందవలసిన పని యుండదు. ఒక విధంగా చెప్పాలి అంటే ఎల్ల సందర్భములందూ ఎల్లవారినీ క్షమాభిక్ష కోరుకుంటూ ఉండడం అనేది మనకు ఇహంలో గౌరవాన్ని కలిగిస్తుంది. పరంలో పరమలాభాన్ని చేకూరుస్తుంది. అపరాధం ఇతరపార్టీది అయినా కూడ మనం దానిచేత దండన విధానాన్ని అనుభవింపజేయకుండా ఉండాలి. అలా చేయడం మనకు గౌరవహేతువు అవుతుంది. మనం ఆ పార్టీవారిని అవమానించరాదు. చిన్నబుచ్చరాదు. వారి అపరాధాన్ని అపరాధంగా పరిగణించరాదు. అని మన పార్టీవారికి నచ్చజెప్పుకోవాలి. అలాగే తప్పు మన పార్టీదే అయినప్పుడు కూడ రెండవ పార్టీవారి దోషం లేదు కాబట్టి వారిని మనం అవమానించకూడదు. అపరాధం వారిదే అని అనిపించకూడదు. అలా చేస్తే మనమే అపరాధులం అవుతాము. అని మనం మన పార్టీ సభ్యులకు నచ్చజెప్పుకోవాలి. అట్టి సందర్భంలో మనం మౌనంగా ఉండడమూ తప్పే, పక్షపాతబుద్ధి వహించడమూ తప్పే, కాబట్టి అన్నివిధాలా సభ్యులకు నచ్చజెప్పి రెండవ పక్షం వారిని క్షమాభిక్ష వేడుకోవాలి. అలా చేసినప్పుడు మన పార్టీవారు ఎట్లును మనవారే. రెండవ పక్షంవారు కూడ మనవారు అయిపోతారు. మన ప్రవర్తన చేత వారు విశేషంగా ప్రభావితులు అవుతారు. తన ప్రవర్తనంచేత తన శత్రువును

కూడ ప్రభావితుని చేసేవాడు శ్రేష్ఠుడుగానూ, ఉత్తమపురుషుడుగాను భావింపబడతాడు. అభిమానాన్ని, స్వార్థాన్ని త్యజించడం వలన మనస్సులో వినయము, అహంకారరాహిత్యము కలిగియున్న మీదటనే ఇట్టి పని సాధ్యంఅవుతుంది. ఇది సర్వోత్కృష్టం అయిన విషయం. మానవదేహాన్ని పొంది కూడ మనం ఈ పని చేయలేకపోతే మనకు అంతకంటె దుఃఖజనకము, లజ్జాజనకము అయిన విషయం వేరొకటి ఉండదు. మనం మానవులం అనిపించుకుంటున్నాము అంటే మన ప్రవర్తన ఎప్పుడూ ఉన్నతస్థాయి మానవత్వాన్ని ప్రకటించేదిగా ఉండాలి. మన ఆచరణాలు ఉత్తమపురుషుల ఆచరణాలవలనే ఉండాలి. అలా ఉన్నప్పుడే మనకు ఇహమందూ, పరమందూ కూడ శుభం చేకూరుతుంది. ఇదే నిజమైన సంస్కరణం అవుతుంది. ఎంతో కాలంగా భగవద్భజన చేస్తున్నా నెరవేరని కార్యం ఈ విధమైన ప్రవర్తన వలన శీఘ్రంగా నెరవేరుతుంది. గౌరవాదరాల కాంక్ష, పేరుప్రతిష్ఠలమీద ఇచ్ఛ, అహంకారమూ, మమకారమూ, ఆసక్తి, స్వార్థమూ మున్నగువానిని వీడి సవినయంగాను, ప్రేమపూర్వకంగాను మనం అందరితోను వ్యవహరిస్తూ ఉండాలి. ఆ వ్యవహారం కూడ కేవలము భగవత్ప్రాప్తిని లక్ష్యంగా చేసుకొని నిష్కామభావంతో సాగిస్తూ ఉంటే శీఘ్రంగా భగవత్ప్రాప్తి కలుగుతుంది. భజనమూ, ధ్యానము వలన భగవత్ప్రాప్తి కలగాలి అంటే అది కేవలము నిష్కామభావంతో కూడినప్పుడే సాధ్యం అవుతుంది. సకామసాధనవలన కూడ ఆత్మసంస్కరణము, ఆత్మోద్ధరణము జరుగుతుంది. కాని అందు విలంబం (ఆలస్యం) అవుతుంది. సకామభావంతో సాగించే భజనధ్యానవిధులను ఒకప్రక్క, నిష్కామభావంతో నిరభిమానంగా పరోపకారబుద్ధితోను, త్యాగబుద్ధితోను పరులతో సాగించే ఉన్నతస్థాయి వ్యవహారం వేరొక ప్రక్క ఉంచి సరిపోల్చి చూస్తే రెండవదే సర్వోత్కృష్టమైనది అవుతుంది. భగవానుడు గీతలోను కూడ చెప్పియున్నాడు -

**శ్లో॥ శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్ ॥**

(గీత 12-12)

విషయగ్రహణము లేని అభ్యాసముకన్న జ్ఞానము శ్రేష్ఠమైనది. జ్ఞానముకన్న కర్మఫలత్యాగము గొప్పది. కారణమేమన త్యాగముచే వెనువెంటనే పరమమైన శాంతి లభించుచున్నది.

కర్మఫలాసక్తినివీడి నిష్కామభావముచే చేయబడిన కర్మ శ్రేష్ఠమైనది. దీనిచే తత్క్షణమే పరమశాంతి లభించును.

# భగవత్ప్రాప్తి శీఘ్రంగా ఎలా కలుగుతుంది?

ఒక్కక్షణంలో భగవత్ప్రాప్తి ఎలా కలుగుతుంది? అందుకు ఉపాయం ఏదైన ఉంటేచెప్పండి! అని ఒక సోదరుడు నన్ను అడిగాడు. అప్పుడు నేను ఇలా అన్నాను - నాయనా! ఒక్కక్షణంలో కాదు. మొత్తం జీవితంలో ఎప్పుడు భగవత్ప్రాప్తి కలిగినా మీరు ఎట్లునూ ధన్యులే అవుతారు. నేను కూడ ధన్యుడను అయ్యానని సంతోషిస్తాను. కారణం ఏమంటే ఎవనికి భగవత్ప్రాప్తి కలుగుతుందో వానికి భగవానుని కృపవలన స్వమూ లభించినట్లే అవుతుంది. భగవత్ప్రాప్తి అన్నది ఎవడు పాత్రుడో వానికి కలుగుతుంది. కాని మనం అట్టి పాత్రత కలవారం కాము. పరమాత్మను పొందడం కంటే మంచి విషయం మరియొకటి లేదు. మంచి విషయాన్ని తెలుసుకోవడంలో ఆలస్యం చేయకూడదు.

పరమాత్మ అనేవాడు ఒకడు ఉన్నాడు అనే విశ్వాసం ముందుగా బలపడాలి. అలా విశ్వాసం బలపడినవానినుండి భగవానుడు దాగుకొనలేడు. ఏ వస్తుపరిజ్ఞానం అయినా క్షణంలో కలుగుతుంది. జ్ఞానం కలిగిన వెంటనే అజ్ఞానం నశిస్తుంది. భగవత్ప్రాప్తి కలుగకపోవడానికి అజ్ఞానమే కారణం. దాని మూలంగానే భగవత్ప్రాప్తి కలుగడంలో విలంబం అవుతూ ఉంటుంది. ఈ విషయంలో చెప్పుకోదగిన కథ ఒకటి ఉంది. అదెట్టిది? అంటే -

జనకమహారాజులు ఎందరో అయ్యారు. వారిలో ఒక జనకుని కథయిది. ఆ జనకుడు సాధుశీలురు అయిన బ్రాహ్మణులను రావించి

వారికిసేవాసత్కారాలు చేసేవాడు. భోజనాలు పెట్టేవాడు. అంతమందు - అయ్యా! మీరు జ్ఞానులు మహాత్ములు అయితే నాకు ఉపదేశం చేయండి! ఆ చేయడం కూడ ఎలాగ అంటే కాళ్ళు పెట్టుకోవడానికి గుఱ్ఱపు జీనుకు అమర్చబడియుండే సాధనాలలో (రికాబుల్లో) ఒకదానిలో నేను అడుగుపెట్టి రెండవదానిలో పెట్టే అంత సమయంలో నాకు జ్ఞానోదయం అయిపోయే విధంగా చేయండి అని వారిని కోరేవాడు. అతనికి ఉపదేశం చేయడానికి గొప్పగొప్ప జ్ఞానులు, మహాత్ములు, ఎందరో వచ్చేవారు. కాని అతనికి జ్ఞానం కలిగించలేకపోయేవారు. అంతట వారిని ఆ మహారాజు ఖైదీలనుగా పట్టి బంధించేవాడు. అలా అతడు వందలాది మహానుభావులను ఖైదీలనుగా పట్టి బంధించాడు.

ఆ కాలంలో కహోడుడు అనే ముని ఒకడు ఉండేవాడు. అతడు కూడ మహారాజుకు జ్ఞానోపదేశం చేయడం కోసం వచ్చి విఫలుడు అయ్యాడు. అతనిని కూడ జనకుడు బంధించాడు. ఆకహోడునకు ఒక కొడుకు ఉన్నాడు. అతని పేరు అష్టావక్రుడు. అతనికి ఆ పేరు రావడానికి ఒక కథ ఉంది. మాతృగర్భంలో ఉన్న కాలంలోనే అతనికి చతుర్వేదపరిజ్ఞానం ప్రాప్తించియుంది. ఒకనాడు అతని తండ్రియైన కహోడుడు వేదం పఠించడం మొదలుపెట్టాడు. అతని పఠనంలో తప్పులు దొర్లసాగేయి. అది విని గర్భవతుడైన పిల్లవాడు తండ్రీ! మీ పఠనంలో ఇది తప్పు, అది తప్పు అని అంటూ కొన్ని తప్పులను ఎంచాడు. దానితో కహోడునకు కోపం వచ్చింది. అప్పుడు అతడు ఓరీ! గర్భగతుడవై యున్న దశలోనే నీవు నా తప్పులను ఎంచుచున్నావు బయటకు వస్తే నన్ను ఇంకా ఎంత అవమానిస్తావో? అని క్రోధావేశంతో గర్భం మీద కాలితో తన్నాడు. గర్భం లేతదశలో ఉన్న కారణాన అందలి శిశువు శరీరంలో వంకరలు ఏర్పడ్డాయి. ఆ బిడ్డకు కాళ్ళు వంకర, చేతులు వంకర, శరీరం అంతా వంకర అయిపోయింది. ఒక విధంగా అతడు ఎనిమిది వంకరలతో వికృతశరీరుడై జన్మించాడు. ఆ కారణంగా అతనికి అష్టావక్రుడు అనే పేరు వచ్చింది.

అష్టావక్రుని తండ్రియైన కహోడుడు జనకునకు జ్ఞానోపదేశం చేయడానికి వెళ్లిన సమయానికి అష్టావక్రుని వయసువాడు, అగు ఒక మునిబాలకుడు

ఉండేవాడు. అతడు ఉద్దాలకుని కుమారుడు. అష్టావక్రునకు మామ. అతని పేరు శ్వేతకేతుడు. బాల్యంలో ఆ మామ, ఈ మేనల్లుడూ కలిసి ఆడుకునేవారు. శ్వేతకేతునితో ఉన్న సాహచర్యము, చిన్నతనము కారణంగా అతని మాతాపితరులను అతనితో పాటు అష్టావక్రుడు కూడ అమ్మ, నాన్నా అనియే పిలుస్తూ ఉండేవాడు. నిజానికి వారు అతనికి మాతామహుడూ, మాతామహీ అవుతారు. చిన్నపిల్లల్లో ఒకరిని చూచి ఒకరికి ఇలాంటి అలవాటులు రావడం సహజం. వారు ఇరువరురూ కలిసి ఆడుతూ, పాడుతూ తిరిగేవారు. రాజస్థానం ప్రాంతంలో బంతితో రాజ్యాన్ని కూల్చే ఆట ఒకటి ఉంది. ఒకనాడు మామాఅల్లుళ్ల అదే ఆట ఆడారు. అష్టావక్రుడు బంతి విసిరాడు. అది లక్ష్యాన్ని తాకింది. అష్టావక్రుడు గెలిచాడు. నాదే గెలుపు అన్నాడు. దానితో వాని మామ శ్వేతకేతునకు కోపం వచ్చింది. నీవు ఇక్కడ గెలుపు నాదే అని సంబరపడిపోతున్నావు. బాగానే ఉంది.కాని అక్కడ నీ తండ్రి జనకుని చేత బంధింపబడి చెరలో మ్రగ్గుతున్నాడురా! అని అతడు అష్టావక్రుని ఎత్తిపొడిచాడు. ఆ మాట అష్టావక్రుని మనమున ములికివలె నాటుకొంది. వెంటనే అతడు తన తల్లిని సమీపించి అమ్మా! నాతండ్రి యెవరు? అని అడిగాడు. ఇదుగో! ఈయన కాదా? అని ఆమె తన తండ్రిని చూపింది. కాదు ఈయన నాతండ్రి కాడు. నీతండ్రి. నాతండ్రి యెక్కడ ఉన్నాడో చెప్పుమమ్మా! అన్నాడు మళ్లీ అష్టావక్రుడు. నాయనా! నీవు పుట్టిన వెంటనే నీతండ్రి జనకుని కొలువునకు పోయి అతని చేత చెరలో బంధింపబడినాడు అని ఆమె బదులు చెప్పింది. ఆ మాట విని అమ్మా! నేను పోయి ఆ జనకుని దగ్గర విజయం సాధిస్తాను అన్నాడు అష్టావక్రుడు. కొడుకును వారించడానికి తల్లి శతవిధాల ప్రయత్నించింది. అయినా అతడు వినలేదు. అతనిలో ఒకవిధమైన ఆవేశం ప్రవేశించింది. అతడు జనకుని సభకు పయనం అయ్యాడు. శ్వేతకేతుడు కూడ అతనిని అనుగమించాడు. క్రమంగా వారు ఇరువురుజనకుని సౌధద్వారం సమీపించారు. మీరు ఎక్కడకు? అని ద్వారపాలకుడు వారిని నిరోధించాడు. రాజసభలోనికి అని వారు అన్నారు. అక్కడ సాగుచున్నది పండితసభ. బాలకుల సభకాదు అన్నాడు ద్వారపాలకుడు. వయస్సులో బాలకులైనవారా?

లేక జ్ఞానంలోనూ, బుద్ధిలోనూ బాలకులు అయినవారా? ఆ సభలోనికి పోవకూడనివారు? వయస్సులో బాలకులు అయినవారు అందువా? లోనికి పోవడానికి మాకు అధికారం ఉండదు. మూర్ఖులైన బాలకులు అందురా? మేం మూర్ఖులం కాదు. మాకులోనికి పోవడానికి అధికారం ఉంటుంది. కావాలి అంటే నీవు మాతో శాస్త్రార్థం చెయ్యి! నీ ప్రశ్నలకు మేం సమాధానాలు చెప్పగలిగితేనే మమ్మ లోపలకు పంపించు! అని వారుసవాలు చేసేరు. అబ్బో! ఈ బాలురు సామాన్యులుకారు. పండితులను కూడ పరాజితులను గావింపగల ప్రజ్ఞాప్రాభవం కలవారు అని తలచి ద్వారపాలకుడు లోపలకు పోవనిచ్చాడు.

అంతట వారు సభలో ప్రవేశించారు. సభలోనివారు అష్టావక్రుని చూచి పరిహసించడం మొదలుపెట్టారు. వారిని గాంచి అతడు కూడ అలాగే నవ్వడం మొదలుపెట్టాడు. నీవుఎందుకు నవ్వుతున్నావు? అని జనకుడు అతనిని ప్రశ్నించాడు.

అయ్యా! ఇక్కడజరుగుతున్నది పండితసభ అనుకున్నాను, కాని యిక్కడ ఇది పండిత సభకాదు. చర్మకారుల సభ. ఇక్కడ కూర్చున్నవారు అందరూ చర్మకారులే. ఈ విషయం ముందుగా తెలిసిఉంటే నేను ఇక్కడకు వచ్చేవాడను కాదు. ఇది ఏదో పండిత సభ అనుకొని భ్రమపడి నేను ఇక్కడకు వచ్చాను. పండితులైనవారు గుణాన్ని విద్యను చూస్తారు. చర్మకారులు తోలును, ఎముకలను పరిశీలిస్తారు. ఇక్కడ వున్న పండితులు ఎముకలతోనూ, చర్మంతోనూ తయారైన శరీరాన్ని చూచి నవ్వుతున్నారు. వారి అజ్ఞానాన్ని చూచి నాకు నవ్వువచ్చింది వారిని చూడగా చూడగా నాకు చాల ఆశ్చర్యం కలుగుతోంది. అని అష్టావక్రుడు బదులు చెప్పాడు. అప్పుడు సభాసదులు అందరూ మౌనం వహించారు.

అటు పిమ్మట అష్టావక్రుడు మళ్ళీ ఇలా అన్నాడు. మహారాజా! మీ కొలువులో ఒక విలక్షణపద్ధతి ఉన్నట్లు నేను వినియున్నాను. ఏమంటే ఏ పండితులైన ఇక్కడకు వచ్చి జ్ఞానోపదేశం చేయవచ్చుననీ, ఉపదేశం ద్వారా మీకు సంతుష్టికలిగిస్తే మీరు వారిని సంతోషపెడతారని, సంతుష్టి కలిగించలేకపోతే వారిని ఖైదీలుగాబంధించి చెరలో పెడతారని, గుట్టుపు

రికాబుల్లో ఒకదానిలో అడుగుపెట్టి రెండవదానిలో అడుగు పెట్టే అంత అల్పసమయంలో జ్ఞానోపదేశం చేయాలన్నది మీ ఆదేశం అని. అలా చేయగలిగినవానినే యిక్కడ జ్ఞానిగా పరిగణిస్తారని, అట్టి నియమం ఇక్కడ ఏర్పాటు చేయబడిందని నేను విన్నాను. ఏమి ఇది నిజమా?

అది విని అవును, నిజమే. నియమం అట్టిదే అన్నాడు జనకుడు. అందుచేతనే మీకుజ్ఞానోదయం చేయాలి అనే సంకల్పంతో నేను ఇక్కడకు వచ్చాను అన్నాడు అష్టావక్రుడు. సరియే! ఒక్క విషయం గుర్తు ఉంచుకో ముని బాలకా! గుఱ్ఱపు రికాబుల్లో ఒకదానిలో అడుగుపెట్టి రెండవదానిలో పెట్టే లోపుననే నాకు జ్ఞానం గలిగించాలి అన్న మాటను గుర్తుంచుకో! అన్నాడు జనకమహారాజు. ఆ అల్పసమయంలో ఒక్క మారు కాదు. ముమ్మారు జ్ఞానోపదేశం చేస్తాను అన్నాడు అష్టావక్రుడు. సరే! అన్నాడు జనకుడు. గుఱ్ఱం తెప్పించబడింది. అష్టావక్రుడు ఎదుట నిలిచియున్నాడు. మహారాజు ఒక రికాబులో అడుగుపెట్టాడు. రెండవదానిలో వెంటనే అడుగు పెట్టబోతూ ఉండగా రాజేంద్రా! మనస్సును పిడికిలిలో బంధించి పట్టుకోండి! అన్నాడు అష్టావక్రుడు. అయ్యయ్యో! అది ఎలా సాధ్యం? మనస్సును పిడికిలితో పట్టుకొనేది ఎలాగ? అది ఏమైనా పిడికిలి పట్టుకి దొరికే వస్తువా? అన్నాడు మహారాజు. అయ్యా! నా అభిప్రాయం ఏమంటే నేను మరియొక ఆదేశం ఇచ్చేవరకు మనస్సు మీ పిడికిటిలో ఉండాలి. మీ ధ్యానాన్ని అంతను మీ పిడికిలి మీదనే కేంద్రీకరించండి! ఒక సారిగా మీ మనస్సు మీ పిడికిటిలో నిలిచిపోవాలి. అది యిటూ అటే చలించకూడదు. అన్నాడు అష్టావక్రుడు. అది అసాధ్యం అన్నాడు మహారాజు. అయితే ఇంత అల్పసమయంలో జ్ఞానం కలుగడం కూడ అసాధ్యమే అంటూ అప్పుడు అష్టావక్రుడు ఇలా అన్నాడు. అయ్యా! మహారాజా! జ్ఞానోపదేశం అనేది పాత్రుడైనవానికి చేయబడుతుంది. మీరు అందుకు పాత్రులే అయితే ఇంత ఎక్కువ సమయం అక్కర లేనే లేదు. మీ దగ్గర పాత్రతలేదు పైగా ఉపదేశం చేయలేకపోయారు అనే కుంటిసాకుతో బ్రాహ్మణులను, ఋషులను పట్టి బంధిస్తున్నారు. మీ దగ్గర జ్ఞానోపదేశం పొందడానికి ఆవశ్యకమైన పునాదియే లేదు. జ్ఞానం కలిగించండి అని మాత్రం అంటున్నారు. మీ

నైఖరి చూస్తే చేతితో జల్లెడను తెచ్చి అందు పాలు పోయుము అన్నట్లు ఉంది. జల్లెడలో పాలు ఎట్లు నిలుస్తాయి? పాలు నిలవాలి అంటే అందుకు పాత్ర ఉండాలి. మీరు పాత్రత లేనివారైయుండి బ్రాహ్మణులను దోషులుగా ప్రకటిస్తున్నారు. ఇది మీరు చేస్తూ ఉన్న అన్యాయం.

ఈ మాటలు విని మహారాజా! అయితే మరి ఏమి చేయాలి? అని ప్రశ్నించాడు. ముందు మీరు పాత్రులు కావాలి. పాత్రులు అయిన తరువాతనే ప్రశ్నించాలి. మీరు పాత్రులు అయిన మీదట మీరు నిర్ణయించిన సమయంలోపల మీకు జ్ఞానోపదేశం చేయలేనినాడు నన్ను మీరు బంధించవచ్చును, అని అష్టావక్రుడు బదులు చెప్పాడు. అప్పుడు జనకుడు తనలో ఆలోచించుకొని సరియే! అట్లే కానియ్యి మహాత్మా! నీవే నన్ను పాత్రుని చెయ్యి అన్నాడు. పాత్రుడు కావడానికే తగినంత సమయం పడుతుంది. పాత్రులు అయిన తరువాత ఆలస్యం అను ప్రశ్నయే ఉండదు, అన్నాడు అష్టావక్రుడు. అయితే ఇప్పుడు నేను ఏమి చేయాలి? అని అడిగాడు జనకుడు. ముందుగా మీరు చెరలో బంధించిన నిరపరాధులైన బ్రాహ్మణులను అందరనూ విడిచిపెట్టండి అటుపిమ్మట పాత్రతను పొందడానికి ప్రయత్నించండి అప్పుడు మీకు జ్ఞానోపదేశం చేస్తాను ఒక్కక్షణం పని, ఒక్క నిముషం పని, అన్నాడు అష్టావక్రుడు. అతడు చెప్పినట్లుగానే మహారాజు ఆచరించాడు. అప్పుడు అష్టావక్రుడు జనకునకు ఉపదేశం చేసాడు. ఆ ఉపదేశం పేరు అష్టావక్ర గీత', ముందు మనం భగవత్ప్రాప్తికి పాత్రులం అయితే తరువాత లక్ష్యం సిద్ధించడంలో విలంబం ఉండదు అని ఆ గీతలో చెప్పబడింది. విద్యుత్ప్రసారానికి వలయు ఏర్పాటులు చేయడానికే తగినంత సమయం పడుతుంది. తరువాత స్విచ్చినొక్కితే చాలు. బల్బు వెలిగిపోతుంది కదా! ఒక్క నిమిషం కూడ విలంబం కాదు. ఆలస్యం అనేది విద్యుత్ప్రసారసంబంధమైన ఏర్పాటులదే కాబట్టి ముందు అర్హతను సంపాదించుకోవాలి. తరువాత జ్ఞానం క్షణంలో కలుగుతుంది. విలంబం ఉండదు. ఈ విషయం మీకు బాగా అవగాహనకు రావడం కోసమే. ఇక్కడ ఈ కథను ఉదాహరించడం జరిగింది.

ఒక్కక్షణంలో భగవానుని పొందడం ఎలాగ? అన్నది ప్రశ్న. అందుకు ముందుగా మనం పాత్రులంకావాలి. పాత్రులం అయితే వెంటనే భగవానుడు లభిస్తాడు అన్నది నా సమాధానం. కాబట్టి మనం పాత్రులం కావడానికి ప్రయత్నం చేయాలి. అందుకు ఉపాయం భగవానుని సర్వత్ర చూడగలగడం. సర్వత్రా భగవానుని చూచే బుద్ధి మనకు సిద్ధిస్తే శీఘ్రంగా పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. కాని అట్టి బుద్ధి కల మహాత్ముడు లోకంలోదొరకడం కష్టం. కారణం ఏమంటే ఎన్నో జన్మలు ఎత్తిన తరువాత కాని ఒక జ్ఞానియైన మహానుభావునియందు 'వాసుదేః సర్వం' అనే బుద్ధి కలుగదు.

భగవానుడు గీతలో చెప్పియున్నాడు -

**శ్లో॥ బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।**
**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదర్లభః ॥**

(గీత 7-19)

అనేక జన్మల తరువాత తత్త్వజ్ఞానియగు పురుషుడు సర్వము వాసుదేవుడే యని నన్ను భజించును. అట్టి మహాత్ముడు దొరుకుట చాలా కష్టము.

దీనికి ముందు ఒక్క విషయం అర్థం చేసుకోవాలి. గుర్తు ఉంచుకోవాలి. అదేమి అంటే లోకంలో ఉన్న సర్వమూ భగవానునదే అన్నమాట. ఇది అర్థం చేసుకున్నప్పుడే భగవత్ప్రాప్తి కలుగుతుంది. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి సర్వత్రా భగవానుడు ఉన్నాడని భావించేవానికి ఒక కుక్క యందు కూడ భగవద్భావన కలుగుతుంది. కలగాలి. నిజం ఆలోచిస్తే ఒక కుక్కయందు భగవద్భావన కలుగడం కష్టం. కారణం ఏమంటే ఆ ప్రాణి స్వయంగా అపవిత్రం అయినది. అపవిత్రపదార్థం తింటుంది. దాని నిలువు ఎల్లా అపవిత్రతయే అయినా అదికూడ పరమాత్మస్వరూపమే. దానియందు కూడ భగవద్భావన కలగాలి. అట్టి పరిస్థితిలో మనం ఏం చేస్తున్నాము? సాక్షాత్తూ భగవానుడు అయినవానియందూ, భగవానుని పడసిన ఉత్తమపురుషుని యందూ, భగవత్సంబంధమైన జిజ్ఞాస కలవానియందూ, భగవత్ప్రాప్తి కోసం సాధన చేయాలని తహతహలాడే వానియందూ కూడ దోషదృష్టి వహిస్తున్నాము. రంధ్రాన్వేషణం చేస్తున్నాము. ఈ దశలో ఉన్న మనకు మేలు కలగాలి అంటే ఎలా కలుగుతుంది? భగవానుడు ఏమి

అంటున్నాడు? అందరియందు భగవద్బుద్ధి కలిగియుండాలి అంటున్నాడు. కాని మనం ఆవిధమైన భావాన్ని జిజ్ఞాసువులయందు చూపడంలేదు. మహాత్ములయందు చూపడంలేదు. భగవానుని యందు చూపడంలేదు. భగవద్బుద్ధి అందరి యందు కలిగి ఉండాలి. సర్వత్రా ఆ భావాన్ని సాధించుకోకపోతే కనీసం మహత్తరసాధన చేసినవారియందు, భగవానునియందు అయినా ఆ భావనను నిలుపుకోగలగాలి. ఉన్నతస్థాయికి చెందిన సాధకులయందు, మహాపురుషులయందు కూడ మన బుద్ధి ఉన్నతస్థాయికి చెందినదిగా ఉండడంలేదు. వారియందు మనకు భగవద్బుద్ధి నిలవడం లేదు. వారి సుగుణాలనైన మనం పరిగణించడం లేదు. వారి అవగుణాలను గూర్చి మాత్రం చర్చిస్తూ ఉన్నాము. ఈ స్థితిలో ఉన్న మనకు భగవత్ప్రాప్తి ఎలా కలుగుతుంది? ఇదే మనకు అడ్డువచ్చే క్లిష్ట సమస్య.

ఒక సాధకుడు ఉన్నాడు. అతడు తనకు భగవత్ప్రాప్తి కలుగలేదని చెప్పాడు. ఆ మాట నిజం అని మాకు తెలుసును. అయితే కారణం ఏమిటి అన్నది ప్రశ్న. విచారణ చేయగా అతనిలో కొన్ని అవగుణాలు ఉన్నట్లు తేలింది. అతనికి అప్పుడప్పుడు విసుగుదల కలుగుతూ ఉండేది. క్రోధానికి, లోభానికి లోనవుతూ ఉండేవాడు. అప్పుడు అతనివలన ఏదో పొరపాటు చర్య, ఏదో దోషపు చర్య జరిగిపోతూ ఉండేది. మేము అతనిని పరిహసిస్తూ వ్యాఖ్యానాలు చేసేవారం. మరొక్క విషయం ఇక్కడకు సత్సంగంలో పాల్గొనడానికి వచ్చేవారికి భోజనాదికం సమకూర్చే సజ్జనులు ఉన్నారు. వారియందు కూడ మనకు దోషదృష్టి కలుగుతూ ఉంటుంది. ఇది ఉదాహరణకోసం చెప్పిన మాట. ఇంతకూ చెప్పవలసిన విషయం ఏమంటే ఏ సోదరునిలో ఎలాంటి అవగుణాలు వున్నా మనం వాని వంకకు చూడరాదు. ఎదుటివారి అవగుణాలను పరిగణించరాదు. వారిలోని మంచి గుణాలనే పరిగణనలోనికి తీసుకోవాలి. అలా చేసినప్పుడే మనకు లాభం కలుగుతుంది. అట్లుకాక మనం అవగుణాలనే పరికిస్తూ ఉంటే క్రమంగా మనలో అవగుణాలే అవగుణాలు చోటు చేసుకోవడం మొదలవుతుంది. మనింటిలో (హృదయంలో) మాలిన్యం ప్రవేశించటం మొదలవుతుంది. ముందే అది కొంత మేరకు

మాలిన్యం కలిగి ఉంది. చుట్టుపట్టుల మాలిన్యాన్ని కూడ సేకరించుకోవడం మొదలుపెడితే మనం ఉద్ధరించబడడం మాట అటు ఉంచి పతనం దిశగా పరుగులు పెట్టినవారం అవుతాము.

ఒక వ్యక్తి నాదగ్గరకు వచ్చి అయ్యా! ఇక్కడకు సత్సంగం కోసం వచ్చిన భక్తులకు నివాసానికై గదులను ఇచ్చే కార్యకర్తల మూలంగా ఫలానా వ్యక్తి బాధపడుతున్నాడు అని నాతో చెప్పాడు. అతడు చెప్పిన మాట నిజమే. అప్పుడు నేను అతనితో ఇలా అన్నాను - నాయనా! ఈ విషయమే అట్టిది. ఈ కార్యభారమే మీకు అప్పగించామనుకోండి. అప్పుడు మీలో ఇంతకంటెను ఎక్కువ దోషాలు రావచ్చును. నామాట మీద మీకు నమ్మకం లేకపోతే నేటినుండి ఆ కార్యభారం మీరే వహించి యింతకంటె చక్కగా నిర్వహించి చూపండి దోషాలను ఎత్తి చూపడం తేలిక. క్రియలో దోషం అయితే మనం శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు అంతటివారి యందు కూడ ఎత్తి చూపగలం. నిజానికి వారు నాసూచన మేరకే భక్తులకు గదులను ఇస్తున్నారు. ఒక్కొక్కప్పుడు వ్యవహారం చెడుతూ ఉంటుంది. అప్పుడు గదులు ఇవ్వడానికి నేనూ ఇష్టపడను. వారు ఇష్టపడరు. భగవానుడు మాత్రం ఎలా ఇష్టపడతాడు? అప్పుడప్పుడు ఇలాటిసంఘటన జరుగుతునె ఉంటుంది. సేటుగారు మంచివారే. వీడే దొంగ అని ఇక్కడకు వచ్చినవాళ్ల అనుకుంటారు. ఇట్టి పరిస్థితిలో కష్టం కలగడం సహజమే. వారికి బదులుగా ఆ స్థానంలో మరి యొకడు ఉన్నా వానికి కూడ ఇట్టి పరిస్థితే ఎదురు అవుతుంది. భగవానుని సంకల్పానికి అనుగుణంగానే నాలో ప్రేరణ కలుగుతుందనీ, తదనుసారంగానే నేను ఇక్కడివారికి సూచనలు ఇవ్వడం జరుగుతుందనీ, ఇక్కడ నా సంకల్పమే భగవానుని సంకల్పం. భగవానుని సంకల్పమే నా సంకల్పం అని నా నమ్మకం. అది నా భావన. అందు ఎవరైన దోషారోపణం చేస్తే అది నామీద చేయబడినట్లుగానే నేను భావిస్తాను. దోషారోపణం నామీద చేసినా, భగవానుని మీద చేసినా నా మీద చేయబడినట్లే భావించుకుంటాను. కాబట్టి నేను చెప్పదలచిన సారాంశం ఏమంటే మనం ఎవరి మీదనూ దోషబుద్ధి, ద్వేషబుద్ధి కలిగి యుండరాదు. సద్బుద్ధినే కలిగియుండాలి. ఎవరికైన మనం ఏదైనా నచ్చజెప్పాలి అనుకుంటే వాని

గుణాలనే విశేషంగా ప్రశంసించాలి. అవగుణాలను గూర్చి తక్కువగా ప్రసంగించాలి. ముందు వారి గుణాలను ప్రసంగించాలి. సత్సంగ లాభాన్ని కూడ వదలుకొని మీరు ఇక్కడ ఎంత సేవ చేస్తున్నారు? ప్రొద్దు అంతా మీకు ఈ పనితోనే సరిపోతూ ఉంది అని యీ విధంగా ఇంకనూ మీకు గోచరించిన గుణాలను అన్నిటినీ ప్రసంగించాలి. అప్పుడు అతడే అయ్యా! మాలో ఏదైన లోపం ఉంటే తెలియచేయండి అని మిమ్ము అడుగుతాడు. లోపాన్ని గూర్చి నేను ఏమి చెప్పగలను? అయినా మీరు అడుగుతున్నారు కాబట్టి చెప్తుతున్నాను. మీరు చేసిన ఫలానా పని అలా కాక ఇలా చేసిఉంటే బాగుండేది అని మాత్రం నాకు తోస్తుంది అని సవినయంగా అప్పుడు మీరుపలికి లోపాన్ని గుర్తింపచేయాలి. అప్పుడు అతడు కూడ మీమాటను సమ్మతిస్తాడు. అవును! నాకు ఈ విధం తోచలేదు. ముందునుండి ఈ పద్ధతినే అనుసరిస్తాను అనికూడ అంటాడు. మీరు ఈ విధంగా గుర్తింపజేసిన అంశం అతనికి ఒక శిక్షణలాగ కూడ తోస్తుంది. అవును నేనే పొరపడ్డాను అని అతడు తన తప్పును తెలుసుకొంటాడు. కాబట్టి ఎవరికైన శిక్షణ ఇవ్వాలి అంటే ముందుగా మనం వారి గుణాలను ప్రసంగించాలి. అనంతరం వారు కోరితే సవినయంగాను, ప్రేమపూర్వకంగాను వారి లోపాలను వారికి తెలియజేయాలి. ఇలా చేయడం వలన మీ చేత అతడు ప్రభావితుడు అవుతాడు. సంస్కరింపబడనూ సంస్కరింపబడతాడు.

భగవత్ప్రాప్తి కావాలి అని అనుకొనేవాడు భగవత్స్వరూపాన్ని గూర్చి శ్రవణము, మననము, మొదలైన విధులలో చిత్తాన్ని, బుద్ధిని, ఇంద్రియాలను లగ్నం చేయాలి. దానితోబాటు ఉత్తమకర్మాచరణం కూడ చేస్తూ ఉండాలి. ఆ ఉత్తమకర్మాచరణం కూడ తీర్థస్థలాలవంటి పవిత్రప్రదేశాలలో చేయాలి. దానము, తపస్సు, యజ్ఞము, దీనులకు, దుఃఖగ్రస్తులకు సేవ మొదలైనవి ఉత్తమకర్మలు. ఆలయాలలో దేవతాదర్శనం చేస్తూ ఉండాలి. ఉపవాసవ్రతాది విధులను పాటిస్తూ ఉండాలి. యమనియమాదులను పాటించాలి. ఇవి అన్ని ఉత్తమకర్మలే.

యమం అయిదు విధాలుగా ఉంటుంది. 1. అహింస, 2. సత్యము, 3. అస్తేయం (దొంగ బుద్ధి లేకుండుట), 4. బ్రహ్మచర్యము, 5. పరిగ్రహాన్ని

విడనాడుట (అనగా ఏదీ కూడబెట్టకుండుట) అహింస అంటే ఎన్నడూ ఎవ్వరికి ఏ కొంచెము కష్టం కలిగించకుండుట. ఎవరి ఆత్మక్షోభం కలిగించకుండా ఉండడం. మానసికంగా, వాచికంగా, క్రియారూపంగా ఎవరికీ ఏ మాత్రను క్లేశం కలిగించకుండ ఉండడం ఇది అహింసాస్వరూపం.

ఇక సత్యం విషయం. ఎప్పుడు సత్యమే పలకాలి. తాను కన్నులారా కన్నంత, చెవులారా, విన్నంత, మనసారా ఎరిగినంత మేరకు మించకుండ, తగ్గకుండ ఉన్నది ఉన్నట్లు, జరిగినట్టు చెప్పడం, తాను చెప్పినదానినే తన చేతలలో అనుసరించడం, మనం సత్యాన్ని పాలించే సందర్భాలలో ఎవరికీ హింసను (బాధను) కలిగించకుండ ఉండడం. సత్యం పలికే వేళ హితము, ప్రియము అయిన మాటను మాటలాడడం. అప్రియసత్యం పలుకకుండ ఉండడం. మితంగా మాటలాడడం. ఇది సత్యస్వరూపం.

అస్తేయం అనగా ఎట్టి దొంగతనము చేయకుండడం. ఇతరుని వంచించి వాని ద్రవ్యాన్ని హరించరాదు. కన్ను గప్పి తీసుకోరాదు. దోపిడీ చేయడం, కొల్లగొట్టడం, బలవంతంగా లాగుకొనడం వంటి పనులు చేయరాదు. ఏ విధంగాను ఎవరి ధనాన్ని అపహరించరాదు. సాధుజనులకూ (బ్రాహ్మణులకు) ఎవరైనా అన్న వస్త్ర పుస్తకాదివస్తువులు ఏవైన ఇస్తే వారు తీసుకోవచ్చును, అదిచౌర్యం కాదు. ఏదైన ఒక కన్నుగప్పి తీసుకోవడం, ఎవరినైన ఒత్తిడికి గురి చేసి తీసుకోవడం, మాయమాటలు చెప్పి తీసుకోవడం, ఇతరుల హక్కును హరించడం అనేది దొంగతనం అనబడుతుంది కాబట్టి అట్టి పనులు ఎన్నడు చేయకుండా ఉండాలి. తీర్థస్థలాల్లో ఇట్టి పనులు ముందే చేయకూడదు. ఇది అస్తేయ స్వరూపం.

నాల్గవది బ్రహ్మచర్యం. మానవుడు సర్వవిధాల బ్రహ్మచర్యాన్ని పాటించాలి. ఏ విధంగానూ వీర్యనష్టం చేసుకోరాదు. పురుషులకు స్త్రీలనుండి, స్త్రీలకు పురుషులనుండి నిషేధలక్షణం ఉండాలి. పురుషులు స్త్రీలను దర్శించరాదు. స్పృశించరాదు. అశ్లీలభాషణం (బూతుధోరణి) చేయరాదు, ఏకాంతవాసం చేయరాదు, రమించరాదు. ఎట్టి సంబంధము పెట్టుకోరాదు. తప్పనిసరి అయినప్పుడు ఎదుటిస్త్రీని తల్లిగానో, చెల్లిగానో భావిస్తూ ఆమెతో భగవత్సంబంధమైన మాటలు ఏవైన పలుక వచ్చును. భవిష్యత్తుకోసం

స్వాదిష్టపదార్థాలను, విలాసవస్తువులను, భోగవిలాససామగ్రులను కూడబెట్టరాదు. కేవలము తన శరీరనిర్వహణానికి మాత్రమే ప్రాముఖ్యం ఈయాలి. భగవానుడు గీతలో కూడ -

**శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥**
(గీత 4-21)

అని చెప్పియున్నాడు. అనగా అంతఃకరణాన్ని, శరీరాన్ని జయించి, భోగసామగ్రులను అన్నిటిని పరిహరించి సర్వవిధాల ఆశలను విడనాడిన పురుషుడు కేవలము శరీరసంబంధమైన కర్మ చేస్తూ ఉన్నా అతనిని పాపం అంటదు అని భావం.

కేవలము శరీరనిర్వహణం కోసం సత్కర్మాచరణం చేసే పురుషుని దోషం ఏది అంటదు. శరీరాన్ని సుఖపెట్టాలి అనే భావంతో భోగదృష్టిని విడనాడాలి. భోగవిలాసాలను దృష్టిలో ఉంచుకొని సాంసారిక పదార్థాలను కూడబెట్టడం పరిగ్రహం అనబడుతుంది. దానిని విడిచిపెట్టాలి. పరిగ్రహత్యాగమే సంగ్రహత్యాగం. ఈ అయిదు విధాల యమాలను చక్కగా పాటించాలి.

నియమాలు అయిదు విధాలు. అందులో మొదటిది శౌచం అనగా బాహ్యాభ్యంతరపవిత్రత గంగాజలము, మృత్తిక, శౌచాచరణము, సదాచారము - వీని వలన బాహ్యపవిత్రత సిద్ధిస్తుంది. సదాచారం అంటే అందరితోను ఉత్తమవ్యవహారం సాగించడం ఆ సదాచారాన్ని పాటించడం, పవిత్రభోజనం చేయడం - ఇది బాహ్యపవిత్రత. పవిత్రమైన ఆహారము, ఉత్తమమైన వ్యవహారము, స్నానము మున్నగు విధులను పాటిస్తూ మానవుడు తనను తాను పరిశుద్ధుని గావించుకుంటుండాలి. ఇక ఆంతరిక పవిత్రతా విషయం - కామం, క్రోధం, లోభం, రాగం, ద్వేషం మొదలుగా మనలో ఎన్నో దోషాలు ప్రోగుపడి ఉన్నాయి, వానిని అన్నిటినీ నశింపజేసుకోవాలి. దీని పేరే శౌచం.

ఇక రెండవది సంతోషం. తన యిచ్ఛను అనుసరించి, పరుల ఇచ్ఛను అనుసరించి, పరమేశ్వరేచ్ఛను అనుసరించి ఏది ప్రాప్తిస్తే దానితో తృప్తిని, ఆనందాన్ని పొందడం సంతోషం అనబడుతుంది.

'యదృచ్ఛాలాభసంతుష్టః' (గీత 4-22) అని గీత కూడ చెపుతోంది. బిడ్డ పుట్టాడు అంటే ఆనందం, మరణించాడు అన్నా ఆనందాన్ని పొందాలి. లక్షరూపాయల లాభం కలిగింది అన్నా ఆనందాన్ని పొందాలి, నష్టం వచ్చింది అన్నా ఆనందాన్నే పొందాలి. శరీరంలో వ్యాధిప్రవేశించింది అన్నా ఆనందమే, నివృత్తం అయింది అన్నా ఆనందమే కలగాలి. సారాంశం ఏమంటే భగవదిచ్ఛానుసారం ఏది ప్రాప్తిస్తే దానితో తృప్తి పొందడం దీని పేరే సంతోషం.

ఇక మూడవది తపస్సు అనగా మనస్సును, బుద్ధిని, ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవడం అన్నమాట. ఏకాదశి - పూర్ణిమావ్రతాలను పాటించడం. అప్పుడప్పుడు పర్వదినాలలో ఉపవాసాలు చేస్తూ ఉండడం తపస్సు అనబడుతుంది. ధర్మపాలనరూపమైన తపస్సు చేయడం వలన మనస్సు, ఇంద్రియాలు, వాక్కు, శరీరము పవిత్రాలు అవుతాయి. బంగారాన్ని అగ్నిలో పుటం పెడితే దాని మాలిన్యం అంతా పోయి అది పరిశుద్ధం అవుతుంది. అలాగే మన మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు - ఇవన్నీ దోషపూరితాలై ఉంటున్నాయి. కాబట్టి దానిని ధర్మపాలనరూపమైన తపస్సుతో తపింపచేసి బంగారంలాగ పరిశుద్ధం గావించుకోవాలి.

ప్రతిదినము, ఒక గంటయో, అరగంటయో భగవద్గీత, రామాయణము, మహాభారతము వంటి ధార్మిక గ్రంథాలను పఠనము, పరిశీలనము చేస్తూ ఉండాలి. దీనిని స్వాధ్యాయ జపం అంటారు.

ఈశ్వరప్రణిధానం అనే మాట ఒకటి ఉంది. దానికి ఈశ్వరుని మీద భక్తి అని భావం. అనగా అనుక్షణము ఈశ్వరుని గుర్తు ఉంచుకోవడము, అతని స్వరూపాన్ని, నామాన్ని తలపులో ఉంచుకోవడము అన్న మాట. భగవానుని ధ్యానించే వేళ అతని గుణాలను, చరిత్రను స్మరించుకోవాలి. ఏకాంతసమయం దొరికినప్పుడు భగవన్నామాన్ని గుప్తంగా మానసిక జపంచేయాలి. దానిని ప్రకటం చేయకూడదు. నిత్యము నిష్కామభావంతో నిరంతరంగా సాగించే జపం బహుప్రభావయుక్తం అవుతుంది. ఈ చెప్పిన విధులను అన్నిటినీ తీర్థస్థలాల్లో విధిగా ఆచరించాలి. పితృదేవతల సముద్ధరణాన్ని కోరి వారికై నిర్దేశింపబడిన పవిత్రప్రదేశాలలోను,

తీర్థస్థానాలలోను తర్పణాలు, పిండప్రదానాలు చేస్తూ ఉండాలి. బదరికాశ్రమంలో బ్రహ్మకపాలం అనే తీర్థస్థలం ఉంది. అక్కడ పిండప్రదానం చేయడంవలన పితరులు ఉద్ధరింపబడతారని చెపుతారు. ఏ తీర్థస్థలానికి వెళ్లినా అక్కడ క్షౌరము చేయించుకొని తీర్థస్నానము, పితరులను ఉద్దేశించి తర్పణాలు, పిండప్రదాన విధులను ఆచరించాలి. అలా చేయడం బహు ఉత్తమమైన పద్ధతి. శక్యం అయితే ప్రతితీర్థస్థలంలోనూ యజ్ఞం చేయడం మరీమంచిది. అట్టి సందర్భాలలో ధనవ్యయానికి వెనుకాడరాదు. శక్త్యనుసారం దానాలు చేయాలి. ఆకలి గొన్నవానికి అన్నం పెట్టాలి దిగంబరంగా ఉన్నవాడికి వస్త్రదానం చేయాలి. విద్యార్థులకు భగవద్గీత, రామాయణమూ వంటి ధార్మిక గ్రంథాలను దానం చేయాలి. వ్యాధిగ్రస్తునకు ఔషధసేవను అందజేయాలి. సారాంశం ఏమంటే పాత్రతను ఎరిగి దానం చేయాలి. చేసే దానం సాత్త్వికదానం కావాలి. భగవానుడు గీతలో కూడ -

**శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥**

(గీత 17-20)

అని చెప్పియున్నాడు. అనగా అర్జునా! దానం చేయాలి అనే భావంతో సముచితమైన దేశ, కాల, పాత్రతల నెరిగి ప్రతిఫలాపేక్షలేకుండ చేసిన దానం సాత్త్వికదానం అనబడుతుంది. అని భావం.

కాబట్టి దానం చేయాలి అనే భావంతోనే కర్తవ్యబుద్ధితో దానం చేస్తూఉండాలి. దానివెనుక ప్రత్యుపకారం పొందాలి అన్న భావన కొంచెం కూడ ఉండకూడదు. ఎప్పుడు దానం చేసినా ప్రయోజనాపేక్ష విడిచి దేశ కాల పాత్రానుసారంగా నిష్కామ భావముతో కర్తవ్య బుద్ధిచే దానం చేస్తూ ఉండాలి. అయితే ఏది ఉత్తమదేశం? ఏది ఉత్తమకాలం? ఎవడు పాత్రుడు? అన్నది ప్రశ్న. ఏదైన తీర్థస్థలం అయితే అది ఉత్తమదేశం. అట్టిప్రదేశంలో కూడ గ్రహణము, అమావాస్య, వ్యతిపాతయోగం వంటివి ప్రాప్తిస్తే అది ఉత్తమకాలం. మనం చేసే దానాన్ని స్వీకరించేవాడు దానిని పొందడానికి అర్హుడై ఉండాలి. ఎవడు ఏ వస్తువును పొందడానికి అర్హుడో వానికి ఆ వస్తువునే దానం చేయాలి. ఇది యిక్కడ దేశ కాల పాత్రతలను గూర్చి

ఒక విధంగా నేను ఇచ్చిన వివరణం. దీనికి మరియొక వివరణం కూడ ఉంది. అది యెలాగ అంటే ఏ ప్రదేశంలో దానం చేసేవాడు ఒక్కడూ లేకపోతాడో అక్కడ దానం చేయాలి. చేయవలసిన ఆవశ్యకత అక్కడ ఉన్నది అన్నమాట. ఉదాహరణకు చెప్పాలి అంటే వరదలు వస్తాయి, భూకంపం వస్తుంది. అగ్నిప్రమాదం సంభవిస్తుంది. ఏదైన మహావిపత్తు సంభవిస్తుంది. అట్టి సందర్భాలలో ఇచ్చేవాడు సాధారణంగా ఎవడూ ఉండడు. కాబట్టి అది దానం చేయడానికి అర్హమైన ప్రదేశం అవుతుంది. ఎప్పుడైనా ఎవరికైన ఏ వస్తువు విషయంలోనైన అభావం ఏర్పడ వచ్చును. ఏ వస్తువైన కావలసినంతగా ఉత్పత్తికాకపోవచ్చును. కరువు పరిస్థితులు సంభవించి జనులు ఆకలితో మాడి మరణిస్తూ ఉండవచ్చును. అట్టి సమయం దానం చేయడానికి అర్హం అయిన సమయం అవుతుంది. దుఃఖగ్రస్తుడు, ఆకలి గొన్నవాడు, దిక్కులేనివాడు, అభ్యాగతుడు, కుంటివాడు, సొట్ట చేతులవాడు, కుష్ఠరోగి, వితంతువులు, సంపాదనశక్తి లేనివారు, నిత్యము కష్టపడుతూ ఉన్నా చాలునంత ఆదాయం లేనివాడు - ఇట్టివారు దానం పొందడానికి పాత్రులు అవుతారు. ఇది రెండవ విధమైన వివరణం.

తీర్థస్థలాలకు చేరినప్పుడు పుణ్యకార్యాలు చేయాలి. పెద్దలకు పాదాభివందనాలుచేస్తూ ఉండాలి. వారికి సేవలు చేయాలి. వారి ఆజ్ఞలను పాటించాలి. భార్య తన భర్తనే దైవతంగా భావించుకొని అతనిని పూజిస్తు, గౌరవిస్తూ, ఇంటిలోని వారికి సేవలు చేస్తూ, పెద్దలకు నమస్కరిస్తు సంచరిస్తూ ఉంటే ఆమె ఆ పాతివ్రత్యధర్మం ద్వారానే పతితోడ ఉత్తమగతిని పొందుతుంది. అలాగే చిన్న పిల్లలు తమ తల్లిదండ్రులను నారాయణ స్వరూపాలుగా భావించి వారికి పాదాభివందనాలు చేయాలి. వారి ఆజ్ఞలను పాలించాలి. వారికి సేవలు చేయాలి. అలా చేస్తే సహజంగా వారు ఉద్ధరింపబడతారు. అలాగే భగవానునియందు భక్తి కలిగియుండాలి. గురువులకు, మహాత్ములకు త్రికరణశుద్ధిగా సేవలు చేయాలి ఆ చేయడం కూడ నిష్కామభావంతో చేస్తే ఎంతటి పాపాత్ముడైన శీఘ్రంగా ఉద్ధరింపబడతాడు.

ఇంతవరకు నేను యజ్ఞదానాది విధులను గూర్చి, భగవద్భక్తిని గూర్చి, తపస్సును గూర్చి వివరించాను, సారాంశంగా చెప్పేమాట ఏమంటే మనః

ప్రవృత్తులను, ఇంద్రియవృత్తులను నిగ్రహించుకోవాలి. అవి ప్రేరేపించు పనులను మానివేసి వానిని క్రియారహితాలను గావించి క్లేశములను భరిస్తూ తపస్సు చేయాలి. ఈ విధంగా కర్మఫలత్యాగము, శారీరకంగా బాగా కర్మాచరణం చేయడము ఇవి కర్మానుష్ఠానానికి రెండు భేదములు అయ్యాయి. ఒకటి నిష్కామకర్మ, రెండవది ఉపాసన.

ఉపాసన అనగా భక్తిమార్గాన్ని అవలంబించడం. భగవానుని మీద భక్తి కలిగి ఉండడం. జ్ఞానాన్ని, వైరాగ్యాన్ని పెంచుకొని, భోగవాంఛలను విడనాడి వివేకంతో పరమాత్మస్వరూప పరిజ్ఞానం పొందడం. అన్ని నియమాలు శుభాన్ని చేకూర్చేవే. దానం కన్న భగవద్భక్తి మిన్న. ఒక సోదరుడు ఉన్నాడు అనుకోండి! అతడు 100 రూపాయలు వెచ్చించి ఆహారపదార్థాలను తెప్పించి సాధువులకు పంచిపెట్టాడు. లేదా బట్టలు కొని పంచిపెట్టాడు. లేదా చెప్పులు తెప్పించి పంచిపెట్టాడు. లేదా ఇవన్ని తెప్పించి బదరిక్షేత్రయాత్ర చేసేవారికి పంచిపెట్టాడు అనుకోండి. మరియొక సోదరుడు నూరు రూపాయల సామగ్రితెప్పించి సాధువులు ఉండే ప్రతి కుటీరంలోనికి స్వయంగా వెళ్లి వారిని వెదకి వెదకి పట్టుకొని వారికి దానం చేసాడు అనుకోండి ఇతడు శారీరకంగా కూడ శ్రమపడ్డాడు కాబట్టి కేవలము నూరు రూపాయలు, లేక నూరురూపాయల సామగ్రిని దానం చేయడం కంటె ఇతడు చేసిన దానం గొప్పది. భక్తిమార్గాన్ని అవలంబించి భగవానుని భజించుకోవడం ఇంతకంటెను గొప్పది. ఒక మనుష్యుడు లక్ష రూపాయలు దానం చేస్తాడు, మరియొకడు ఒక రోజంతా భగవద్ధ్యానంతో గడుపుతాడు. ఒకరోజు అన్నమాట యేమి? ధ్యానదశలో ఒక గంట గడిపినా చాలును వేయిలేక లక్షరూపాయల దానమైన దానితో సరికాదు. ఒక సోదరుడు మరియొక సోదరుడు నివసించడం కోసం ఒక యిల్లో, గదియో నిర్మింపచేసి ఇచ్చాడు అనుకోండి ఆ చేయడం నిష్కామభావంతో కూడినది అయితే ఆ చేసిన పుణ్యకార్యము, లేక ధర్మము, లేక లోకసేవ వలన అతనికి ముక్తి కూడ లభిస్తుంది. అయినా ఇది కూడ భగవద్భజనానికి సాటి వచ్చేది కాదు.

ఇక్కడ సత్సంగంలో పాల్గొనవచ్చిన మహానుభావులకు మాది ఒక విజ్ఞప్తి. ఇక్కడకు వచ్చిన సందర్భంలో మీరు ఎక్కువగా ధనవ్యయం

చేయవలదు. కారణం ఏమంటే ఎక్కువగా ధనవ్యయం చేసేవారు మాటిమాటికి వచ్చి సత్సంగంలో పాల్గొనలేక పోతారు. ఎందుచేత అంటె ఒక సారి సత్సంగంలో పాల్గొనుటకు వెళ్లి ఎంత డబ్బు ఖర్చు పెట్టడం అయింది? అయిదు వందల రూపాయలు ఖర్చు అయిపోయింది. మరలా రెండవసారి వెళ్లాలి అంటే మళ్లీ 500 రూపాయలు కావాలి గదా! మాటిమాటికి అయిదేసి వందల రూపాయలను ఎక్కడనుండి తేగలం? మన ఆదాయం చాలియు చాలనట్టిది గదా! అందుచేత ఇంటిలో కూర్చుండియే భగవద్భజనం చేసుకోరాదా? తీర్థస్థలాలకు వెళ్లియే చేయవలెనా? శ్రీమన్నారాయణుడు అక్కడే ఉన్నాడా? ఇక్కడ లేడా? అని యింటిలోన సంచారానికి వెళ్ళడంలో 10 రూపాయలా, రావడంలో 10 రూపాయలా, 2 నెలలు అక్కడ ఉండి తిండి తినడానికి 30 రూపాయలు కలిపి 50 రూపాయలు ఖర్చు అవుతున్నాయి అంటే ఆ 50 రూపాయలు ఇక్కడ ఉన్నా ఖర్చు అవుతాయి. ఆ రోజుకి ఆ రోజు వార్ధక్యం ముదురుతూ ఉంది. అందుచేత యాత్రకూ, సత్సంగానికి వెళ్లడం తప్పదు. ఇది మంచి పనికాని చెడ్డపని కాదు గదా? అని మీరు ప్రతివాదం చేస్తారు. అవును నీవు వృద్ధుడవు అయిపోయావు, నీ కోసం అయ్యే ఖర్చు కూడ చాల తక్కువగా ఉంటుంది. కాబట్టి నీవు వెళ్లి శాశ్వతంగా ఆ తీర్థస్థలంలోనే ఉండిపోరాదా? అని మరల వారు అంటారు ఇంతకూ చెప్పదలచిన విషయం ఏమంటే మహాజనులారా! ఇక్కడకు వచ్చి మీరు అధికవ్యయం చేయకండి ఒక్కొక్క సోదరుని నెత్తిమీద ఋణభారం ఉండవచ్చును. అది ఉండగా వానిని నిర్లక్ష్యం చేసి ఖర్చుపెట్టడం ప్రారంభిస్తే ఆ భారం మరియింతగా పెరిగిపోవచ్చును. పరద్రవ్యంతో యాత్ర చేయడం యుక్తంకాదు. మీరే గంభీరంగా ఆలోచించండి! ఇంటిలో మూలధనం ఏదీ లేక పోవచ్చును. ఖర్చు పెట్టే ద్రవ్యం అంతా ఎక్కడో అడిగి తెచ్చుకొన్నదే కావచ్చును. దానిని ఖర్చుచేయడం పరద్రవ్యాన్ని ఖర్చుచేయడమే అవుతుంది. అట్టి దశలో ఉన్నవారలు తీర్థయాత్ర చేయడం యుక్తంకాదు. ఒక్కొక్క సోదరుడు తీర్థస్థలానికి వచ్చి పరుల దగ్గర డబ్బును అప్పుతీసుకొని దానాలు చేస్తూ ఉంటారు. పరద్రవ్యంమీద ఆధారపడి తీర్థయాత్రసాగించడం నిమ్నస్థాయికి చెందిన విషయం. ఒక బ్రాహ్మణుడుకాని, సాధువుకాని తన దగ్గర తగినంత డబ్బు లేనప్పుడు అప్పుచేసి యాత్ర చేయడం

వారికి కూడ లాభదాయకం కాదా? అని అడుగుతారేమో? వారి విషయంలో చెప్పవలసిన మాటలు రెండు ఉన్నాయి. ఒకరిని దేహి అని యాచించక ముందే ఎవరైన సొంత ఖర్చుతో వారిని యాత్రకు తీసుకొని వెళ్లడం జరిగితే అది యా బ్రాహ్మణునకు లేక సాధువునకు అమృతతుల్యం అయినది అవుతుంది. యాచించి కార్యసాధన చేయు వారికి కూడ యుక్తం కాదు. యాచన అనేది పదుగురికోసం చేయాలి. తన ఒక్కనికోసం చేయకూడదు. తాను కోరకుండానే తన చేత ఎవరైన యాత్ర చేయిస్తే అందులో తనకు దోషం ఉండదు. తనకు అది అమృతతుల్యామే అవుతుంది. అలాగే కోరకుండ ప్రాప్తించిన దానం కూడ అమృతం వంటిది అవుతుంది. అడుగుకోవడం అనేది చందా అడగడం వంటిది. ఒక వ్యక్తి నూరు రూపాయల చందాను అపేక్షిస్తు ఒక ధనికుని దగ్గరకు పోయి అయ్యా! మీరు లక్షాధికారులు. మీరు అయిదు వందల రూపాయలు ఈయాలి అంటాడు. కాదు నా యిష్టం ఇంత మేరకే అంటాడు ధనికుడు, కాదు! కాదు! నేను కోమటిబిడ్డను. మీదగ్గర అయిదు వందలు గ్రహించితీరతాను అంటాడు. చందా సేకరించేవాడు కాదు! కాదు! రెండు వందలు తీసుకొండి! అంటాడు ధనికుడు. కడకు మూడు వందలు ఈయడానికి బలవంతంగా ఒప్పించబడతాడు. ఈ విధంగా పొందిన దానం తామసదానం అవుతుంది. అప్పుడప్పుడు మనం కూడ ఇట్టి దానం చేయడానికి బాధ్యులం అవుతూ ఉంటాం. కాని ఇది, మాత్రం తామసదానమే. మంచిది కాదు. ఒక సూక్తి ఉంది. ఎలాగ అంటే-

**ఆ. యాచితంబు కాని యర్థంబు దుగ్ధంబు**
**సాటి, యాచితంబు జలము సాటి.**
**పెనగులాడి కొన్నదనయంబు నెత్తుటి**
**సాటి వినుడు! జనులు! సాధువాణి**

ఇలాంటి యిచ్చి పుచ్చుకోవడాలు ఇచ్చేవానికి, పుచ్చుకొనేవానికి కూడ విషతుల్యాలే అవుతాయి. ఇరువురకును అవి నింద్యములే. తీర్థస్థలంలో చేసిన పుణ్యమూ ఇనుమడిస్తుంది. పాపమూ ఇనుమడిస్తుంది. అక్కడ ఏమి చేసినా దానిని ఇనుమడింపజేసే శక్తి తీర్థస్థలాల్లో ఉంది. ఏ సోదరుడైన తీర్థస్థలానికి వచ్చి దొంగతనం చేసినా, వ్యభిచారం చేసినా, అబద్ధం చెప్పినా, మద్యపానం చేసినా, జూదం ఆడినా, ఏ పాపం చేసినా దాని ఫలం కూడ

అనంతం అయిపోతుంది. గంగానదిని ధ్యానించినా, అందు స్నానం చేసినా. ఆ నీటిని పానం చేసినా, దానిని దర్శించినా పాపాలు అన్ని పటాపంచలూ అవుతాయి. అలాగే అందు మలమూత్రవిసర్జనం మొదలైన పాడుపనులు చేసినవారు ఘోరనరకాన్ని పొందుతారు. మరియొక చోట ఎక్కడైన మలవిసర్జనం పాపహేతువు కాదు. కాని గంగానదిలో ఆ పని చేయడం మహాపాతకహేతువు అవుతుంది. గంగానది యెక్కడ ఉన్నా దానికి చాల దూరంగా పోయి మలవిసర్జనం చేయాలి. గంగాతీరాన దంతధావనం, కాండ్రించి ఉమ్మివేయడం, బట్టలు ఉతకడం, బండరాలమీద బాదడం వంటి పనులు చేయకూడదు. బట్టలను ఒడ్డు మీదకు వచ్చి పిండుకోవాలి. ఆ పిండబడిన నీరు గంగానదిలో కలియరాదు.

గంగలో స్నానం చేసే ముందు ఆ నదీమతల్లిని మనసారా ధ్యానించుకోవాలి. దానికి సాష్టాంగ నమస్కారాలు చేయాలి. పూలతో పూజ చేయాలి. తదుపరి స్నానం చెయ్యాలి. కారణం ఏమన్న గంగాస్నానానికి విశేషమహత్త్యం చెప్పబడింది. కాబట్టి అందుకు విరుద్ధంగా అందు మలమూత్రపరిత్యాగం అనేది మహాపాతకహేతువే అవుతుంది. ఒక మహాపురుషుని సేవించడం ఎంత పుణ్యహేతువో అతనిని తిరస్కరించడం అంత పాపహేతువు అవుతుంది కదా! తులసిలో నీరు పోయడం ఎంత పుణ్యమూలమో అందు మూత్రవిసర్జనం చేయడం అంత పాతకమూలం కాదా? మొత్తం మీద గుర్తు ఉంచుకోవలసిన విషయం ఏమంటే తీర్థస్థానాలకు వచ్చియెవ్వరు ఎన్నడూ ఎట్టి పాపపు పనికినీ పాలుపడరాదు. పుణ్యాం చేయలేక పోతే మానివేయండి! కాని పాపపు పని మాత్రం చేయకండి, కరుణామయా! మా వలన పుణ్యకార్యం కాకపోతే పోవుగాక! కాని పాపం మాత్రం జరగకుండ మమ్ము రక్షింపుమా! అని భగవానుని వేడుకుంటూ ఉండాలి. తీర్థస్థలాలకు వెళ్లినప్పుడు ఈ నియమాలను పాటిస్తూ ఉండాలి. ఇలా చేస్తే శీఘ్రంగా భగవత్ప్రాప్తి మార్గం చక్కబడి భగవానుని పొందడం సంభవం అవుతుంది. భగవానుడు మనకు ప్రాప్తిస్తే అతడు మనపైప్రసన్నుడు అయితే లోకంలో ఇక మనం పొందదగినది ఏదీ ఉండదు. మనం సర్వమునూ పొందిన వారం అవుతాము.

# భగవానునిగుణప్రభావాలరహస్యము - వివరణ

భగవతత్త్వరహస్యం మీకు బాగా బోధపడడంకోసం ఇక్కడ ఒక కథను వివరిస్తున్నాను. దీనిని మీరు సూక్తి అనుకోండి, లోకోక్తి అనుకోండి, లేదా కల్పితగాథ అనుకోండి.

ఒక పండితుడు ఉన్నాడు. అతనికి ఒక కొడుకు ఉన్నాడు. వాడు పరమదుర్మార్గుడు. వానిలో కల్ల, కపటం, క్రౌర్యం, వ్యభిచారం మొదలైన దుర్గుణాలు ఎన్నో ఉన్నాయి. అతని తండ్రి దగ్గర బాగా డబ్బు ఉంది. అతడు శివోపాసకుడు. అతని దగ్గర ఒక శివమందిరము, ఒక గృహము, ఒక తోట ఉన్నాయి. ఇవియే కాక అతని దగ్గర ఒక లక్ష రూపాయల రొక్కము, స్థలాలు, భూముల రూపంలో మరొక లక్ష రూపాయల ఆస్తి ఉన్నాయి. ఒక నాడు ఆ పండితుడు తనలో ఇలా ఆలోచించు కొన్నాడు - నేను చనిపోయిన తరువాత నా కొడుకు ఈ ధనాన్ని అంతనూ నాశనం చేసివేస్తాడు. వాడు ఈ ధనాన్ని పొందడానికి అర్హుడు కాడు. కాని, భూములు మొదలైన ఆస్తులు నిలిచి ఉండేవే. వానిని వాడు అమ్మలేడు. ఇక లక్ష రూపాయల రొక్కం ఉంది. దానిని మాత్రం వానికి దక్కనీయకూడదు. ఈ విధంగా ఆలోచించి ఆపండితుడు ఆ లక్ష రూపాయలను ఎక్కడోగుప్తం చేశాడు. తన కొడుకు చెడునడవడిని గూర్చి అతడు సర్వదా బాధపడుతూ ఉండేవాడు. మరణకాలం సమీపించినప్పుడు అతడు ఏడవడం మొదలుపెట్టాడు. అప్పుడు, మీరు ఎందుకు ఏడుస్తున్నారు? అని కొడుకు అతనిని ప్రశ్నించాడు. నీలో ఉన్న దుర్వృత్తులనూ, దుర్గుణాలనూ చూచి నేను దుఃఖపడుతున్నాను. నేను కూడబెట్టిన సంపదను అంతనూ నీవు నాశనం చేసివేస్తావు అని చింతిస్తూ ఉన్నాను అని తండ్రి బదులు పలికాడు. అది నా స్వభావదోషం. దానిని నేను మార్చుకోలేను వేరుగా ఏదైనా చెప్పండి చేస్తాను అన్నాడు కొడుకు. అప్పుడు తండ్రి వానికి ఒక మంత్రాన్ని ఉపదేశించి నాయనా! దీనిని నీవు ప్రతిదినము స్నానం చేసినప్పుడు ఒక్కమారు పఠిస్తు

ఉండు. ఎవరైన మహాత్ముడు ఒకనాటికి వచ్చిదీని అర్థం నీకు తెలియజెప్పడం జరిగితే నీ సాంసారిక దారిద్ర్యం నివృత్తం అయిపోతుంది అని చెప్పాడు. కొడుకు ఆ మంత్రాన్ని బాగా కంఠస్థం చేసుకున్నాడు. నా కొడుకులో దుర్గుణాలు ఎక్కువగా ఉన్నాయి అతడు సంస్కరింపబడి సన్మార్గుడైన నాడు మహాత్ముడు వానికి నేను గుప్తం చేసిన ధనం విషయం తెలియజేయాలి. నేను ఒక లక్ష రూపాయల నిధిని శివాలయంపైన ఉన్న స్థూపంలో చైత్ర శుద్ధప్రతిపత్తిథి (పాడ్యమి) నాడు 12 గంటలకు గుప్తం చేసాను. అతడు యోగ్యుడు అయిననాడు మాత్రమే ఈ రహస్యాన్ని మహాత్ముడు వానికి తెలియజేయాలి. అట్లు కానినాడు తెలియజేయరాదు అన్నది ఆ మంత్రం యొక్క అభిప్రాయం. కొడుకు ప్రతిదినము తండ్రి చెప్పినట్లే మంత్రం పఠించసాగాడు. అనతికాలంలోనే తండ్రి మరణించాడు. అనంతరం కూడ కొడుకు మంత్రాన్ని పఠిస్తూనే ఉన్నాడు. శివాలయం ఒక్కటి తప్ప మిగిలిన వాని సంపద అంతా శీఘ్రంగానే అంతరించిపోయింది. అతడు జూదం ఆడేవాడు. ఇతరములైన తెగింపువర్తకాలు ఏవో చేసేవాడు. దానితో అతడు ఆర్థికంగా బాగా క్షీణదశకు చేరుకున్నాడు. ఆదిలో అతనికి చోరవృత్తి, జారవృత్తి, హింస, అభక్ష్యభక్షణమూ మొదలైన చెడ్డ అలవాట్లు చాల ఉండేవి. డబ్బులేక అవి అన్నీ ఇప్పుడు సమాప్తములు అయిపోయాయి. డబ్బు ఉన్నప్పుడే కదా! జూదగాళ్లు జూదంలో పాల్గొననిచ్చేది. అప్పుడు అతడు చాల దుఃఖాన్ని పొందేవాడు. వానికి ఎక్కడా అప్పుదొరకలేదు. బిచ్చమూ దొరకలేదు. అగతికుడై అతడు రోదింపసాగాడు. ఒకనాడు అతడు స్నానం చేసి అలవాటు ప్రకారం మంత్రపఠనం చేసాడు. దానిని ఒక మహాత్ముడు విన్నాడు. దాని అభిప్రాయం అతనికి తెలిసిపోయింది. అప్పుడు అతడు నాయనా! నీవు పఠిస్తూ ఉన్న మంత్రం యొక్క ఉద్దేశ్యం ఏమో నీకు తెలియునా? అని పండితపుత్రుని ప్రశ్నించాడు. నా తండ్రి చనిపోయే ముందు నాకు ఈ మంత్రం చెప్పి దీనిని నిత్యము పఠిస్తూ ఉండమన్నాడు, దీని వలన నా దారిద్ర్యం తీరిపోతుందని చెప్పాడు, కాని, నేను దురాచారాలను మాని వేసిన మీదట ఏమహాత్ముడైన దీని రహస్యాన్ని నాకు తెలియజేసినప్పుడు మాత్రమే అలా జరగడం సంభవం అవుతుందని నాతో చెప్పాడని అతడు

బదులు చెప్పాడు. దాని తత్త్వరహస్యం నీకు తెలియునా? అని ప్రశ్నించాడు మహాత్ముడు. తెలియదు అన్నాడు పండితపుత్రుడు. ఆ రహస్యం నాకు తెలిసింది. దాని అభిప్రాయం నీకు తెలియజేస్తున్నాను. విను! మీ తండ్రి దగ్గర డబ్బు ఏమైన ఉండెనా? అన్నాడు మహాత్ముడు.

పండితపుత్రుడు - అవును. నా తండ్రి దగ్గర లక్ష రూపాయల రొక్కం ఉండేది.

మహాత్ముడు - చనిపోయినప్పుడు నీకు ఈయలేదా?

పండితపుత్రుడు - ఈయలేదు.

మహాత్ముడు - ఎక్కడ ఉందో చెప్పలేదా?

పండితపుత్రుడు - చెప్పలేదు.

మహాత్ముడు - ఎందుచేత?

పండితపుత్రుడు - ఏమో! తెలియదు.

మహాత్ముడు - ఆ రహస్యం నేను ఎరుగుదును.

పండితపుత్రుడు - మహాత్మా! అది యేదో నాకు ఎరుగజెప్పరా?

మహాత్ముడు - నీవు దురాచారాలను మాని యోగ్యతను సంపాదించుకొన్న మీదట మాత్రమే నీకు ఆ రహస్యం తెలియజేయాలి అన్నది నీ తండ్రి యాజ్ఞదీని అర్థం ఏమో ఎరిగితివా?.

పండితపుత్రుడు - మాకు ఒక శివాలయం ఉంది. దానిపై స్తూపం ఒకటి ఉంది. అందులో నా తండ్రి ధనాన్ని గుప్తం చేసాడు అన్నది నేను అర్థం చేసుకొన్న విధం. దానిని అనుసరించి నేను ఆ స్తూపాన్ని ఊడకొట్టించి చూచాను. అందులో నాకు ఒకపైస కూడ కానరాలేదు. అప్పుడు స్తూపాన్ని యథాప్రకారంగా కట్టించివేసాను.

మహాత్ముడు - మంచి పని చేసావు. ఆ నిధి స్తూపంలో ఉండేది అయితే దాని తత్త్వాన్ని, రహస్యాన్ని తెలుసుకోవలసిన పని ఏముంటుంది? దాని తత్త్వం ఏదో, రహస్యం ఏదో నాకు తెలియును.

అంతట పండితపుత్రుడు మహాత్ముని పాదాల మీద వ్రాలి - మహాత్మా! నేను ఎంతటి కష్టాలలో ఉన్నానో మీరు చూస్తునే ఉన్నారు కదా? నా తలమీద ఋణభారం పెరిగి పోయింది. సంపద అంతా అంతరించిపోయింది.

ట్రస్టును ఏర్పరచి నా తండ్రి యీ ఆలయాన్ని ధార్మికసంస్థగా చేసిపోయాడు. ఆలయం అన్నది యెప్పుడూ ధార్మికసంస్థయే అవుతుంది అనుకోండి. ఇప్పుడు నా దగ్గర సంపదాలేదు. ముందడుగు వేయడానికి ఒక దారీలేదు. నాకు ఇప్పుడు ఎక్కడా అప్పూపుట్టదు. బిచ్చమూ దొరకదు. అగతికుడనై యిందందు తిరుగుతూ ఉన్నాను. ఇంతకంటె నాకు కష్టదశ ఇంక ఏమి కావాలి? కాబట్టి ఆ రహస్యం ఏదో నాకు తెలియజెప్పండి అని అతనిని వేడుకున్నాడు.

మహాత్ముడు - ఆ రహస్యం నీకు నేను చెపుతాను. కాని నీవు ముందుగా దుర్గుణాలను, దురాచారాలను అన్నిటినీ విడిచిపెట్టాలి.

పండితపుత్రుడు - విడిచిపెట్టేస్తాను మహాత్మా! ఆ రహస్యం ఎరుగచెప్పండి.

మహాత్ముడు - ముందుగా చెప్పడం జరగదు. ముందుగా నీవు దురభ్యాసాలను, దుర్గుణాలను మానుకో.

పండితపుత్రుడు - దుర్వృత్తులను విడిచిపెట్టాను అని మీకు ఎలా నమ్మకం కలిగించాలి?

మహాత్ముడు - నీవు ఒక యేడాది పాటు ఏ దుర్వృత్తిని నీ దరికి రానీయను అని నిషేధనియమాన్ని పాటించు! ఏ దుర్గుణానికి లోబడనని శాశ్వతప్రతిజ్ఞ చెయ్యి.

పండితపుత్రుడు - సరియే ఎప్పుడూ, ఏ దుర్వృత్తికి లోను కానని ఇప్పుడే శపథం చేస్తున్నాను.

ఒక సంవత్సర కాలం గడచిన తరువాత అతడు మహాత్ముని సందర్శించి యిలా అన్నాడు మహాత్మా! నేను అన్ని దుర్వృత్తులను మానివేసాను. నాలో వ్యభిచారదోషం ఆవంత కూడ లేదు. నేను ఇప్పుడు పరస్త్రీని మాతృమూర్తిగా భావిస్తూ ఉన్నాను. అసత్యం ఆడడం మానివేసాను. చౌర్యవృత్తి విడిచిపెట్టాను. మద్యపానము, మాంసభక్షణము, జూదం ఆడడం మొదలైన దురాచారాలను అన్నిటినీ విడిచిపెట్టేస్తాను. ఇప్పుడు నేను కేవలము భగవద్ధ్యానము, భజనము వంటి కార్యకలాపాలతోనే కాలం బుచ్చుతు ఉన్నాను. ఇక్కడా, అక్కడా బిచ్చం ఎత్తుకొని జీవనయానం చేస్తున్నాను.

నాకు ముందు ఉన్న ఋణభారం అలాగే ఉంది. క్రొత్తగా ఇప్పుడు నాకు ఎవ్వరూ అప్పు ఇవ్వడం లేదు. భవిష్యత్తులో ఇక నాలో ఏ దోషము ప్రవేశించదని మీకు మాట యిస్తున్నాను. ఇప్పుడు మీరు నాయందు దయ చూపి నా తండ్రి దాచియుంచిన ధన రహస్యం నాకు తెలియచేయండి! చైత్రశుద్ధప్రతిపత్తిథి రానీ! అన్నాడు మహాత్ముడు. అలాగే కానీయండి అన్నాడు పండితపుత్రుడు. కొన్ని దినాలు గడిచిన తరువాత ఆ తిథి వచ్చింది. మహాత్మా! రేపే చైత్రశుక్లప్రతిపత్తు అన్నాడు పండితపుత్రుడు. రేపు నీవు నలుగురు కూలివాండ్రను సిద్ధం చెయ్యి అన్నాడు మహాత్ముడు. మహాత్మా! నా దగ్గర కూలివాండ్రకు ఇచ్చుటకు డబ్బులేదు. ఎలాగా? అన్నాడు పండితపుత్రుడు. నేను ఇస్తానులే అన్నాడు మహాత్ముడు. సరే! అలాగే అన్నాడు పండితపుత్రుడు. అతడు కూలి వాండ్రను సిద్ధం చేశాడు. మీ శివాలయం ఎక్కడ? అన్నాడు మహాత్ముడు. పండితుని కొడుకు ఆలయాన్ని చూపించాడు. దాని నాల్గు దిక్కులా పరిశీలించి చూచి మహాత్ముడు నాయనా! కూలివాండ్రతో పాటు నేలను త్రవ్వడానికి కావలసిన పరికరాలను కూడ సిద్ధం చేసావు కదా! అన్నాడు. మహాత్ముడు! అన్నీ సిద్ధంగా ఉన్నాయి, ఇక ఆ రహస్యం ఏదో తొందరగా చెప్పండి అన్నాడు పండితపుత్రుడు. అప్పుడు మహాత్ముడు ఇలా అన్నాడు నాయనా! నీవు పఠించే మంత్రంలో నాకొడుకు దుర్మార్గుడు. దుర్గుణాల పుట్ట అవన్నీ సమసిపోయిన మీదటనే నిధి విషయం మహాత్ముడు నా కుమారునకు తెలియజేయాలి. ఆ నిధి శివాలయంపైన ఉన్న స్తూపంలో చైత్రశుద్ధప్రతిపత్తునాడు పగటివేళ 12 గంటలకు నిక్షిప్తం చేయబడింది అనే నీ తండ్రి యభిప్రాయం వ్యక్తం అవుతోంది. కాబట్టి 12 గంటల వేళ అయ్యేవరకు మనం నిలిచి ఉండాలి.

ఒకింత సేపటిలో 12 గంటల సమయం అయింది. అప్పుడు స్తూపం యొక్క నీడ పడినచోట మహాత్ముడు ఆనవాలు పెట్టాడు. అక్కడ నేలను త్రవ్వండి అని కూలివాండ్రకు ఆదేశం ఈయబడింది. వారు త్రవ్వారు. అప్పుడు ఆ నిధి బయల్పడింది. ఇదిగో! నీ తండ్రి గుప్తం చేసిన లక్షరూపాయల నిధి. తీసుకో నాయనా! అన్నాడు మహాత్ముడు, కూలివాండ్రకు ఏమి ఇవ్వాలి? అని ప్రశ్నించాడు పండితపుత్రుడు. ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపాయి

కూలి నలుగురు కూలీలకు నాలుగు రూపాయలు ఇచ్చి మిగిలిన సొమ్మంతా నీవు తీసుకో, అన్నాడు మహాత్ముడు. మీరు కూడ కొంత ధనం తీసుకోండి అని అన్నాడు పండితపుత్రుడు. మాకు ఏమీ అక్కరలేదు. అది అంతా నీ తండ్రి ధనం. కాబట్టి అది నీదే అన్నాడు మహాత్ముడు. ఈ విధంగా అతనికి తండ్రి ధనం ప్రాప్తించింది.

మనకు అందరకు తండ్రి పరమాత్మ. ఆయన యొక్క సంపద ముక్తి. అది అందరకూ సంబంధించిన వస్తువు. ఈ లౌకిక స్వరాజ్యం మాత్రం ఒక్కనికి మాత్రమే చెందింది. పరమాత్మ యొక్క సంపద మాత్రం (యువరాజపదవి) అందరకు లభించేది. పరమాత్మప్రాప్తి కూడ ఇట్టి పదవియే. అది ముక్తి. అది అందరు పొందనర్హమైనది.

మీకు ఇప్పుడు ఒక కథ చెప్పడం జరిగింది. ఇప్పుడు దాని తత్త్వం ఏమో, రహస్యం ఏమో మనం అందరము తెలుసుకోవాలి. మనకు అందరకు తండ్రి ఎవరు? పరమాత్మ కదా! అతడు అర్జునుని నిమిత్తంగా చేసుకొని మనకు అందరకు గీతను ఉపదేశించాడు. దానిని నిత్యము స్నానం చేసి పఠిస్తూనే ఉన్నాము. అందలి శబ్దార్థాన్ని, భావాన్ని తెలుసుకుంటున్నాం. కాని దానిలోని తత్త్వాన్ని, దాని రహస్యాన్ని మాత్రం అవగాహనం చేసుకోవడంలేదు. అందులో ఏ ఒక్క శ్లోకంలోని తత్త్వరహస్యాన్ని అర్థం చేసుకున్నా చాలు. మనం గట్టు ఎక్కిపోతాము. అయితే అర్థం చేసుకోవడం అంటే ఏమిటి? తత్త్వరహస్యాన్ని తెలుసుకోవడం అంటే ఏమిటి? అన్నది ప్రశ్న. ఆ విషయమే ఇక్కడ వివరించబడుతోంది.

**శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥**

(గీత 5-29)

ఈ శ్లోకం మన ఆత్మోద్ధరణానికి ఉపయోగపడే మహామంత్రం అన్నమాటను మనం మరవకూడదు. ఇందు నాలుగు పాదాలు ఉన్నాయి. అందు ఒకదానిలో ఫలము, మూడింటిలో సాధనము చెప్పబడింది. "భోక్తారం యజ్ఞతపసాం" యజ్ఞాలకు, తపస్సులకు భోక్తగానూ, "సర్వలోకమహేశ్వరం" లోకాలకు అన్నిటికి మహేశ్వరునిగాను, " సుహృదం సర్వభూతానాం"

సమస్తభూతాలకు సుహృద్ భావము గలవాని గాను నన్ను తెలిసికొన్న మనుష్యుడు పరమశాంతిని పొందుతాడు. ఇక్కడ శాంతి అనే మాటకు పరమశాంతి అనే అర్థం గ్రహించుకోవాలి. ఇది సాంసారికమైన శాంతి కాదు. పారమార్థికమైన శాంతి దీనిని పొందడానికి ఇక్కడ మూడు సాధనములు చెప్పబడినాయి. అందు ఏ ఒక్కదానిని అనుసరించినా లేదా మూడింటినీ ధారణ చేసినా పరమాత్మప్రాప్తి కలుగుతుంది. ఒక్కదానిని అనుసరిస్తేనే కలుగుతుంది అంటూ ఉంటే మూడింటినీ అనుసరిస్తే కలిగి తీరుతుంది అని వేరుగా చెప్పవలెనా? ఇది యిక్కడ ఈ శ్లోకానికి సంబంధించిన శబ్దార్థం. దీనిని మనం తెలుసుకున్నాము. అయితే దీని తత్త్వం ఏమిటి? రహస్యం ఏమిటి? అన్నది ప్రశ్న. తత్త్వం ఇది - భగవానుడు ఇక్కడ తనను యజ్ఞాలకు, తపస్సులకు భోక్తగా గుర్తిస్తే మానవులు శాంతిని పొందుతారు అని ముందుగా చెప్పాడు. -

**భోక్తారం యజ్ఞతపసాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.**
**సర్వలోకమహేశ్వరం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి.**

యజ్ఞాలకూ తపస్సులకూ నన్ను భోక్తగా గుర్తించి, సర్వలోక మహేశ్వరునిగా నన్ను గుర్తించి, సమస్త భూతాలకు పరమ సుహృత్తుగా నన్ను గుర్తించి మానవుడు పరమ శాంతిని పొందుతాడు.

యజ్ఞాలకు, తపస్సులకు భోక్త అంటే అభిప్రాయం ఏమిటి? దాని తాత్త్వికార్థం ఏమిటి? అన్నది ప్రశ్న. లోకంలో జనులు ఎన్నో యజ్ఞాలు చేస్తూ ఉంటారు. దానికి అన్నిటికి భోక్తను నేను. లోకంలో ఎవడైన నా ప్రసన్నతను గోరి అగ్నిలో హోమం చేస్తే ఆ అగ్నిరూపంలో ఉండి నేనే దానిని స్వీకరిస్తున్నాను అన్నది భగవానుడు చెప్పిన మాట. పితరులను ఉద్దేశించి ఎవరైన పిండప్రదానాలు, జలతర్పణాలు, శ్రాద్ధవిధులు ఆచరిస్తే పితరుల రూపంలో ఉండి నేనే వానిని ఆరగిస్తూ ఉన్నాను అన్నది భగవానుని మాట. అతిథికి భోజనం పెడితే అతిథియజ్ఞం అనబడుతుంది. అందు అతిథిరూపంలో ఉండి భోజనం చేయువాడను నేనే అన్నది భగవానుని మాట. సమస్తభూతములను ఉద్దేశించి ఆహుతులు

అర్పించడం బలివైశ్వదేవం అనబడుతుంది. అందు సమస్తభూతాల రూపంలోను ఉండి వానిని భుజించువాడను నేనే అన్నది భగవానుని మాట. సారాంశం ఏమంటే ప్రపంచం అంతా భగవత్స్వరూపం, అందు మానవుడు ఒకరికి సేవ చేయవచ్చును, ఒకరికి ఉపకారం చేయవచ్చును, ఒకరికి దానం చేయవచ్చును. ఈ విధంగా ఏమి చేసినా భగవానునకు చేసినదే అవుతుంది. ఇది దాని తాత్త్వికార్థం. దీనిని తెలిసికొని తదనుసారంగా ఆచరణం చేస్తే మనకు పరమశాంతి లభిస్తుంది. ఎవరైనా అతిథి మన యింటికి వస్తే సాక్షాత్తు భగవానుడే వచ్చాడని భావించుకొని అతనికి సేవ చెయ్యాలి. భగవానుడే లభించినప్పుడు కలుగునంతటి ప్రసన్నతను, శాంతిని, ఆనందాన్నీ మనం ఆ సందర్భంలో పొందాలి. భగవద్గీత పరమసత్యం అని నమ్మిననాడు మనం అలాంటి భావనానందాన్నే పొందాలి. త్రోవలో వృక్షం ఏదైన తారసపడితే దాని రూపంలో భగవానుడే నిలిచి ఉన్నాడని భావించి దాని మొదట్లో నీరు పోయాలి. రావిచెట్టు, మర్రిచెట్టు, ఉసిరిక చెట్టు (ఆమలకం) తులసి. ఇవి ప్రత్యక్ష భగవత్స్వరూపాలు అని శాస్త్రాలలో చెప్పబడింది. "అశ్వత్థః సర్వవృక్షాణాం" (గీత 10-26) వృక్షాలు అన్నిటిలోను అశ్వత్థమును (రావి) నేను అని గీత కూడ చెపుతోంది. ఇది విశేషంగా చెప్పబడిన మాట, సామాన్యదృష్టిలో అయితే అన్ని భగవత్స్వరూపాలే (గీత 10-20) విశ్వాసపూర్వకంగా దానిని ఆచరించాలి. విశ్వాసం ఉన్నవాడు ఎట్లునూ ఆచరిస్తాడు. ఇక్కడ అలా విశ్వసించడం అన్నదే రహస్యం తెలుసుకోవడం అన్నమాట.

**శ్లో॥ ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।**
**సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి ॥**

ఆకాశంనుండి పడిన వర్షపునీరు నదీరూపం దాల్చిప్రవహించి సముద్రంలో కలుస్తుంది. వర్షపునీరు భూమిలో ఇంకిపోయినది పోగా మిగిలిన నీరు నాలుగువంకలనుండి ప్రవహించి సముద్రంలో చేరుతుంది. అలాగే మనం ఏ దేవతలకు నమస్కారం చేసినా, ఎవరికి నమస్కారం చేసినా అది భగవానునకు చేరుతుంది. ఈ విధంగా తెలుసుకోవడం వాని రహస్యాన్ని తెలుసుకోవడం అన్నమాట. అయితే ఆ నమస్కారం భగవానునకు ఎలా

చేరుతుంది? అన్నది ప్రశ్న. అందరి యందూ భగవానుడు ఉన్నాడు. కాబట్టి ఎవరికి నమస్కారం చేసినా భగవానునకు చేసినట్లు అవుతుంది. అందరకు సేవ చేయడం భగవానునకు చేయడమే అవుతుంది. అలాగే ఎవరికైనా పూజ చేసినా, సత్కారం చేసినా భగవానునకు చేసినట్లే అవుతుంది. అలాగే ఎవరినైనా తిరస్కరిస్తే కూడ భగవానుని తిరస్కరించినట్లు అవుతుంది. కాబట్టి ఎల్లర హితాన్ని కోరి వారికి సేవ చేస్తు ఉండాలి. నిరంతరము పరహితంకోసం పాటుపడేవానికి దుర్లభం అయినది ఏదీ ఉండదు అని తులసీదాసు కూడ చెప్పియున్నాడు. "తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః" (గీత 12-4) అని గీతలో కూడ చెప్పబడింది. సమస్తప్రాణులకు హితం కలిగించడంకోసం పాటుపడేవారు నన్నే పొందుతారు అని భగవానుడు అన్నాడు. అందరను నారాయణస్వరూపులుగా భావించిసేవించడమే సర్వయజ్ఞాలకు భగవానునే భోక్తగా భావించడము, దాని తత్త్వాన్ని, రహస్యాన్ని తెలుసుకోవడము అవతుంది. కాబట్టి మనం యజ్ఞాలు, దానాలు, తపస్సులు, సేవలు ఏమి చేసినా తద్వారా భగవానుని సేవ చేస్తున్నాం అనే భావం మన హృదయంలో ఉండాలి. సర్వము భగవదాజ్ఞానుసారమే, భగవానుని కోసమే. భగవత్ప్రాప్తికోసమే, భగవానునియందు భక్తికోసమే చేస్తున్నాం అని అనుకోవాలి. అలా అనుకుంటే సర్వమూ భగవానుని కోసమే చేసినట్లు అవుతుంది. ఆ భావాన్నే మనస్సులో ఉంచుకొని మనం ఎల్లరనూ నారాయణస్వరూపులుగా భావిస్తూ వారికి సేవలు చేస్తూ ఉండాలి. యజ్ఞాలు, దానాలు, తపములు చేస్తూ ఉండాలి. అలా చేయడమే వాస్తవికమైన తత్త్వరహస్యం తెలుసుకోవడం అవుతుంది.

ఇప్పుడు రెండవ విషయాన్ని వివరిస్తున్నాం. "సర్వలోకమహేశ్వరం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి" అన్నది భగవానుడు చెప్పిన మాటలో రెండవది. సమస్తలోకాలకూ మహేశ్వరునిగా నన్ను గుర్తించి మానవుడు పరమశాంతిని పొందుతాడు అని భావం. భగవానుడు సమస్తలోకాలకు ఈశ్వరుడని, ఈశ్వరులకు కూడ ఈశ్వరుడని చెప్పగా మనం విన్నాము. కాని, ఆ మాటను సరిగా మనం అర్థం చేసుకోలేదు. మనకు శబ్దార్థం మాత్రమే తెలిసింది తత్త్వం తెలియవలసి ఉంది. రహస్యం హృదయంగంము

కావలసియుంది. తత్త్వం ఏది అంటే భగవానుడు ఈశ్వరులకు కూడ మహేశ్వరుడు. అతని కంటె అధికులు ప్రపంచంలో ఎవ్వరూలేరు. ఈ విషయాన్ని తాత్త్వికంగా తెలిసికొన్నప్పుడు మనం భగవానుని క్షణం కూడ మరువలేము. అనుక్షణమూ అతనినే భజిస్తాము. అతనిని తప్పమరియెవ్వరినీ భజించడానికి ఇష్టపడము. కారణం ఏమంటే భగవానుడు గీతలో కూడ - (గీతా 15- 19) ఇలా అన్నాడు -

**శ్లో॥ యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।**
**స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥**

అసమ్మూఢుడు అంటే లేశమాత్రంగా కూడ మూఢత్వం లేనివాడు. సర్వవిత్ అంటే సర్వమును ఎరిగినవాడు, సర్వజ్ఞుడు అన్నమాట. అట్టి పురుషుడు సిద్ధుడో, సాధకుడో అవుతాడు. అలాంటి సాధనాపరులైన సాధువులు, మహాత్ములు నన్నే నిత్యము, నిరంతరము భజిస్తారు. నన్ను కాదని యితరులను భజించేవారు నన్ను సర్వోత్తమునిగా భావించువారు కాదు అన్నమాట.

మాకు భగవానుని మీద తలపు (స్మృతి) స్థిరంగా ఉండడం లేదండి! అని కొందరు అంటారు. దానిని బట్టి వారు భగవానుని గాక మరి వేనినో మిన్నగా భావిస్తున్నారని వ్యక్తం అవుతుంది. అందుచేతనే భగవానుని కాదని వారు ఇతరమును భజించేవారు అవుతున్నారు. అట్లు కానినాడు వారు ఇతరమును ఎందుకు భజిస్తారు? పదార్థం ఒకటి క్షరమూ, మరొకటి అక్షరము అని భగవానుడు ముందే నిర్ణయించాడు-

**శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥**

(గీత. 15-16)

ఈ లోకంలో రెండు రకాల ప్రాణులు ఉన్నాయి. ఒకటి క్షరములు, రెండు అక్షరుడు, భూతములు అన్నీ (ప్రాణులు) క్షరములు అనబడుతాయి. క్షరము అనగా నశించేది అని అర్థం. ప్రాణుల, శరీరాలు అన్ని నశించేవి కదా! అవి క్షరములు అన్నమాట ఆత్మ ఒక్కటి మాత్రం అక్షరం, అనగా నాశనం లేనిదన్నమాట.

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥
(గీత 15-17)

ఈ క్షరంకంటెనూ, అక్షరునికంటెనూ భిన్నంగా మరియొక పురుషుడు ఉన్నాడు. అతడు ఉత్తమపురుషుడు. అతని పేరు పరమాత్మ. అతడు మూడులోకాలలోనూ వ్యాపించియుండి సమస్తప్రపంచంయొక్క భరణపోషణములు సాగిస్తూ ఉంటాడు. ఈశ్వరుడు అనీ పురుషోత్తముడని, భగవానుడని పేర్కొనబడేవాడను నేనే, అట్టి నన్ను సర్వతోభావంగా ఎవడు భజిస్తూ ఉంటాడో వాడు నన్ను పురుషోత్తమ పరమాత్మగా భావిస్తూ ఉన్నాడు అన్నమాట. సర్వతోభావం ఎలాగ? అంటే-

శ్లో॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

ఓ దేవదేవా! మాకు తల్లివైనా, తండ్రివైనా, సోదరుడవు, బంధువు అయినా, సఖుడవైనా, విద్యవైన, ధనమువైనా, ప్రభుడవు, గురుడవు అయినా సర్వమూ నీవే అనునట్టి భావం సర్వతోభావం. అలాంటి భావంతో నన్ను భజించేవానికి మరి దేని ఆవశ్యకతయూ ఉండదు. మరియొక వస్తువును నాకంటె మిన్నయని భావించినప్పుడు మానవుడు నన్ను కాదని దానిని భజించడం సంభవం అవుతుంది అన్నది భగవానుని మాట. ఈ తత్త్వాన్ని తెలుసుకొని, దీని రహస్యాన్ని అర్థం చేసుకున్నవాడు సర్వతోభావంగా భగవానుని భజిస్తాడు. అలా భజించనినాడు అతడు రహస్యాన్ని అర్థం చేసుకొన్నవాడు కాదు అని అనుకోవాలి. ఎవడు రహస్యాన్ని తెలుసుకొని కార్యారంభం చేస్తాడో అతనికి భగవత్ప్రాప్తి కలుగుతుంది. పరమపదం అనగా మోక్షం ప్రాప్తిస్తుంది. ఇదే మన పరమపిత నిక్షిప్తం చేసిన గుప్తధనం. పండితపుత్రునకు వాని తండ్రి గుప్తం చేసిన నిధి రహస్యాన్ని మహాత్ముడు తెలియజేసాడు. తదనుసారంగా ప్రయత్నించిన మీదట వెంటనే అతనికి ధనం ప్రాప్తించింది. విలంబం ఏమీ కాలేదు. ఏండ్లు గడచినా, తండ్రి

ధనం అయినా రహస్యం తెలియనంత వరకు అది వానికి దొరకలేదు. మహాత్ముడు రహస్యాన్ని తెలియజేసిన వెంటనే లభించింది.

ఇక మూడవ విషయం - "సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి" అన్నది. నన్ను సమస్తభూతములకు సుహృత్తుగా భావించి మానవుడు శాంతిని అనగా పరమశాంతిని పొందుతాడు అని భావం. అంటే భగవానుడు సమస్తప్రాణులకు మిత్రము అన్నమాట. నిర్హేతుకంగా ప్రేమను, దయను చూపువాడు అన్నమాట. ఇది యిక్కడ శబ్దార్థం. ఇక దీని తత్త్వం ఏది? అన్నదిప్రశ్న. దానికి సమాధానం ఇదిగో ఇది - భగవానుడు సర్వత్రా ఉన్నాడు. మనం ఏమి అన్నా వింటున్నాడు. ఏమి చేసినా చూస్తున్నాడు. అతడు జడపదార్థం కాడు, చేతనుడు అతడు సర్వజ్ఞుడు అనే విషయాన్ని మీరు అర్థం చేసుకున్నారా? అంటే చేసుకున్నాము అంటారు మీరు. మీకు శాంతి లభించిందా? అంటే లేదంటారు. లేదన్నారు అంటే మీరు అర్థం చేసుకున్నామని అనుకుంటున్నారు కాని అర్థం చేసుకోలేదన్న మాట. కారణం ఏమంటే ఇక్కడ "జ్ఞాత్వామాం శాంతి మృచ్ఛతి" అని చెప్పబడింది. 'మాం జ్ఞాత్వాం' అంటే పరమాత్మనైన నన్ను తెలుసుకొన్నవాడు (తాత్త్వికంగా తెలుసుకొన్నవాడు) శాంతిని పొందుతాడు అని కదా చెప్పబడింది? ఇందులో (శ్లోకంలో 'తాత్త్వికంగా') అన్నమాట లేదుకదా? అని మీరు అనవచ్చును. లేకుంటే ఆ మాటను అధ్యాహారం చేసుకోవాలి. (తెచ్చిపెట్టుకోవాలి) మీకు తెలిసినంతమేరకే తెలియడం అని అనుకుంటే శాంతి లభించదు. దానిని యథార్థంగా తెలుసుకొన్నప్పుడే శాంతి లభిస్తుంది.

ఒక బిచ్చగాడు ఉన్నాడు. బిచ్చం కోసం అతడు ఇల్లిల్లూ తిరుగుతున్నాడు. కాని ఎవరూ వానికి బిచ్చం వేయడంలేదు. అందరూ తిరస్కరిస్తున్నారు. అంతలో ఒక వ్యక్తి అతని దగ్గరకు వచ్చి - నాయనా! ఇక్కడకు దగ్గరలో ఒక మహాదాత ఉన్నాడు, అతని యింటికి వెళ్లినవాడు ఎవడూ వట్టి చేతులతో తరలి రాడు. అతని చెంతకు పోయి ఏమికావాలని కోరినా లభిస్తుంది. ఇక్కడకు దగ్గరలోనే ఉంది అతని యిల్లు అన్నాడు. అనడమేకాదు. స్వయంగా అతనిని తనవెంట తోడ్కొనిపోయి అతనికి ఆ యింటిని కూడ చూపించాడు. ఆ పరిస్థితిలో ఆ బిచ్చగాడు అక్కడకు వెళ్లి కోరకుండ

ఉండగలడా? ఊరకుండలేడు. శాశ్వతంగా అతని దరిద్రం తీరిపోయే విధంగా అతడు కోరికను వెల్లడించు కుంటాడు. కాని ఆకటితో మాడి చచ్చిపోతాడా? బయట ఎక్కడైనా రోడ్డుమీద పడి ఉంటాడా? ఉండడు కదా! ఇక్కడ భగవానుడు సర్వత్రా విరాజిల్లుతున్నాడు. అతనిని సుహృదయునిగా గుర్తిస్తే శాంతి లభిస్తుంది. కావలసినది భగవానుని సహృదయునిగా భావించడం. తన గుమ్మంలో ఒక భక్తుడు బిచ్చగానివలె పడి ఉన్నాడంటే భగవానుడు వానిని ఉపేక్షిస్తాడా? ఉపేక్షించడు. నిత్యమూ వాని భరణం తాను నిర్వహిస్తాడు. అడుగకుండానే ఇస్తాడు. యాచన చేస్తే చేసినప్పుడు మాత్రమే లభిస్తుంది. మనం భగవానుని సుహృత్తుగా భావించాలి. కాని అతడు మాత్రం నిర్హేతుకంగా దయను, ప్రేమను వర్షించేవాడు. ఆ విషయం బాగా హృదయంగమం అయిననాడు భగవానుని కాదని మరియొకరిని ప్రేమించగలమా? ప్రేమించలేము. స్వామీ! మీ యందు మాకు అచంచలమైన ప్రేమను ప్రసాదించరా? అని పరమదయాళువు అయిన ఆ భగవానుని కోరకుండ ఉండగలమా? ఉండలేము, భగవానుడు నిర్హేతుకదయామయుడు. నిర్హేతుకప్రేమమూర్తి, కోరకుండానే సర్వము ఒసగగలవాడు. అతనికి సాటి యెవ్వరూ లేరు.కారణం లేకుండా దయచూపడం, ప్రేమించడము అనేది భగవానునిలోని మహత్తర గుణం అనే పరిజ్ఞానం. దృఢవిశ్వాసం మనలో ఏర్పడాలి. అలా ఏర్పడినప్పుడు మనం కూడ సర్వభూతాలనూ ప్రేమించేవారము, సర్వభూతదయాపరులము అవుతాము. భగవానుని యందలి మహత్త్వం ఏమంటే అతడు సహజంగా హేతురహితంగా ప్రేమించేవాడు అగుటతో పాటు తనను తాత్త్వికంగా అర్థం చేసుకున్నవానిని కూడ ఆలక్షణం కలవానినిగా మార్చివేస్తాడు.

**హేతురహిత జగ జుగ ఉపకారీ ।**
**తుమ్హ తుమ్హార సేవక అసురారీ ॥**

ఓ అసురారీ! నిర్హేతుకంగా ప్రేమించే లక్షణం మీలోనూ, మీ భక్తులలోనూ మాత్రమే ఉంటుంది. మూడవవారియందు ఉండదు అని ఒక చోట తులసీదాసు ప్రయోగం తెలుపుతోంది. కాబట్టి లోకంలో శ్రీరామచంద్రునితో సమానంగా నిర్హేతుకప్రేమ

చూపేవారు వేరెవ్వరు లేరు అన్న విషయాన్ని గాఢంగా విశ్వసించేవానికి ఆ స్వామియందు అనన్యప్రేమ యేర్పడుతుంది.

**ఉమా రామ సమ హితు జగ మహీం।**
**గుర, పితు మాతు బంధు కోఉ నాహీం॥**

పరమశివుడు కూడ పార్వతీదేవికి ఉపదేశం చేస్తూ - పార్వతీ! తల్లి కాని, తండ్రి కాని, గురువు కాని, బంధువులు కాని, శ్రీరామునివలె మనకు హితమును చేకూర్చజాలరు అని చెప్పియున్నాడు. కాబట్టి భగవానునితో సమానముగా మన హితమును కోరువారు వేరెవ్వరూ లేరు అనేభావం మన హృదయాలలో, నాటుకొనిపోవాలి. అలా జరిగిననాడు మనం ఆ స్వామిని కాదని సాంసారికములైన జడపదార్థాలను - భోగసుఖాలను ప్రేమిస్తామా? ప్రేమిస్తున్నాము అంటే మనం ఆ భావాన్ని అర్థం చేసుకోలేదు. ఆ భావం మనలో నాటుకోలేదు అన్నమాట. భగవత్సంబంధమైన తత్త్వరహస్యం తెలుసుకోవడమే జరిగితే ఆ భగవానుని తప్ప ఇతరమును ప్రేమించలేము. ఇతరులను ప్రేమించడం జరిగితే వారియందు కూడ భగవానుడు ఉన్నాడన్న భావంతోనే ప్రేమించడం జరుగుతుంది. విషయభోగాలవలననే మనకు ఆనందం లభిస్తుంది. అని అనుకుంటే మనం భగవానుని నిర్హేతుకప్రేమికునిగా గుర్తించినవారం కానే కాము. మనం ఇతరులను లేదా ఇతరమును ప్రేమించడమే తత్త్వరహస్యాన్ని అర్థం చేసుకోలేదనుటకు తార్కాణం.

**స్వారథ మీత సకల జగ మహీం।**
**సపనేహుం ప్రభు పరమారథ నాహీం।**

భగవానుడైన శ్రీరాముని ఉపదేశాన్ని విని ప్రజలు ఉత్తర కాండంలో ప్రభూ! లోకంలో అందరు స్వార్థానికే మిత్రులు. పరమార్థానికి మిత్రులైనవారు ఎవ్వరూ లేరు. అని బదులు చెపుతారు. పరమార్థాన్ని ఇష్టపడేవారు కేవలము ఒక్క భగవానుడు, భక్తుడు మాత్రమే. విషయాన్ని ఈ విధంగా అర్థం చేసుకున్నవానికి భగవానుని మీద అనన్యమూ, విశుద్ధమూ అయిన ప్రేమ యేర్పడుతుంది. భగవానుని ప్రియతమ భక్తుని యందు ఉండే సర్వశుభలక్షణాలూ వానియందు అవతరిస్తాయి.

**శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥**
**సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తః స మే ప్రియః ॥**

(గీత 12-13,14)

ఇక్కడ భగవానుడు తన ప్రియతమభక్తుని లక్షణాలను చెప్పాడు. నిజమైన భక్తుడు ఏ ప్రాణియందూ ద్వేషం లేకుండా ఉంటాడు. కారణం ఏమంటే సమస్తప్రాణులతోడను సుహృద్భావం కలవాడు దేనినీ, ఎవరినీ ద్వేషించడు. ద్వేషిస్తే వాడు సర్వభూతాలకు సుహృత్తు కాడు. ఇది ఒక లక్షణం. అతడు ప్రయోజనరహితము, నిర్హేతుకము, మమతారహితము అయిన మైత్రీ లక్షణం కలిగి ఉంటాడు. అందరను మిత్రభావంతో స్వీకరిస్తాడు. అందరితోనూ మిత్రుడుగా వ్యవహరిస్తాడు. ఇది ఒక లక్షణం. అతనికి అందరియందు నిర్హేతుకమైన దయ ఉంటుంది. భగవానుడు హేతురహితంగా దయ చూపేవాడు. అతడు కూడ నిర్హేతుకజాయమాన దయాలక్షణం, ప్రేమలక్షణం కలిగి ఉంటాడు. అయితే ఇక్కడ నిర్హేతుకమైనవి అని అనడంలోని ఆంతర్యం ఏమిటి అన్నది ప్రశ్న. కొంచెం ముందుకి వెళ్లి చూడండి! 'నిర్మమః' అన్నమాట ఉంది. దానికి ఎందునూ, ఎవనియందునూ మమకారం (నాది, నావాడు అనే భావం) లేనివాడు అని అర్థం. నా కొడుకు, నా సోదరుడు, నా బంధువు అనే బంధుత్వాలకు ప్రాముఖ్యం ఈయకుండా అందరియందూ సమానంగా దయ చూపుతాడు. 'నిరహంకారః' అనగా ఇంత అయినా నేను నిర్హేతుక జాయమాన కరుణాలక్షణం కలవాడను అని నిర్హేతుకుడను అని అతడు ఏ మాత్రము అహంకరించడు. అహంకారం లేశమాత్రము లేకుండా ఉండడం నిజమైనభక్తుని లక్షణం అన్నమాట. 'సమదుఃఖసుఖః' అంటే అతడు సుఖదుఃఖాలను సమానంగా స్వీకరిస్తాడు అన్నమాట. మానవజీవితంలో పర్యాయంగా సుఖము, దుఃఖము రెండూ వస్తూ ఉంటాయి. అయినా 'క్షమీ' క్షమాగుణం కలవాడు కాబట్టి అతడు సుఖాన్ని కాని, దుఃఖాన్ని కాని భగవానుడు తనకోసం పంపిన బహుమానంగా భావించి సమదృష్టితో

సహర్షంగా స్వీకరిస్తాడు. తన యెడల ఎవరు ఎంతటి అపరాధం చేసినా అపరాధం చేసినట్లు అతడు భావించుకోడు. అపరాధంగా భావించి వానిని క్షమించడం మాట అటుంచి అపరాధం జరిగింది అన్నభావనకే అతడు తావీయడు. 6 మాసాలు లేక ఒక యేడాది వయస్సు గల పిల్లవాడు తన తండ్రి మీసాలను పట్టుకొని లాగితే ఆ తండ్రి వానిని అపరాధిగా భావిస్తాడా? భావించడు పైగా వానికి అపరాధం అంటే ఏమిటో తెలియదని అంటాడు. అమ్మ కొట్టినా ఆ కొట్టడంలోని తత్త్వం ఏమిటో కూడ ఆ పిల్ల వానికి తెలియదు. ఒక్కొక్కప్పుడు తండ్రి మీద ముష్టిప్రహారం కూడ చేస్తాడు, అయినా తండ్రి వాని చర్యను అపరాధంగా భావించుకోడు. ఏడాది వయసు గల పిల్లవాడు వాడు వానికి ఏం తెలుస్తుంది? అంటాడు. అలాగే ఒక వైద్యుడు ఉంటాడు. అతడు ఒక రోగిని చూడడానికి వెడతాడు. ఆ రోగి సన్నిపాతరోగి (టైఫాయిడ్ వచ్చినవాడు) అయి ఉంటాడు. అనగా త్రిదోషగ్రస్తుడై ఉంటాడు. వానిలో ప్రేలాపన మొదలవుతుంది. పరులను తిట్టడము, కొట్టడము మొదలవుతుంది. వైద్యుని కూడ అతడు కొడతాడు. అయినా అతని చర్యను వైద్యుడు అపరాధంగా భావించుకోడు. కారణం ఏమంటే అతడు పిచ్చివాడు. ఎట్టి పరిజ్ఞానము లేనివాడు తెలివిలో లేనివాడు. వాని చర్యకు బదులుగా వైద్యుడు కూడ వానిని లెంపకాయ కొట్టడం జరగదు. కారణం ఏమంటే ఇతడు తెలివిలో ఉన్నవాడు. ఈ విధంగా లోకంలో సాధారణ మాతాపితరులు, సాధారణవైద్యుడు కూడ తెలివిలేని వారు అనే భావంతో వారి అపరాధాలను అపరాధాలుగా భావించక ఊరకుండడం జరుగుతూ ఉంటే మాయావరణంలో చిక్కుకొని ఉన్మత్తునివలె చరించు మానవుని చేష్టలను ఒకజ్ఞాని, ఒక సాధుశీలుడైన మహాత్ముడు అపరాధంగా ఎలా భావిస్తారు? 'సంతుష్టః సతతం యోగీ' అనగా యోగమార్గంలో ఉన్న అలాంటి మహాపురుషుడు సర్వదా సంతుష్టాంతరంగుడై ఉంటాడు. ఆనందోన్మత్తుడై ఉంటాడు. పరమాత్మస్వరూపంలో ఉంటాడు. 'యతాత్మా' అతడు మనస్సును నిగ్రహించుకొన్నవాడై ఉంటాడు. "మయ్యర్పిత మనోబుద్ధి" దృఢనిశ్చయంతో అతడు తన మనస్సును, బుద్ధిని భగవదార్పణం చేసివేసుకుంటాడు. అట్టి వానికి భగవానుడు ఒక్కడు తప్ప తక్కినది ఏదీ

దృష్టిలో చింతనము చేయదు. వాని మనస్సు ఎక్కడకు పోతే అక్కడే భగవచ్చింతనం మొదలవుతుంది. అట్టి భక్తుడు తనకు ఎంతో ఇష్టుడన్నది భగవానుని మాట. ఇప్పుడు చెప్పిన లక్షణాలు అన్ని అచ్చమైన భక్తునిలో ఉంటాయి. భగవానునితో పాటు అతడు కూడ సమస్తభూతాలకు సుహృదయుడు అవుతాడు. అలా మనం సర్వభూతాలకూ సుహృదులం కానినాడు ఆ భగవానుని ముందు రోదనం చేస్తూ అట్టి దశను ప్రాప్తింపజేయుమని దీనంగా వేడుకోవాలి. అలా వేడుకొంటే మనం దుః ఖరహితులం అయిపోతాము. ఈవిధంగా మనం ఆ పరమాత్మను పొందగలుగుతాం. అనగా పరమాత్మ శక్తిని పొందుతాం. ఆ భగవానునివలన పూర్తి లాభాన్ని పొందగలుగుతాం. ధనికుని చేరి బిచ్చగాడు దారిద్ర్యం నుండి విముక్తి పొందిన విధంగా మనం పరమలాభం పొందినవారం అవుతాము. ఆత్మికంగా తృప్తి పొందడం. శాంతిని పొందడం అనేది సాధారణ లాభం. అదే విధంగా విశేషలాభాన్ని కూడ పొందవచ్చును. భగవానునియందు ఉండే లక్షణాలను తనలో అవతరింప జేసుకొన్నవానికి పరమశాంతి లభిస్తుంది. భగవానుడూ ప్రాప్తిస్తాడు. "మమ సాధర్మ్యమాగతాః" (గీత 14-2) భగవానునితోడ సమానధర్మస్థితిని నిజమైనభక్తుడు పొందుతాడు. ఈ రహస్యం మీకు తెలియజేయడం జరిగింది. మనం సర్వదా ఈ తత్త్వాన్ని, రహస్యాన్ని, గుర్తించాలి. గుర్తించడం అనగా తదనుసారంగా పరిణతి చెందడమే.

# శ్రీకృష్ణభగవానుని ధ్యానించే విధము

భగవద్ధ్యానం చేసుకోవడానికి ఏకాంతంగానూ, పవిత్రంగానూ ఉండే ప్రదేశం కావాలి. అక్కడ ఎట్టి విఘ్నబాధలు ఉండరాదు. ఏ కోలాహలము ఉండకూడదు. ప్రశాంతస్థానం కావాలి. ఆసనంగా దర్భాసనం, తివాచీ వంటి దానిని కాని ఉపయోగించుకోవాలి. సుఖంగా పద్మాసనం కాని, స్వస్తికాసనం గాని వేసుకొని కుదురుగా కూర్చోవాలి. స్థిరంగా చలనం లేకుండా కూర్చోవాలి. దగ్గరగా ఎవరైన ఉంటే కొంచెం దూరంగా కూర్చోవాలి. "స్థిరసుఖమాసనమ్' అని పతంజలి మహర్షి చెప్పాడు. స్థిరంగాను, సుఖంగాను, అచంచలంగాను ఎక్కువ సేపు కూర్చుండగలిగే విధంగా ఉండాలి ఆసనం. 'సమం కాయ శిరోగ్రీవమ్' అని భగవానుడు గీతలో చెప్పియున్నాడు. శరీరము (వెన్ను) శిరము, కంఠము మూగానం, నిట్టనిలువుగాను ఉండు విధంగా కూర్చోవాలి. కూర్చున్న మీదట అంతవరకు మనస్సులో సాగుతు ఉన్న సంకల్పవికల్పాలను, సాంసారిక చింతలనూ అన్నిటినీ తొలగించివేసుకొని మనస్సునూ ఖాళిగాను, నిల్కడగాను ఉండునట్లు చక్కజేసుకోవాలి. ఏ విధమైన ఆసక్తి లేకుండా ఉండాలి.

సంసారంలో సుఖబుద్ధి ఉండడం చేతనే మనకు అందు ఆసక్తి, మన మనస్సులో విషయచింతనము జరుగుతూ ఉంటుంది. ఆసక్తి కలిగితే వానియందు కోరిక పుడుతుంది. సంసారంలో ఎందును ఆసక్తి లేనినాడు మనలో కోరికలు ఉదయించవు. మనకు సంసారసంబంధమైన పదార్థాలలో సుఖబుద్ధి అనేది అజ్ఞానంవలన కలుగుతుంది. నిజం ఆలోచిస్తే సంసారంలో సుఖంలేదు. సంసారం అనేది పరిణామలక్షణం కలది, నశ్వరమైనది, అనిత్యమైనది, కాబట్టి దానిని మరచిపోవాలి. సంసారాన్ని నశ్వరం అని క్షణభంగురం అని గుర్తించి సంకల్పరహితులం కావాలి. అందు ఏ లవలేశం ఆసక్తి ఉన్నా పరిత్యజించివేయాలి. అప్పుడు ధ్యానం చేయడం మొదలుపెట్టాలి.

భగవానుడు నిర్గుణనిరాకార రూపంలో సర్వదా, సర్వత్ర విరాజమానుడై

ఉన్నాడన్న విషయం మనం గుర్తు ఉంచుకోవాలి. ఆ భగవానుడే సగుణ నిరాకారరూపంలోను, తరువాత సగుణసాకారరూపంలోను ప్రకటం అవుతూ ఉంటాడు. ఆకాశంలో నీరు నిరాకారంగా ఎప్పుడూ ఉంటుంది. ఆ నీరే ఆవిరిగాను, మేఘాలుగాను రూపు దాల్చి నీటి రూపంలోను, మంచురూపంలోను వర్షించడం మొదలుపెడుతుంది. ఇక్కడి గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే ఆకాశంలో మొదలు ఏ నీరు నిర్గుణనిరాకారరూపంలో ఉందో ఆ నీరే మేఘాలరూపంలోను, బిందువుల రూపంలోను, మంచు రూపంలోను కూడ ఉండి ఉంటుంది. అలాగే ఏ పరమాత్మ నిర్గుణనిరాకారరూపంలో ఉన్నాడో అతడే సగుణనిరాకారరూపంలో ప్రకటమై తరువాత మహాప్రకాశరూపంలోను, సగుణసాకారరూపంలోను ప్రకటం అవుతు ఉంటాడు. కాబట్టి తాత్త్వికంగా విచారణ చేస్తే సగుణము, నిర్గుణము, సాకారము, నిరాకారము అన్నీ ఒకే భగవానుని విభిన్నరూపాలు.

ఎక్కడ ఉన్నా ఒక్క సచ్చిదానందఘనస్వరూపుడైన పరమాత్మ తప్ప యితరపదార్థం ఏదీలేదు. నీటికి వికారలక్షణం ఉంది. భగవానునకు కూడ ఉందా? అని ప్రశ్నించవచ్చును. భగవానునియందు వికారలక్షణం లేదు. అతడు నిర్వికారుడు. వికారపూరితమైన అజ్ఞానులకు తనలోని వికారమే బ్రహ్మమునందు ఉన్నట్లు గోచరిస్తుంది. నిజం ఆలోచిస్తే బ్రహ్మమునందు వికారం ఏదీ లేదు, ఉండదు. భగవానుడు ఆకాశంకంటెను నిర్మలుడు భగవద్భక్తులు అయినవారు అతని సగుణసాకారరూపాన్ని చూడాలని కోరుకుంటారు. వారి ప్రేమ చేత ఆకర్షితుడై భగవానుడు నిరాకారదశలో నుండి సాకారదశలోనికి వస్తాడు. అతని గుణాలు అన్నీ దివ్యములు చేతనములు అగునట్టివి. అతని సాకారరూపం కూడ చేతనమైనదే. భగవానుడు భూమి మీద అవతరించినప్పుడు తన మీద మాయావరణాన్ని కల్పించుకొని నిజరూపాన్ని మరుగు పరచుకుంటాడు. ఆ నిజరూపాన్ని ఒక్కొక్కప్పుడు భక్తుల ముందుప్రకటం చేస్తూ ఉంటాడు. దానితో భక్తుల దృష్టి కూడ దివ్యమైనది అవుతుంది. దానితో వారు ఆ భగవానుని దివ్యసగుణస్వరూపాన్ని చూడగలుగుతారు.

సహజంగా భగవానుని స్వరూపం అలౌకికము, దివ్యము, చిన్మయగుణాలతో కూడినట్టిది కదా! అది సగుణసాకారరూపంగా ఎందుకు మారుతుంది? అన్నది ప్రశ్న. భక్తుల ప్రేమ కారణంగా అది సంభవం అవుతుంది. భక్తుల ప్రేమ కారణంగా భగవానుడు వస్తాడు అనడం కంటె నిర్గుణనిరాకారపరబ్రహ్మ సగుణసాకారరూపంలోనికి వస్తాడు అలా రావడం అతని లీల అనడం యుక్తియుక్తమైన మాట అవుతుంది. భగవానుడు అసంభవాన్ని కూడ సంభవం చేయగలడు. సాకారపదార్థములు అన్నీ మొదట నిరాకారాలే. "అవ్య క్తాద్వ్యక్తయ స్సర్వాః" (గీత 8-18) వ్యక్తి (ప్రకట) రూపంలో ఉన్నవన్నీ అవ్యక్తం నుండి వచ్చినవి. మూర్తులు (స్వరూపాలు) అన్నీ అమూర్తంనుండి వచ్చినవి. మూర్తిమంతములైన పదార్థాలకు అన్నిటికీ రెండేసి రూపాలు గోచరిస్తు ఉంటాయి. నీటి విషయంలో రెండు రూపాలను ముందు చెప్పియున్నాము. అగ్ని ఉంది అగ్గిపెట్టెలోను, రాపిడిపెట్టే కర్రలలోను వ్యాప్తమైన లేక దాగియున్న అగ్ని నిరాకారాగ్ని, అగ్గిపుల్లను గీయుటలో, కర్రలను రాచుటలోను పుట్టే అగ్ని సాకారాగ్ని. అలాగే భూమియొక్క తొలి రూపం కూడ నిరాకారమే. తరువాత సాకారం అవుతుంది. సారాంశం ఏమంటే సాకారపదార్థాలు అన్ని ముందు నిరాకారాలే. ఇప్పుడు సాకారాలు అయ్యాయి. కాని యివన్నీ వికారలక్షణం కలవే. పరమాత్మ నిర్వికారుడు. అతడు తన ప్రకృతిని వశీకరించుకొని యోగమాయచేత ప్రకటం అవుతూ ఉంటాడు ఆయన యొక్క యథార్థరూపం అందరకు గోచరించదు.

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః**

(గీత 7-25)

నేను అందరకూ గోచరించను అని భగవానుడే చెప్పియున్నాడు. యోగమాయ చేత ఆవరించబడి ఉంటాను అని అతడే చెప్పియున్నాడు. **"మూఢోఽయం నాభిజానాతి"** మూఢుడైన పురుషుడు నన్ను తెలిసికొనలేడు. **"లోకో మామజమవ్యయమ్"** నేను అజుడను. (పుట్టువు లేని వాడను) అవినాశిని (నాశము లేనివాడను) అట్టి పరమాత్ముడనగు నన్ను మూఢులు తెలిసికొనజాలరు. భక్తులైనవారి ముందు తెరను తొలగిస్తాను. అప్పుడు వారు నన్ను చూడగలుగుతారు. ముగ్ధులు అవుతారు. భగవత్సాక్షాత్కారం

లభ్యం కావడానికి ప్రేమయే వాస్తవిక కారణం. ఎక్కడ ప్రేమ ఉంటే అక్కడ భగవానుడు ప్రకటం అవుతాడు. తులసీ రామాయణం బాలకాండంలో దేవతల సభలో పరమశివుడు.

**హరి వ్యాపక సర్వత్ర సమానా ।**
**ప్రేమ తే ప్రగట హోహి మైం( జానా ॥**

హరి అనగా పరమాత్మ సర్వత్ర సమానంగా వ్యాపించి ఉంటాడరని, ప్రేమవలన ప్రకటం అవుతూ ఉంటాడని చెపుతాడు. 'హరిర్హరతి పాపాని' హరి అనగా హరించువాడని అర్థం. హరినామస్మరణం వలన పాపాలన్నీ పటాపంచలు అవుతాయి. హరి అన్నది పరమాత్ముని నామము. పాపాలను హరించేవాడు అగుట చేతనే అతనికి హరి అనే నామం ఏర్పడింది. అతనికి సచ్చిదానంద పరమాత్మ, సచ్చిదానంద ఘనుడు ఆదిగా ఎన్నో నామాలు ఉన్నాయి. వానిలో హరి యన్నది విశిష్ఠమైనది. వేదపాఠం ఆరంభించే ముందు 'హరిః ఓమ్' అనుట పరిపాటి. దానిని బట్టి కూడ హరినామంయొక్క విశిష్ఠత వ్యక్తం అవుతోంది. శబ్దార్థాన్ని బట్టి హరిశబ్దం విశేషమహత్త్వం కలది. మనం హరిశబ్దం తోనే ఆ స్వామిని సంబోధించాలి. ఆ స్వామి మన పాపాలను అన్నిటినీ నశింపజేస్తాడు. అతడు పరమాత్మ అతడు సర్వవ్యాపకుడు.

ప్రేమ పూర్వకంగా ముగ్ధులం అవుతూ మనం శ్రీకృష్ణధ్యానం చేయాలి. ప్రేమ వలననే భగవానుడు ప్రకటం అవుతాడు. ధ్యానంలో మనం తన్మయత్వస్థితిని సాధించుకోవాలి. తన్మయులమై ధ్యానం చేస్తే భగవానుడు తత్కాలమందే ప్రకటం అవుతాడు. దుర్వాసమహర్షి వచ్చినప్పుడు ద్రౌపది అతిదీనంగా - ఓ నాథా! ఓ గోపాలా! ఓ గోవిందా! ఓ దామోదరా! అని తన్మయురాలై కీర్తనం చేస్తూ భగవానుని సంబోధించింది. తోడనే భగవానుడు ఆమె ముందు ప్రత్యక్షం అయ్యాడు. కీర్తనం చేస్తేనే ప్రకటం అయ్యాడు. అంటే ధ్యానం చేస్తే ఆ స్వామి ప్రత్యక్షం అయితీరును అని వేరుగా చెప్పవలెనా? ధ్యానం చేయడం మన వశంలో ఉన్న విషయం. ద్రౌపదివలె మనం కీర్తన ధ్యానం కూడ చేయవచ్చును. మహా భక్తుడైన సూరదాసు బాలకృష్ణునితో ఇట్లు అంటాడు.

**ఆ. పరువువారుచుంటి కరమును విడిపించి**
**కొంచు నబలు గాగ నెంచి నన్ను,**
**పారెదేని కృష్ణ! బమ్మి నా మది డాసి**
**నిన్ను మగడవనుచు సన్నుతింతు ॥**

కృష్ణా! నన్ను అబలునిగా భావించి చేయి విడిపించుకొని పారిపోవుచున్నావు. కాని నా హృదయపీఠంమీద నెలకొనియున్న నీవు ఆ స్థానాన్ని వీడి పారిపోవగలిగిననాడు నిన్ను మగటిమికలవాడవని, పురుషుడవని భావిస్తాను. అని సూరదాసు ప్రేమపూర్వకంగా బాలకృష్ణునితో అన్నమాట. ఇది ప్రేమమూలకమైన వినోదం. ఒక విధం అయిన నిందాస్తుతి. ఇందులో భగవానుని తిరస్కరించునట్టి భావం ఏమీలేదు.

శ్రీకృష్ణ భగవానుని ధ్యానించే ముందు ఏకాగ్రభావంతోనూ, సమభావంతోనూ, వడివడిగా ముందుకి వెళ్లిపోక, వెనుకను పడిపోక బిగ్గరగానూ కాక, బొత్తిగా మందస్వరంలోనూ కాక కరుణాభావం ఉట్టిపడే విధంగా లయబద్ధంగా "శ్రీకృష్ణ గోవింద హరే మురారే హే నాథా! నారాయణ వాసుదేవ!" అను నట్టి కీర్తన చరణం ఏదైన గ్రహించి పర్యాయంగా సంకీర్తన చేయాలి.

భగవన్నామ సంకీర్తనం చేసే సమయంలో మనస్సులో ఈ విధంగా భావనం చేయాలి భగవానుడు సగుణ నిరాకారరూపంలో సర్వత్రా విరాజమానుడై యున్నాడు. అతని గుణాలు అన్నీ దివ్యములైనవి. అవి సర్వత్రా సమభావంతో నిండారి యున్నాయి. భగవానుని స్వరూపం సచ్చిదానందఘనస్వరూపం. సత్ అంతే సత్తారూపంగానూ, చిత్ అంటే జ్ఞానరూపంగానూ, ఆనంద అంటే ఆనందరూపంగానూ భగవానుడు విరాజమానుడై యున్నాడు. అతని స్వరూపం ఆకాశంకంటె అనంతము, సమము, నిరాకారము, అయి సర్వవ్యాపకం అయినది. అతడు ఆనందరూపంలో సర్వత్రా వెలుగొందుతూ ఉన్నాడు. ఏది చేతనమో అదే ఆనందం. ఏది ఆనందమో అదే చేతనం. లోకంలో మనకు కానవచ్చే సమభావమే సత్త్వగుణం. దానినే మాయయొక్క సాత్త్వికభావం అనవచ్చును. అందు చేత అది సత్త్వగుణమే అయినా దానిని జడపదార్థం అంటాం.

ఆకాశం యొక్క స్వరూపం అనగా అనంతత్త్వం జడం అన్నమాట అది చిన్మయము కాదు. ఆనందమయము కాదు. కాని పరమాత్మ చేతనస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు ఆనందస్వరూపుడూను. భావరూపుడన్నా, ప్రేమరూపుడన్నా, అమృతమయుడన్నా, రసమయుడన్నా ఈ మాటలు అన్నీ భగవానుని స్వరూపానికి సంబంధించినవే. స్వరూపమే గుణాల రూపంలో ప్రకటం అవుతుంది. కాబట్టి భగవానుడు స్వయంగా చేతనుడు. అతని గుణాలు అన్నీ చిన్మయములైనవి. బాగుగా పరికిస్తే సర్వత్రా ఆనందమే ఆనందం గోచరం అవుతుంది. మనం అమృతస్వరూపం అయిన ఆనందసాగరంలో తేలియాడు చున్నామా? అనిపిస్తుంది. మనకు గోచరం అయ్యే శాంతి అంతా భగవానుని నుండియే ప్రకటం అవుతోంది. కాబట్టి అదియూ భగవత్స్వరూపమే.

ఈ విధంగా పరమాత్మయందు క్షమ, శాంతి, సమత్వము, సంతోషము, సారళ్యము, మొదలైన దివ్యగుణాలు ఎన్నో అనంతంగా ఉన్నాయి. మనకు గోచరం అయ్యేవే కాక గోచరం కానివి మనం ఎరుగునట్టివి అయిన గుణాలు అనేకం ఉన్నాయి. ప్రకృతియొక్క సాత్త్వికభావాన్ని మహత్తత్త్వం అంటాము. సమిష్ఠి బుద్ధి అంటాము. ఆ బుద్ధి అనే అద్దంలో భగవానుడు గోచరిస్తాడు. భగవత్సంబంధమైన యీ భావాలు ప్రకటం అవుతాయి. వస్తుతః అతడు చిన్మయుడు. అతని స్వరూపమూ, భావాలు, గుణాలు సర్వము శుద్ధబుద్ధియందు, సమత్వబుద్ధియందు తెలియవస్తాయి. దీని సదూహారం, సత్త్వగుణం అనబడుతుంది. ప్రకృతి జడం అయినది. బుద్ధికి అంతర్గతాలై తెలియవచ్చేవి బుద్ధితో కూడి యున్న కారణంగా జడములుగా తోస్తాయి. కాని భగవానుడు మాత్రం బింబరూపంగాను, చిన్మయరూపుడుగాను ఉన్నాడు. ఉంటాడు. ఈ గుణాలు ఆయనకు పైన, క్రింద, ఈ ప్రక్క, ఆ ప్రక్క ఎల్ల వంకలా ప్రకటం అవుతాయి. నిర్గుణనిరాకార రూపంలో ఉన్న భగవానుడు సగుణము, సాకారము, దివ్యము, అయిన రూపంలో ప్రకటం అవుతాడు. ఒక మహాతేజః పటలా రూపంలో మనకన్నుల ముందు ప్రకటం అవుతాడు. సూర్యుడు ఉదయించే

ముందు మహాప్రకాశం ఆవిర్భవిస్తుంది. అది కూడ భగవత్స్వరూపమే. కారణం ఏమంటే భగవానుని ప్రకాశం నుండియే సూర్యుడు, చంద్రుడు, తారాగణం, విద్యుత్తూ మొదలైనవి ఆవిర్భవిస్తాయి. ఆ మహాప్రకాశం పుంజమే శ్రీకృష్ణ భగవానుని దివ్యస్వరూపం. ప్రకాశపుంజం అయిన కారణంగా సాకారంగా గోచరించడం సంభవం అవుతుంది. అప్పుడు మనం భగవానుని సంబోధిస్తూ కీర్తనం అవాహన చెయ్యాలి. అలా చేస్తే భగవానుడు ప్రకటం అవుతాడు.

కీర్తనం చేసే ఒక విధం ఇది -

గోవింద గోవింద గోవింద కృష్ణ! గోవింద గోవింద గోవింద హరే.
కృష్ణ ముకుంద భవబంధహారే! గోవింద గోవింద గోవింద హరే.
గోవింద గోవింద గోవింద కృష్ణ! గోవింద గోవింద గోవింద హరే.
కృష్ణ మురారే! జనవంద్య శౌరే! గోవింద గోవింద గోవింద హరే.
గోవింద గోవింద గోవింద కృష్ణ! గోవింద గోవింద గోవింద హరే.
కృష్ణ మురారే శ్రితమనోహరే! గోవింద గోవింద గోవింద హరే.
గోవింద గోవింద గోవింద కృష్ణ! గోవింద గోవింద గోవింద హరే.
కృష్ణ మురారే శుభవేషధారే, గోవింద గోవింద గోవింద హరే.
గోవింద గోవింద గోవింద కృష్ణ! గోవింద గోవింద గోవింద హరే.
గోగోపగోపీజనమనోహరే, గోవింద గోవింద గోవింద హరే.
గోవింద గోవింద గోవింద కృష్ణ! గోవింద గోవింద గోవింద హరే.
కృష్ణ మురారే వ్రజభూమిచారే, గోవింద గోవింద గోవింద హరే.
గోవింద గోవింద గోవింద కృష్ణ! గోవింద గోవింద గోవింద హరే.
కృష్ణ మురారే సంసారతారిన్, గోవింద గోవింద గోవింద హరే.

మరియొక విధం -

**శ్లో॥ హే గోపాలక! హే కృపాజలనిధే! హే సింధుకన్యాపతే!**
**హే కంసాంతక! హే గజేంద్రకరుణాపారీణ! హే మాధవ!**
**హే రామానుజ! హే జగత్త్రయగురో! హే పుండరీకాక్ష! మాం**
**హే గోపీజననాథ! పాలయ పరం జానామి న త్వాం వినా ॥**

శ్లో॥ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!
శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే!
శ్రీపద్మనాభాచ్యుత! కేటభారే!
శ్రీరామ! పద్మాక్ష హరే మురారే!

శ్లో॥ కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనాఽమరశత్రవో వినిహతాః కృష్ణాయ తుభ్యం నమః
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హే కృష్ణ! రక్షస్వ మామ్ ॥
(ముకుందమాల)

ఇలా మనసారా సంకీర్తనం చేస్తూ ఉంటే పరిణత మనస్కుడైన భక్తునకు ఆనందమే ఆనందం కలుగుతుంది. ముందు మహాప్రకాశపుంజం ప్రకటమై అందు ఆకాశమందే సాక్షాత్తూ శ్రీకృష్ణ భగవానుడు ఆవిర్భవిస్తాడు. అప్పుడు ఆ స్వామియొక్క దివ్యస్వరూపం ఎంత హృద్యంగా ఉంటుందో చెప్పనలవి కాదు. అప్పుడు కలిగే ఆనందం ఇంతా, అంతా కాదు. ఆనందమే ఆనందం. పూర్ణానందం. సంపూర్ణానందం. పరిపూర్ణానందం. అనుభవైకవేద్యం అయిన ఆనందం. సర్వసాధనవిహీనుడను, దీనుడను అని యెరిగి స్వామి తనపై అవ్యాజమైన కరుణను చూపి తనకు దర్శనం ఒసగెనని తలచుకొని సాధకుడు అనిర్వచనీయమూ, అమందమూ అయిన ఆనందంతో ఉప్పొంగిపోతాడు. ఆ శ్రీకృష్ణభగవానుని దివ్యమంగళమూర్తి ఎంత మనోహరంగా ఉంటుందో ఎవరు వర్ణించగలరు? అయినా ఒకింత మా ఊహకు అందినంత మేరకు క్రింద వర్ణనాన్ని పొందుపరుస్తున్నాము-

భూమిని అంటకుండ శ్రీకృష్ణ భగవానుడు ఆకాశదేశమున నిలిచియున్నాడు. అతని స్వరూపం నాలుగూ లేక నాలుగున్నర అడుగుల ఎత్తు కలిగి వెలుగులను వెదజిల్లుతూ ఉంది. ఆ రూపం అతడు 12 ఏండ్ల ప్రాయమువాడని తెలుపుతోంది. ఆ స్వామి పాదాలు అత్యంతసుందరములై గులాబివన్నెకాంతులను ప్రకటిస్తూ ఉన్నాయి. అందు

ధ్వజరేఖ, అంకుశరేఖ, వజ్రరేఖ మొదలైన గులాబివన్నె రేఖలు, వ్రేళ్ల క్రింద శంఖచక్రాది చిహ్నాలు చెలువారుతూ ఉన్నాయి. స్వామి మరింత చేరువ అయ్యాడు.

అతని పాదాలపై భాగం కూడ గోచరిస్తోంది. ఆ పాదాలు అత్యంత కోమలంగా ఉన్నాయి. వానిని స్పృశిస్తే చాలు శరీరం జలదరిస్తుంది. హృదయములో ఆనందరసం తరంగాయితం అవుతుంది. సముద్రంలో వలె అంతరంగంలో ఆనంద తరంగాలు ఆవిర్భవిస్తాయి. ఆ స్వామి యొక్క చరణనఖములు (గోళ్లు) విలక్షణ కాంతులను వెల్లడిస్తూ ఉన్నాయి. బంగారపు టందియల అందాలను చిందించు ఆ స్వామి చరణారవిందాలు సుందరాతి సుందరములుగా కనువిందు చేస్తూ ఉన్నాయి. ఆ స్వామి కటితటము నందు కమనీయపీతాంబరం కన్నులవిందు చేస్తూ ఉంది. ఆ స్వామి కంఠదేశమున సులలితమైన తులసీ దళమాల కలకలలాడుతూ ఉంది. గురివెందపూసలతో కలిపి కూర్చబడిన ముత్యాల సరము ముద్దులు మూటగడుతూ ఉంది. ఒక రతనాల హారము, రత్నమయకంఠా భరణమూ రాజిల్లుతూ ఉంది.

ఆ స్వామి బాహువులు ఆజానువిలంబితములై అలరారుతూ ఉన్నాయి. ఆ పరమపురుషుడు వామహస్తమున మురళిని పట్టుకొని దక్షిణహస్తమున స్వరములను నడపుతూ పూరించి పూరించి సుమధుర రాగ సుధారసధారలను వెడలించి వెడలించి కర్ణపర్వం గావిస్తూ ఉన్నాడు ఆ స్వామి అధరోష్టం మీద నిలిచి మురళి అధరామృతపానం చేస్తూ ఉన్న భంగిమను ప్రదర్శిస్తోంది. ఆ స్వామి స్కంధదేశమున (బుజములపై) గులాబివన్నె ఉత్తరీయం చిత్తాన్ని హరిస్తూ ఉంది. అతని హస్తములు లంబమానములై, ప్రకాశమానములై, సున్నిగ్ధములై చూడ్కులను ఆకర్షిస్తున్నాయి. అతని కోమలాంగుళులయందు రత్నాంగుళీయకములు, బాహువులయందు బాహుభూషణాలు పరిఢవిల్లుతూ పరమానందం కలిగిస్తున్నాయి. మాసములూ, మనోహరములూ అయిన స్కంధాలతో, (మూపులు) వెడందమైన యెడందతో, నిడుదమైన (పొడవు) కంఠంతో, దొండపండువలె దోరవన్నె వహించిన పెదవులతో, అమృతధారలను ఒలికించు మృదుమధుర భాషలతో, శరదిందు సుందరమైన మందహాసంతో,

ముత్యాల పంక్తిని తలపించు దంతపంక్తితో ఆ స్వామి చూడముచ్చట గొలుపుతూ ఉన్నాడు.

ఆ స్వామి పలుకు అర్థయుక్తమై ప్రేమపూరితమైనది. సుమధురమై కర్ణామృతములాగున ప్రీతిని గలిగిస్తుంది. ఆతని దివ్యదేహం నుండి ఘ్రాణతర్పణం గావించే పరిమళాలు ప్రకటం అవుతూ ఉన్నాయి. అతని కర్ణములు రత్నఖచితసువర్ణకుండల సమలంకృతాలై కన్నుల విందు చేస్తున్నాయి. అతని నాసిక అత్యంత సుందరంగా అలరారుతూ ఉంది. చెక్కిళ్లు పసిమి మిసమిసలను ప్రకటిస్తూ ఉన్నాయి. బుగ్గలయందు గులాబి చాయ ఉట్టిపడుతూ ఉంది. దేహం మేఘశ్యామలమై తేజరిల్లుతూ ఉంది. మకరాకారకుండలాల కాంతి బుగ్గల మీద ప్రసరించి విలక్షణశోభను వెలిబెట్టుతూ ఉంది. ఆ స్వామి నయనాలు చపలములూ, ఉన్మీలితాలూ అయి ఇందీవర (నల్లకలువ) సుందరాలై అందాలు చిందుతూ ఉన్నాయి. ఆ నయనాలు విడబారిన తామరపూరేకలను పోలిన ఆకారం కలిగి శోభలు గురుస్తూ ఉన్నాయి. ఆ స్వామి ముఖారవిందం అరుణారవిందశోభతో అందగిస్తూ ఉంది. ఆ స్వామి హసిస్తే ప్రేమవర్షం కురిసినట్లు ఉంటుంది. మరల ఆస్వామి ఆకాశంలో ఒకింతపైకి ఉత్థితుడు అవుతాడు. అక్కడ నిలిచియుండి చల్లని చూపులతో మనమీద ప్రేమవర్షం కురియిస్తాడు. మనం ముగ్ధులం అయిపోతాం. ఆ స్థితిని ప్రేమ అనవచ్చును, ఆనందమూ అనవచ్చును. అందులో ఒక విధం అయిన అలౌకిక రసం (రుచి) ఉంటుంది. కాబట్టి దానిని రసము అని కూడ అనవచ్చును.

భగవానుడు అందరియందూ సమదృష్టి కలిగి యుంటాడు. అందుచేత అతనికి సమదర్శియని పేరు. ఆ స్వామి సమత్వాన్ని వర్షిస్తూ ఉన్నట్లూ, మనం అందు తేలియాడుతూ ఉన్నట్లు అనిపిస్తుంది. మనలోని వైషమ్యం అంతరించిపోతుంది. రాగద్వేషాది మాయా వృత్తులు లేశమాత్రంగా కూడ ఉండవు. భగవానుడు విరాజిల్లిన చోట మాయనిలువదు. దూరంగా పలాయితమైపోతుంది. భగవానుని నయనాలు శాంతిరసం వర్షిస్తూ ఉన్న విధంగా భావిస్తూ ఉంటాయి. అతడు సాక్షాత్తూ క్షమాస్వరూపుడు. అనంత శుభగుణగణనిలయం అయినవాడు. ఆ గుణాలను నయనద్వారాన లోకంలో

ప్రసరింపజేస్తూ ఉంటాడు. లోకం అంతా అనగా బ్రహ్మాండం అంతా ఆ గుణాలతో నిండిపోతోంది. ఆ స్వామి హృదయంలోని శుభభావాలు కన్నులనుండి వికసితములై వెలికి వర్షించుచున్నవేమో అనిపిస్తోంది. శుభగుణభావాల వెల్లువ వచ్చినట్లు, ఆ భావాల సముద్రం పొంగి పొరలుతూ ఉన్నట్లు. అందులో మనం తేలియాడుతూ ఉన్నట్లు అనిపిస్తుంది. క్షమ, దయ, శాంతి, సమత్వం, సంతుష్టి, సరళత్వం మొదలైన భవ్యగుణాలు ఎన్నో ఆ పరమపురుషునిలో ప్రకాశిస్తూ ఉన్నాయి ఆ భగవానుడు బోధస్వరూపుడు. జ్ఞానస్వరూపుడు, ఆనందస్వరూపుడు. ఆనందఘనస్వరూపుడైన పరమాత్మ ఉత్తమగుణ భావాల రూపంలో మనలో పరివ్యాప్తుడు అవుతూ ఉన్నాడు ఆ స్వామి నేత్రాలు వికసితకమలాలను విహసిస్తూ ఉన్నాయి. కనుబొమలు ధనురాకారాలై తుమ్మెదల వలె నెమ్మదిగా ఆనందమును గలిగిస్తూ ఉన్నాయి. అతని భ్రుకుటి (కనుబొమల నడిమి ముడుత) అందాన్ని ప్రకటిస్తోంది. లలాటం విశాలమై అందు కస్తూరీ తిలకం నిస్తులశోభను వెల్లడిస్తోంది. శిరముపై తుమ్మెదల గుంపువలె నల్లనైన కురులు ప్రకాశిస్తూ ఉన్నాయి. తలమీద నెమలిపించపు కిరీటము, అందు అనుసంధింపబడి సువర్ణముక్తామయమైన సరం సొబగులు ఈనుతూ ఉంది. మస్తకం మీద మణిరత్నఖచితసువర్ణకిరీటం మనస్సును హరిస్తోంది. ఆ స్వామి శరీరం అంతా శ్యామలమై అలౌకిక దీప్తులను ప్రకటిస్తోంది. పున్నమ చంద్రుడు ఆకాశంలో నిలిచి సమస్తబ్రహ్మాండంలోనూ చల్లని కాంతులను ప్రసరింపచేసే విధంగా భగవానుడు ఆకాశంలో నిలిచి తన ప్రకాశాన్ని ఎల్ల దిక్కులా ప్రసరింపజేస్తూ ఉన్నాడు. భగవానుని రూపం అలౌకికము అద్భుతము అయినట్టిది. స్వామి ఆకాశంలో నిలిచి చిరునగవు వెన్నెలలను ప్రకటిస్తూ ఉన్నాడు. ముని జనకృతవందనా! నందనందనా! మాకు ఇప్పుడు ఆకాశంలో గోచరిస్తూ ఉన్న నీ యీ దివ్యసుందరస్వరూపం సర్వకాలసర్వావస్థలయందూ మా దృష్టి పథంలో నిలిచియుండే విధంగా మమ్ము అనుగ్రహింపవే స్వామి! నీ యందు ప్రేమ మాకు దినదిన ప్రవర్థమానం కావాలి. శ్రద్ధ పెంపొందాలి. నీతో మాకు ఎన్నడూ ఎడబాటు కలుగరాదు. మేం ఎల్ల వేళలా నీ చెంతనే ఉండి నీకు సేవ చేస్తూ ఉండాలని కోరుకుంటున్నాం. నీ యందు మాలో

నిష్కామప్రేమభావం నెలకోనాలి. నీ నామాన్ని నిత్యము జపించుకొంటూ నీ రూపాన్ని నిరంతరం ధ్యానించుకొంటూ ఉండే విధంగా మమ్ము అనుగ్రహింపుమా! అని మనం ఆ స్వామిని వేడుకొంటాం.

మనం అందరము బృందావనంలో ఉన్నాం అనిపిస్తుంది. చేరువగా రమణపులినం ఉన్నట్లు అనిపిస్తుంది. శ్రీకృష్ణుడు అక్కడ రమణం చేయడం చేత ఆ యిసుకతిన్నె రమణపులినం అనబడుతోంది. ఆ స్వామి అక్కడ మనోహరరాసక్రీడలు సాగించాడు. ఆ స్వామి అక్కడ గోపికలతో కూడి ఆడుతూ పాడుతూ నాట్యం చేసేవాడు ఆ నాట్యాన్ని అవలోకించి అందరూ ముగ్ధులు అయ్యేవారు. చెంగట యమునానది పారుతూ ఉంది. అక్కడ ఒక కదంబవృక్షం ఉంది భగవానుడు ఆ చెట్టు ఎక్కి కొమ్మమీద కూర్చుండేవాడు. పాదాలను క్రిందకు వ్రేలవైచుకొనియుండి సోల్లాసంగా మురళిని పూరించేవాడు. అదిగో! అమృతతుల్యం అయిన మధురమురళీధ్వని వినవస్తోంది. వీనులవిందు చేస్తోంది. ఆ స్వామి యొక్క స్వరూపం నయనాలకూ, వాణి, వంశీనాదమూ చెవులకూ అమృతతుల్యంగా గోచరిస్తోంది. సుగంధం నాసికకూ, స్పర్శ హస్తాలకూ అమృతసదృశంగా ఉన్నాయి. ఆ స్వామి దర్శనమూ, స్పర్శమూ, భాషణమూ అన్నీ అమృతమయాలే. అన్నీ ఆనందమయాలే. అన్నీ రసమయాలే, అన్నీ ప్రేమమయాలే. భగవానుని సర్వమూ మధురమే. ఇది ఆ స్వామి యొక్క మధురమోహనమూర్తి.

మనం ఆ స్వామిని ఇలా ధ్యానం చేయాలి. మురళీధరుడు మురళిని మ్రోగిస్తూ ఒక్కుమ్మడిగా చెట్టుకొమ్మపయినుండి క్రిందకు దుముకుతాడు. మనం అందరమూ అతనితో కూడి ఆడుతూ, పాడుతూ నాట్యం చేస్తున్నాం. మనకు ఎల్ల వంకల మండలాకారంగా గోపికలు నిలిచి ఉన్నారు. గోపికల మండలానికి వెలుపల గోపబాలకుల మండలం ఏర్పడింది. వారు అందరూ భగవానుని సహచరులు. వారికి వెలుపల మూడవదిగా భగవద్భక్తుల మండలం ఉంది. అందులో పశువులు, పక్షులు, మనుష్యులు, దేవతలు, రాక్షసులు, యక్షులు, మున్నగువారు ఉన్నారు. జంతువులలో హనుమంతుడు, అంగదుడు మొదలైన వానరులూ, పక్షులలో గరుత్మంతుడు, కాకభుశుండి, జటాయువు మొదలైనవారూ దివ్యరూపాలను ధరించి భగవానుని నామగుణాలను కీర్తనం

చేస్తూ ముగ్ధులు అవుతున్నారు. దేవతలలో శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారూ, యక్షులలో కుబేరుడు మున్నగువారు. రాక్షసులలో విభీషణాదులు, అసురులలో ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి మొదలైనవారూ, మానవులలో ధ్రువుడు, అంబరీషుడు, కీర్తిమంతుడు మొదలైన మహాభక్తులు అందరూ కూడి మండలాకారంగా నిలిచి భగవానుని నామగుణసంకీర్తనం చేస్తున్నారు.

వారికి వెలుపల మండలాకారంగా నిలిచి గోవులు చెవులు రిక్కించి భగవానుని మురళీగానాన్ని ఆలకించి పారవశ్యం పొందుతున్నాయి. అన్నీ అందరూ భగవత్ప్రేమతో తన్మయత్వం పొందుతూ ముగ్ధులు అవుతున్నారు. ఆడుతూ పాడుతూ నృత్యం చేస్తూ దేహజ్ఞానం కోలుపోతూ ఉన్నారు. అలౌకిక స్వరూపంతో అలరారుతూ భగవానుడు అందరి నడుమ గీతవాద్యప్రక్రియను సాగిస్తూ ముగ్ధుడు అవుతున్నాడు. అందరి మీద తన మంత్రజాలికదృక్కులను ప్రసరింపజేస్తూ అందరనూ మంత్రముగ్ధులను చేస్తున్నాడు. కన్నులతో భగవానుని స్వరూపాన్ని త్రాగివేస్తూ ఉన్న విధంగా ఎల్లరూ ఆ స్వామి వంకకు చూస్తున్నారు. అతని రూపాన్ని అందరూ తమ హృదయాలలో పదిలపరచుకొంటున్నారు. ఏ విధంగా ధ్యానం చేస్తే భగవానుడు అదే రూపంతో మనకు హృదయగోచరుడు అవుతాడు. మన మనస్సు, చూపు ఎక్కడకు పోతే అక్కడ ఆ స్వరూపమే గోచరిస్తుంది. మన కన్నులలోను, హృదయంలోను ఆ స్వరూపం నెలకొని పోతుంది. వెలుపల, లోపల సర్వత్రా ఆ స్వరూపమే నిండియున్నట్లు గోచరిస్తుంది. నిరాకారరూపంలో ఎట్లునూ ఉన్నవాడే. ఆ స్వామియే మహాప్రకాశపుంజం నడుమ సగుణసాకార శ్రీకృష్ణ భగవానుని రూపంలో గోచరించడం మొదలవుతుంది. ఆ స్వరూపం సజలజలదం లాగున శ్యామలమై ప్రకాశమానము, సుందరమూ అయి శోభిల్లుతూ ఉంటుంది. గీటురాయివలె నల్లనైనది ఆ రూపం. ఆ గీటురాయిలో మెరుపు లేదు. ఇందులో ఉంది.

అందులో కాఠిన్యమే కాని కోమలత్వం లేదు. ఇందులో కోమలత్వమే కాఠిన్యంలేదు. భగవానునితో పోల్చదగిన వస్తువు ఏదీ ఉండదు, లేదు. అతడు పూవుకంటెను మొలకనూలు (ఒక విధమైన మల్లువస్త్రం) కంటెనూ

కోమలం అయినవాడు. నవనీతం కూడ అతనికి పోలిక కాదు. అందులో వ్రేలు పెడితే ఒకింత ఇరుకు కొంటుంది. తడిగా కూడ ఉంటుంది. ఇందు ఆ దోషం లేదు. అతడు కోమలుడు అగుటతో పాటు దివ్యమైన వాడు కూడ. అతనిని స్పృశించినప్పుడు, కూడినప్పుడు అతనిలో కలిసిపోవాలి అనిపిస్తుంది. అతని దివ్యసుందరరూపాన్ని నయనాలతో త్రాగివేయాలి అనిపిస్తుంది. ఆ స్వామి యొక్క దర్శనం ఏమి, స్పర్శ ఏమి, భాషణం ఏమి అన్నీ అలౌకికాలే. అన్నీ అమృతమయాలే. అన్నీ ఆనందమయాలే, అలాంటి ఆ భగవానుని దివ్యసుందరరూపాన్ని అనుక్షణము దర్శిస్తూ, ముగ్ధత చెందుతూ మనం ఇందందు నడుస్తూ తిరుగాడుతూ ఉన్నా, లేస్తున్నా, కూర్చుంటున్నా, తింటున్నా, త్రాగుతున్నా, నిద్రపోతూ ఉన్నా సర్వకాలసర్వావస్థలయందూ ఆ స్వామి మనతోటే ఉన్నాడని భావించుకుంటూ ఉండాలి గోపికలు తమ గృహకృత్యాలను నిర్వర్తించుకుంటూ కూడ భగవానుని నామగుణగానం చేసేవారు. వారి నిండు హృదయాలు భగవానునియందు, భగవానుడు వారి హృదయములందు, నయనాలయందు నెలకొని ఉండేవాడు. ఆవుల దగ్గర పాలు పిదికే వేళ, పెరుగు చిలికేవేళ, వంట చేసేవేళ, చీపురుతో ఇల్లు చిమ్మేవేళ, బిడ్డలకు స్నానం చేయించే వేళ, ఇంటిని అలికేవేళ, ఇంకా ఇతరములైన పనులు ఏవి చేసినా ఆయాసమయాలలోనూ గోపికలు భగవానుని నామగుణగానం చేస్తూ మానసికంగా ధ్యానం చేస్తూ ఉండేవారు. అలాగే మనం కూడ ఏ పని చేస్తూ ఉన్నా భగవానుని స్మరణం చేస్తూ ఉండాలి. నిద్రపోయే ముందు భగవన్నామగుణసంస్మరణం చేసుకుంటూ ఉండాలి. ఎలాగ అంటే మహారాసక్రీడ సాగుతోందనీ, జనులు అందరూ ప్రేమపూర్వకంగా అందుపాల్గొని ఆడుతూ పాడుతూ నాట్యగాన వాద్యవినోదంలో నిమగ్నులయి ఉన్నారని, వారు మండలాకారంగా తిరుగుతూ ఉన్నారనీ భావించుకోవాలి. భగవానునకు - శ్రీకృష్ణ, వాసుదేవ, నారాయణ, మధుసూదన ఆదిగా ఎన్నో నామాలు ఉన్నాయి. మన మనస్సు ఆ స్వామియందూ, ఆ స్వామి నయనాలు మనమీదనూ లగ్నములై యున్నాయి. ఆ స్వామి మన వంకకు సమదృష్టితో చూస్తూ ఉన్నాడు. మన వంకకు అభిముఖుడు అవుతూ ఉన్నాడు. అన్నట్లు భావన చేయాలి. అంతేకాదు

ఆ స్వామి మనోహరంగా నాట్యం చేస్తూ ఉన్నట్లు, పాడుతూ ఉన్నట్లు, వాద్యధ్వని చేస్తూ ఉన్నట్లు భావనం చేయాలి. భగవానుడు ఒకింత ఆకాశం నడుమకు వెడలి పోయినట్లు, కదంబం అధిరోహించి పదములను వ్రేలవైచి కదలించుచు కన్నులలో ఉల్లాసం ఉట్టిపడగా ప్రేమతో మురళిని మ్రోగిస్తూ ఉన్నట్లు, ఒకింత తడవునకు క్రిందకు ఉరికి మరల నాట్యగానవాద్యసరణిని సాగిస్తూ ప్రేమముగ్ధుడు అవుతూ ఉన్నట్లు, ఆ సమయంలో వ్యత్యస్తపాదారవిందుడై అపూర్వము, దివ్యము, సుందరము, భక్తజనమనోమోహనము, అఖిల జగదానందసంధాయకము అయిన భంగిమలో నిలువబడినట్లు భావించుకోవాలి. ఒకప్పుడు ఆకాశంలో నిలిచి ప్రేమదృక్కులను ప్రసరింపజేస్తూ అందరనూ ప్రభావితులను చేస్తూ ఉన్నట్లు, ఒకప్పుడు మీదికి వెడలిపోతూ ఉన్నట్లు, ఒకప్పుడు కదంబతరు శాఖమీద కూరుచున్నట్లు, ఒకప్పుడు అక్కడనుండి క్రిందకు దుమికి ఆట, పాట, వాదనము, మొదలుపెట్టినట్లు వివిధలీలా వినోదప్రక్రియలను సాగిస్తూ ఉన్నట్లు, భావనం చేయాలి. ఆ లీలామయుని దివ్యమంగళస్వరూపాన్ని నిరంతరం తలపులో ఉంచుకొంటూ గోపికలవలె చరిస్తూ ఉండాలి. అలా ఉండడం జన్మసార్థక్యహేతువు అవుతుంది.

# వ్యవహారం చక్కబడే విధము

నాది అనే భావానికే ఆత్మీయత అని పేరు. ఆ మమకారం వేరు, ఆసక్తి వేరు. ఆత్మీయత అనేది రెండు విధాలు. నిష్కామభావంతో కూడినది. సకామభావంతో కూడినది. నిష్కామభావంతో కూడినది బంధహేతువు గాదు. సకామభావంతో కూడిన ఆత్మీయత బంధనహేతువు అగునట్టిది. దాని గుర్తింపు ఎలాగ అంటే - నేను ఒక వ్యక్తిని వీడు నావాడు అని భావిస్తున్నాను అనుకోండి! నా వాడు అనే ఆ భావన నిష్కామభావంతో కూడినది అయితే అతని హితం కోసం నేను ఎంతవరకు ప్రయత్నించాలో అంతవరకు పూర్తిగా ప్రయత్నిస్తాను అన్నమాట. అతనికి ఒక సోదరుడు ఉంటాడు. అతడు కూడ ఇతనిని నా వాడు అనే అంటాడు. ఆ సోదరునికంటెను నేను ఇతనికి చేకూర్చేహితం అధికంగా ఉంటుంది. ఇతనికి ఆత్మకల్యాణం చేకూర్చే విషయంలో ఇతని సోదరునికంటె నా భావనయే ప్రబలంగా ఉంటుంది. కారణం ఏమంటే నా భావన వెనుక నిష్కామభావమే కాని సకామభావం లేదు. కాబట్టి నా భావన మూల్యవంతమైనది. దాని పరిమాణం కూడ అధికమైనది అవుతుంది. ఇతని సోదరుని భావన వెనుక నిష్కామభావన ఉండదు. అది స్వార్థంతో కూడినది అవుతుంది. తన స్వార్థం సిద్ధించని వేళ ఆ సోదరుడు ఇతనికి ఎదురు తిరుగుతాడు. ఇతనిని ద్వేషిస్తాడు. ఇతనికి అనర్థం కలిగించడానికి కూడ ప్రయత్నిస్తాడు. అట్టి సంఘటనలను ఎన్నిటినో మనం ప్రత్యక్షంగానూ చూస్తూ ఉంటాము.

ఒక సజ్జనుడు ఉన్నాడు. అతనికి తన సోదరునిమీద ప్రేమ ఉండేది. అతడు ఆ కాలంలో తన సోదరునకు ప్లీడరువృత్తిలో బాగా డబ్బులు రావడానికి వెనుక ఉండి దోహదం చేస్తూ ఉండే వాడు. అనంతరకాలంలో వారి ఇరువురి నడుమ అభిప్రాయభేదాలు పొడచూపాయి. క్రమంగా వారు ఒకరిని ఒకరు చంపుకొనునంతమేరకు ఒకరికి ఒకరు బద్ధశత్రువులు

అయిపోయారు. అన్న, తమ్ముడు అనే సంబంధం మాత్రం ఉంది. సోదరసంబంధం అతీతం అయినది ఏదీ కాదు. సోదరులు సోదరులే, తమస్వార్థానికి విఘాతం కలిగినప్పుడు ఒకరికి ఒకరు ఎదురు తిరుగుతారు. ఒకరికి ఒకరు సహకరించుకోవడానికి బదులు అనర్థం కలిగించుకోవడానికి ప్రయత్నిస్తారు. స్వార్థం మీద ఆధారపడిన ఆత్మీయత నిలువదు. కాని నిష్కామభావంతో కూడిన ఆత్మీయత ఎదుటి వ్యక్తి తనకు ఎంత వ్యతిరిక్తదిశలో ప్రవర్తించేవాడైనను వానికి హితం చేకూర్చడం అనే కర్తవ్యం కారణంగా సుస్థిరంగా నిలుస్తుంది. ఒకవేళ ఆ యెదుటివాడు ఈవలివాడు చేస్తూ ఉన్న హితప్రయత్నాలవలన లాభం పొందకపోతే అది వేరు విషయం. ఈవలివాని ఆత్మీయత మాత్రం ఏమాత్రమూ చెడదు.

స్వార్థం ఉన్నచోట స్వార్థియైనవాడు మరణిస్తే ఎవ్వరికీ చింత కలుగదు. బ్రదికియుండడంలో స్వార్థం ఉన్నప్పుడు బ్రదుకడంలో ఆనందం కలుగుతుంది. మరణంలో స్వార్థం ఉన్నప్పుడు మరణించడంలో ఆనందం కలుగుతుంది. బదికియున్నవాడు కంటకప్రాయుడుగా పరిణమిస్తే ఒక విధంగా వాని జీవనం వలన దుఃఖం కలుగుతుంది. వానికి హర్షశోకాల ద్వంద్వదశ ప్రాప్తిస్తుంది. నిష్కామభావంతో ప్రవర్తించేవానికి రాగద్వేషాలు ఉండవు. హర్షశోకాలూ కలుగవు. ఏదైన ఒక సంస్థ చేసే కార్యకలాపం వెనుక నిష్కామభావం ఉంటే ఆ సంస్థయందు మమకారం కలిగియుండడం (ఆ సంస్థ మాది అని చెప్పుకోవడంలేక భావించుకోవడం) ఆభరణతుల్యం అవుతుంది. అట్లు కాక అందు దోషం ఉండి అనగా స్వార్థం ఉండి మాది ఆ సంస్థ అనే భావం ఏర్పరచుకోవడం జరిగితే అది దూష్యం అవుతుంది. అలాగే పదవుల విషయంలో కూడ ఒక మాట చెప్పవలసి ఉంది. నేను ప్రభుడను, నేను అధికారిని, నేను ప్రెసిడెంటును, నేను మంత్రిని అని యిట్లు చెప్పుకొనే అధికారాలు, పదవులు అనేకం ఉంటాయి. ఎవడైన తన మాట వినకపోతే వానిని దండించాలని లేదా తొలగించివేయాలి అని భావించే అధికారులు ఉన్నారు. ఉంటారు . అట్టి సందర్భాలలో వాడు తన మాట వినకపోవడంవలన సంస్థకు నష్టం కలుగుతోందా? లేక లాభం

కలుగుతోందా? అని అధికారి ఆలోచించాలి. లాభం కలిగే పరిస్థితిలో వినక పోవడంలో సేవకుడు మంచి పని చేసినవాడే అవుతాడు. లాభనష్టాల విచారణ లేకుండ నేను అధికారిని అనే అహంకారంతో అనుచిత చర్యలకు పాల్పడరాదు. ఇలాంటి అధికారజన్యం అయిన దురహంకారం మానవుని ముంచివేస్తుంది. వాడు చెప్పిన మాట వినకపోవడం వలన సంస్థకు నష్టం కలిగే పరిస్థితిలో వానిని ఉపేక్షించ కూడదు. ఎందుచేత అంటే అది వాని మేలునకే. వాని మేలు ఏది? అంటే అతడు ఇలా ప్రతి పని విషయంలోను నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తూ ఉంటే ఉన్నతిని సాధించుకోలేడు. చివరకు వాడు నిర్లక్ష్యంగా ప్రవర్తించినందులకు సమాధానం చెప్పుకోవలసివస్తుంది. రానురాను వాని పరిస్థితి అలా నిర్లక్ష్యంగానే సాగుతూ ఉన్నప్పుడు, ఒక సారి పిలిచి మందలిస్తే కాని వాడు చక్కబడడు అని తోచినప్పుడు వాని హితమును దృష్టిలో ఉంచుకొని వానిని పిలిచి మందలించడంలో తప్పులేదు. క్రోధాన్ని ప్రకటించడంలోనూ తప్పులేదు. మిమ్మ్మ జనాలు కోపిష్టి అన్నా మీరు ఆ విషయములో జంకవలసిన పని లేదు. అతనిని ఎలాగైన చక్కజేయడం వానికి మేలు చేకూర్చడం, వానిని మానవతాదృక్పథం కలవానినిగా తీర్చిదిద్దడం మీకు పరమార్థం కావాలి. అలాంటి పరమార్థదృష్టి మీలో ఉన్ననాడు మీరు వానిని ఆవశ్యకతను బట్టి ఒక లెంపకాయ కొట్టవచ్చును. తల్లిదండ్రులు, గురువు బిడ్డలను సంస్కరించుటకు దండించరా? అలాంటిదే మీచర్య కూడ అవుతుంది. కాని నేను పదాధికారిని అనే అహంకారం మాత్రం తగదు. అది పతనాన్ని కలిగిస్తుంది. అది మంచిది కాదు.

పదాధికారి కావడంలో తప్పులేదు. మంత్రి కావచ్చును, ప్రెసిడెంటు కావచ్చును. మేనేజరు కావచ్చును. అందులో దోషం ఏమీ లేదు. కాని ఆ పదవికి సంబంధించిన అహంకారం మాత్రం తగదు. అహంకారమూ, అభిమానమూ ఉంటే మానవుడు పతనాన్ని పొందుతాడు. వానిలో రాగద్వేషాలు హర్షశోకాలు ఉదయిస్తాయి. సాధారణంగా పతనం పొందే అధికారులు అందరూ తాము నిర్వహించిన పదవి మూలంగా కాక తత్సంబంధమైన అహంకారం కారణంగానే పతనాన్ని పొందుతూ ఉంటారు. ఎప్పుడూ పదవి

చెడ్డది కాదు. అహంకారమే చెడ్డది. మీకు ఏ పదవి లభించినా మంచిదే. భగవానునిది ఎంత ఉన్నతమైన పదవి? అయినా ఆ స్వామి మునిగిపోతున్నాడా? మహాపురుషుల పదం ఎంత ఉన్నతమైనది? అయినా వారిని ఆ పదంముంచివేస్తోందా? పదవి ఏదయినా దానికి సంబంధించిన అభిమానమే ముంచివేస్తుంది. మహాత్ముడైన వాడు నేను మహాత్ముడను అని విర్రవీగినప్పుడు పతనం పొందడం తథ్యం. కాని మహాత్ముడు అయినవాడు అలా ఎన్నడూ చేయడు. చేసినవాడు మహాత్ముడు కాడు. కాబట్టి పదవికి సంబంధించిన అభిమానం మంచిది కాదని, అది ఎంతటివారిని అయినా సర్వవిధాల ముంచివేస్తుందని మనం మరచిపోకూడదు.

ఒక సజ్జనుడు ఉంటాడు. అతడు సంస్థనుండి నామమాత్రపులబ్ధినే పొందుతూ ఉంటాడు. పదవికి సంబంధించిన అభిమానం కూడ అతనిలో లవలేశమూ ఉండదు. అతడు కష్టపడి పని చేస్తాడు. సంస్థ అభివృద్ధిని కోరుతాడు. అతని ఆంతర్యం కూడ ఉత్తమం అయినదే అవుతుంది. అయినా అతనికి భగవత్ప్రాప్తి కలగడంలో విలంబం అవుతోంది. కారణం ఏమి? అన్నది ప్రశ్న. దానికి సమాధానం ఏమంటే లోపం ఎక్కడ ఉన్నది అని ఆ సజ్జనుడు స్వయంగా యోచించుకోవాలి. తనలో కీర్తిప్రతిష్ఠలకు సంబంధించిన కాంక్షాదోషం ఏమైన ఉన్నదా? అని పరికించుకోవాలి. మానవునిలో శారీరక సుఖాభిలాషాదోషము, ధనాన్ని కూడబెట్టాలి అనే స్వార్థదోషము వంటివి మనస్సులలో దాగి ఉంటాయి. బయటివారికి కానరావు. మనలోని చిత్తవృత్తిదోషాలు కొన్ని మనకే తెలియకుండా పని చేస్తూ ఉంటాయి. అయినా మనం వానిని వెదకి పట్టుకొని నిర్మూలించుకుంటూ ఉండాలి. మానవునిలో కీర్తిప్రతిష్ఠల కాంక్షాదోషం ఉండకూడదు. ఆ విధమైన దోషం తనలో లేనట్లు ఎదుటివారికి కానరావడం ప్రధానం కాదు. ఆ దోషం తనలో లేకుండడం ప్రధానం. ఏ పనియైన పేరుప్రతిష్ఠలను కోరకుండా చేయడం గుణం. కోరి చేయడం దోషం. మానవుడు పేరుప్రతిష్ఠలను ఆపేక్షించకున్నా నిష్కామభావంతో పని చేస్తే వాని యంతట అవే ప్రాప్తిస్తూ ఉంటాయి. అలా ప్రాప్తించినవాని యెడల మానవుడు నిర్వికారంగా అనగా

అది ప్రాప్తించక ముందు ఎలా ఉన్నాడో అలాగే ఉండాలి. అలా ఉండడం మహత్త్వపూర్వకమైన విషయం అవుతుంది. అప్పుడు ఏ దోషమూ అంటదు. తనలో పని చేసే శక్తి విశేషంగా ఉన్నా అతడు పని తక్కువ చేస్తాడు అనునట్టి దోషం కూడ ఆ అధికారియందు ఆపాదింప వీలు లేదు. ఆ పరిస్థితిలో పని తక్కువగా చేయడమే అనగా శక్తిని తక్కువగా వినియోగించడమే సంభవం అవుతుంది. శాసనం సాగించవలసిన బాధ్యతలో కొంత కష్టం ఉంటుంది. కాబట్టి శక్తి ఉన్నా దానిని తక్కువగా వినియోగించడం జరిగితే దానిని దోషంగా పరిగణించరాదు. సోమరితనంతో కాలహరణం చేస్తున్నాడు అనడానికి వీలు లేదు.

ఎవరియందైన పేరుప్రతిష్ఠల కాంక్షాదోషం రావచ్చును. పదవిమూలకమైన దోషం రావచ్చును. నేను అధికారిని, ప్రభుడను అనే దోషం రావచ్చును. అధికారాన్ని విడిచిపెట్టనక్కర లేదు. దానివలన వచ్చిన అహంకారదోషాన్ని వర్జించాలి. పదవిని కాదు. పదవివలన వచ్చిన దురభిమానాన్ని విడిచిపెట్టాలి. అట్టి దోషం తనలో ఉందా? లేదా? అనే విషయం ఇతరులు చెప్పేది కాదు. ప్రతి వ్యక్తి తనంత తానుగా ఆత్మపరిశీలనం చేసుకొని తెలుసుకోవలసిన విషయం.

పేరుప్రతిష్ఠలు ప్రాప్తించినప్పుడు ఉప్పొంగడం కూడ దోషమే. ఒకడు మనలను దూషిస్తాడు, మనకు కష్టం కలుగుతుంది. ఒకడు మనలను అవమానిస్తాడు, మనకు కష్టం అనిపిస్తుంది. పేరుప్రతిష్ఠలను చూచుకొని మురిసిపోవడం అనేది అంతకంటెనూ కష్టతరం అయిన విషయం. మరి రెండు విధాల సజ్జనులు ఉన్నారు. వారిలో ఒకరు తగినంత డబ్బుతీసుకొని సేవ చేసేవారు. డబ్బు తీసుకుని సేవ చెయ్యడంలో తప్పు ఎంత మాత్రం లేదు. డబ్బు తీసుకొని సేవ చేయడంలో కొంచెపుతనం తోస్తుంది. సేవకునియందు ఎంత శక్తి ఉన్నదో అంతా వినియోగింపబడదు. కావున అందులో లోపం తోస్తుంది. కాని మీరు మానసికంగా నిశ్చయం చేసుకుంటే ఎక్కువ కాలాన్ని వినియోగించండి! మీనుండియే కాదు. ప్రతి వ్యక్తి నుండి ఎక్కువ శక్తి. ఎక్కువ సమయం వినియోగించి పని చేయడాన్ని, అందరూ

అభిలషిస్తారు. అలా చేయడాన్ని కార్యకర్తలు తమ కుపరమోదాహరణంగా స్వీకరించాలి.

మరియొక సజ్జనుడు ఉన్నాడు. అతని మనస్సుకి ప్రతికూలమైన పరిస్థితి ఎదురైనప్పుడు అతనికి కోపం వస్తుంది. ఉద్రేకం కలుగుతుంది. అలా కోపం తెచ్చుకోవడం మహాదోషకారణం అవుతుంది. అలాగే అనుకూలపరిస్థితి ఎదురైనప్పుడు ప్రసన్నత చెందడం కూడ దోషహేతువే. అట్టి సందర్భాలలో రాగద్వేషాలు, హర్షశోకాలు ఉదయిస్తాయి. అలాగే మరియొక సజ్జనుడు ఉంటాడు. అతనికి ఏ పదవీ ఉండదు. అయినా ఏదో ఒక పదవి ఉన్నవానివలె దురభిమానాన్ని ప్రదర్శిస్తూ ఉంటాడు. అది మరింత దోష హేతుకమైన ప్రవృత్తి. అతనికి ఏ అధికారము లేదు. అతడు ఒక మంత్రి కాదు, మేనేజరు కాడు, కోశాధికారి కాడు, సభాపతి కాదు. నేను ఎవరికీ ఎందుకు సంతోషం కలిగించలేకపోతున్నాను? నన్ను ఎవరూ పలుకరించకపోవడానికి కారణం ఏమి? అని అతడు ఆత్మపరిశీలనం చేసుకోవాలి. పేరు ఎత్తకూడదు. సందర్భం వచ్చింది కనుక ఒక వ్యక్తిని గూర్చి చెపుతున్నాను. ఒక మహాశయుడు ఉండేవాడు. అతడు ఇప్పుడు లేడు. పరమపదించిపోయాడు. అతని స్వభావం అతనితోనే పోయింది. అతనివలన అతని సోదరులకు సంతోషం కలిగేది కాదు. సత్సంగం కోరేవానికి ఎవ్వనికీ సంతోషం కలిగేది కాదు. మాకూ సంతోషం కలిగేది కాదు. అయినా ఆయనను ఇముడ్చుకొన్నాము. తనలోని దోషాన్ని అతడు సంస్కరించుకొని ఉంటే బాగుండేది. కాని సంస్కరించుకోకుండానే వెళ్లిపోయాడు. అతనిని గూర్చి చర్చించడం అనవసరం. మీరు 'స్వర్గాశ్రమం' వంటి ఆధ్యాత్మప్రచార కేంద్రస్థానంలో అధికారిగా ఉన్నారు అనుకోండి అప్పుడూ, ఇప్పుడూ మీ మీద మన అందర మీద అధికారిగా మరియొక పరమప్రభువు ఉన్నాడు అన్న విషయాన్ని మనం మరచిపోకూడదు.

మన చేష్టలవలన ఆ ప్రభువుకు కూడ ప్రసన్నత కలిగించవలసిన బాధ్యత మనమీద ఉన్నది. కాని, దానిని విస్మరిస్తున్నాము. మన వలన క్రింది వారికి సంతుష్టిలేదు. పైవానికీ సంతుష్టి లేదు అంటే మనలోనే

ఏదో దోషం ఉంది అనుకోవాలి. ఆ దోషం ఏమిటి అంటారు? అధికారులైనవారిలో సాధారణంగా ఉదయించేదే అది. దురభిమానదోషం. మానవుడు తనలో తగినంత యోగ్యతలేకున్నా ఉంది అనుకొని గర్వంతో కన్నూ, మిన్నూ కానకుండ చరించడం చాల ఘోరమైన విషయం. పంతగింపు అనేది ఉచితమైనదే అయినా తగనిదే అవుతుంది. నాయిష్టం నాది అంటూ ఇచ్ఛాపూర్వకంగానూ, నిరంకుశంగానూ ప్రవర్తించడం మంచి పని కాదు. మనం ఎవ్వరికీ స్వతంత్రతను ఇవ్వడం లేదు. లేని స్వతంత్రతను బలవంతంగా సొంతం చేసుకొని ఉపయోగిస్తున్నాము అంటే అంతకంటే మహాదోషం వేరొకటి లేదు.

పరతంత్రంగా ఉండడంవలన మానవునిలో కలిగే సంస్కారణం (వాంఛనీయమైన పరివర్తనం) స్వతంత్రంగా ఉండడంవలన కలుగదు. ఆత్మకల్యాణం పొందడానికి పరతంత్రత ఒక విధంగా పరమోపాయం అన్నమాట. స్త్రీ తన భర్తకు లోబడి పరతంత్రురాలై ఉంటూ పాతివ్రత్య ధర్మపాలనం చేస్తే సత్వరంగా ఉద్ధరణాన్ని పొందుతుంది. ఆ పరతంత్రత నిండుగా మాత్రం ఉండాలి. కొడుకు తల్లిదండ్రులకు లోబడి పరతంత్రుడుగా ఉంటే సత్వరంగా చక్కబడతాడు. శిష్యుడు గురువునకు లోబడి పరతంత్రుడుగా ఉంటే శీఘ్రంగా వాని కార్యం సిద్ధిస్తుంది. భగవద్భక్తునకు, జ్ఞానికి, మహాత్మునకు లోబడి వారి యెడల నిండుగా శ్రద్ధ, భక్తులు కలిగి వారిని అనుసరిస్తూ పరతంత్రుడుగా ఉంటే మానవుడు క్షణంలో పరమకల్యాణాన్ని పొందగలడని చెప్పగలను. భగవానుని శరణు పొంది భక్తుడయినా, లేక మహాత్ములను శరణు పొందినా మానవుడు క్షణంలో పరమకల్యాణం పొందవచ్చును. దానిని పొందడానికి మనలో ఉన్నలోపం పాత్రత లేక పోవడం. ఆ పాత్రతను సమకూర్చుకోవడానికి కొంత సమయం పడుతుంది. అలాగే సేవకులు, గుమాస్తాలు అయినవారు తమ ప్రభువులకు, అధికారులకు అనుకూలంగా చరిస్తూ ఉంటే శీఘ్రంగా ఉద్ధరింపబడతారు. ఉద్ధరింపబడడం కోసమే అనుకూలురు కావాలి. కాని రూపాయలకోసం కాదు. రూపాయలు అభివృద్ధి చెందిన నాడు మానవునిలో భగవత్ప్రాప్తి

లక్ష్యం నిలువదు. మారిపోతుంది.

కాబట్టి యీ విషయం ఒకరి చేతిక్రింద లోబడి పని చేసేవారికి లాభదాయకం అవుతుంది. తానే పైన ఉండాలి. తన మాటయే చెల్లాలి తన శాసనమే సాగాలి అని అనుకునే వారికి ఈ విషయం శిరోభారంగా పరిణమిస్తుంది. వారికి అది కష్టం కలిగిస్తుంది. కష్టం కారణంగా, ఎవరూ పదవీత్యాగం చేయకూడదు. ఒక విధంగా కార్యాన్ని సిద్ధింపజేయాలి. అధికారాన్ని సడలించదగిన చోట సడలించాలి. సాగించదగిన చోట సాగించుకోవాలి. పెత్తనం (శాసనం) అనేది బాధ్యతతో కూడిన పని ప్రమాదాన్ని తెచ్చిపెట్టే పని. ఒకరి చేతిక్రింద లోబడి పని చేయడంలో అలాంటి బాధ ఏదీ ఉండదు. కావలసినవి అనుకూలత మాత్రమే అనుయాయిత్వం ఒక్కటే కర్తవ్యం. వేరు కర్తవ్యం ఏదీ లేదు. పెత్తనం చేసేవాని మీద తన భారమూ ఉంటుంది. చేతిక్రింద లోబడి పని చేసేవారి భారమూ ఉంటుంది. పెత్తనం చలాయించడంలో ప్రమాదం ఉంటుంది. పెత్తనదారులో అంతో ఇంతో అభిమానం ఉండడం సహజం. ఎవరైన తనను ప్రశంసిస్తే ఆ ప్రశంస పెత్తనదారుకి ఎంతో ప్రీతిని కలిగిస్తుంది. అమృతం లాగున తోస్తుంది. కాని అది విషంలాగ తోచాలి.

నేను అధికారిని, నేను ప్రభుడను అనే దురభిమానం పెత్తనదారులో సహజంగా పుట్టుకొస్తూ ఉంటుంది. ఆ అభిమానం పతనాన్ని కలిగిస్తుంది. అభిమానం అనేది ఎలాంటిది అయినా పతనకారకమే అవుతుంది. కీర్తిప్రతిష్ఠలకు సంబంధించినది కాని, పదవికి సంబంధించినది, దేశానికి సంబంధించినది కాని, జాతికి సంబంధించినది కాని, వయస్సుకి సంబంధించినది కాని, ప్రభావానికి సంబంధించినది కాని, ఏ విధమైన అభిమానం అయినా మానవుని అధఃపాతాళానికి తీసుకుపోతుంది. కాబట్టి మానవుడు సర్వవిధములైన అభిమానాలకు దూరంగా ఉండాలి. అనర్థాన్ని కలిగించేది పదవికాదు, తత్సంబంధమైన అభిమానమే మహాత్మత్త్వం అనే పదం (పదవి) మోక్షాన్ని ఇస్తుంది. తత్సంబంధమైన అభిమానం నరకాన్ని కలిగిస్తుంది. నేను భగవద్భక్తుడను అనే అభిమానం ఒకటి ఉంది. అచ్చమైన

భక్తుడు అయితే ఇది అంత అనర్థకారి కాదు. కపటపు భక్తుడు అయితే పతనం తప్పదు. నిజంగా భక్తుడైన వాని అభిమానం అంతగా నష్టాన్ని కలిగించదు. భగవానుడు వానిని రక్షిస్తాడు. ఇతరములైన అభిమానాలు ఏమైనా పతనాన్ని కలిగించేవే అవుతాయి. ఇది ఒక హెచ్చరిక అనుకోండి! పదవి ఏది కూడా పతనకారకం కాదు. ఈశ్వరపదవి లభించినా అంతే, నేను ఈశ్వరుడను అనే అభిమానం మాత్రం పతనకారకమే అవుతుంది. "ఈశ్వరోఽహమహం భోగీ" నేను ఈశ్వరుడను. నేను భోగిని అనే అభిమానం వలన ముప్పు తప్పదు. నిజానికి ఈశ్వరపదవి అన్నది చెడ్డది కాదు. ఈశ్వరపదవి ఈశ్వరునకు ఎలాగూ ఉండనే ఉంది. అది లోకకల్యాణ కారణం అయినది. భగవానుడు అందరకూ మేలును చేకూరుస్తాడు. మహాత్ములైనవారు కూడ లోకకల్యాణం కోసమే పాటుపడుతూ ఉంటారు.

# భగవానునిసేవకులు

ఎవనికైన ఉరిశిక్ష పడితే దానినుండి విడుదల పొందడానికి అతడు ఎంతగానో ప్రయత్నిస్తాడు. ఎన్నో ముఖస్తుతులు, స్తోత్రపాఠాలు, విన్నపాలూ చేస్తాడు. అనుక్షణము న్యాయశాస్త్రగ్రంథాలను పరిశీలించి తన విడుదలకు మార్గాన్ని అన్వేషించిపెట్టండి అని ప్లీడర్లను ప్రార్థిస్తాడు. అలాగే మనం ఈ సంసారం నుండి విముక్తి పొందడానికి ప్రయత్నం చేయాలి. మనమీద యమధర్మరాజు యొక్క అభియోగం సాగుతోంది అన్న విషయం. మనం మరచిపోకూడదు. అందు చేత నిరంతరం మనం విన్నపాలూ, వేడికోళ్లూ, సిఫార్సులూ సాగించుకోవాలి. ఈ శరీరం నశించడమే మనకు ఉరిశిక్ష. భవిష్యత్తులో మనకు ఇక జన్మరాకూడదు. దుఃఖాలయమైన ఈ సంసారంలో మనకు ఇక దుఃఖం కలుగకూడదు - జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్" అని భావించుకొని బాగా ముఖస్తుతులూ, ప్రార్థనలూ చేయవలసిన ఆవశ్యకత ఎంతయో ఉంది. ఎవనికైన 6 మాసాలు జైలుశిక్ష పడితే చాలు! వానికి తినుటకు తిండి, కంటికి నిద్ర కరవైపోతాయి. ఆ బాధనుండి తప్పించుకోవడానికి అతడు ఎంతగానో ప్రయత్నం చేస్తాడు. ఆ ప్రయత్నం అంతా 84 లక్షల జీవయోనులనుండి విముక్తి పొందడానికి చేయగలిగితే తప్పక విముక్తుడు అయిపోతాడు. ఇలాంటి సదవకాశాన్ని పొంది కూడ మనం ఆత్మకల్యాణాన్ని సాధించుకోలేక పోతున్నామంటే అది మనకు ఎంతో లజ్జాజనకమైన విషయం. మానవజన్మ పొంది కూడ మహాపాపాలు చేస్తున్నామంటే మనకంటె కుక్కలే మేలు. ఆ పరిస్థితిలో మనం మనలను ఛీత్కరించుకోవాలి. ఇలాంటి నికృష్టసంతానాన్ని కన్నందులకు మన తల్లిదండ్రులు కూడ ఛీత్కారపాత్రులే అవుతారు. మానవజన్మం ఎత్తి కుక్క చావు చావడం చాల సిగ్గుచేటు. తల్లి, తండ్రి ఒక బిడ్డను ఎత్తి

పారవేస్తే అదికూడ ఎందుకైన ఉపయోగపడుతోంది. కాని, నేటి మానవుడు ఎందులకునూ కొరగాకుండపోతున్నాడు.

గుర్తు ఉంచుకోండి! జనాలు ఈనాడు తీర్థయాత్రలు చేస్తున్నారు. ఒకడు నాలుగు పుణ్యాధామాలను చుట్టి వస్తున్నాడు. ఒకడు మూడు ధామాలను చుట్టి వస్తున్నాడు. ఎన్ని చేసినా వారి స్వభావము, ఆచరణలు మారడం లేదంటే జనులు వారిని నిరసించక ఊరకుంటారా? యాత్రలు చేసి వచ్చినా ప్రవృత్తులూ, ఆచరణాలూ మారని దశలో అలా జరగడం యుక్తమే అవుతుంది. నేటి జనులు యాత్రలకు ఉపక్రమిస్తే ఎక్కడా నిల్కడలేక పరుగో పరుగు అన్నవిధంగా సాగుతున్నారు. పూర్వం జనాలు తీర్థాలకు యాత్రలు సాగించేవారు. పది, పంద్రెండు రోజులు అక్కడ ఉండి భజనం, ధ్యానం, సత్సంగం, వ్రతం, దానం మొదలైన పుణ్యకార్యాలు చేసుకొనేవారు. ఆ విధంగా వారు పవిత్రతను సంతరించుకొనేవారు. ఈనాడు జనం నిల్కడలేకుండ సాగిపోతున్నారు. అందుచేతనే వారి ఆచరణాలు చక్కబడడం లేదు వారికి పవిత్రత అబ్బడంలేదు.

మనం అలాంటి వారిని చీత్కరిస్తూ ఉంటాం. మన స్వభావం కూడ అలాగే ఉంటే మనలను కూడ వారు అలాగే నిరసిస్తారు. ఇన్ని యేండ్లుగా హృషీకేశం వెళ్లి సత్సంగంలో పాలుగొంటూ వచ్చారు. భజనధ్యానాలు సాగించారు. కాని ఫలితం ఏముంది? అని వారు మనలను వెక్కిరిస్తారు. తమ ప్రవృత్తులను, ఆచరణాలను అనుసరింపగా వారికి కలిగిన పరిణామాన్ని, నష్టాన్ని చూచి అచ్చమైన భక్తితో భజనధ్యానమార్గంలో పురోగమింపగోరేవారికి తమ సాధనయందు అశ్రద్ధ, నిర్లక్ష్య వైఖరి ఏర్పడతాయి. వారు సాధన చేయడం మానుకుంటారు. మానకుంటే వారు ముక్తిని పొందగలవారే. ఈ విధంగా ఉత్తమసాధకుల సాధనకు అవరోధం కలుగుతుంది. కాబట్టి ఈ రంగంలో ముందు మానవులందరూ తమను తాము సంస్కరించుకోవలసిన అవసరం ఎంతైన ఉంది. మనలను మనం శీఘ్రంగా సంస్కరించుకోవాలి.

శరీరము, మనస్సు, బుద్ధి మన అధీనంలో ఉన్నట్టివి కదా! వానిని భగవానుని దిక్కుగా మరలించడంలో కష్టం ఏముంటుంది. మనం ప్రతి క్షణాన్ని పరిగణనలోకి తీసుకుంటూ ఉండాలి. ఒక క్షణం కూడ నిరర్థకంగా పోరాదు. అమూల్యం అయిన జీవితాన్ని గ్రుడ్డిగవ్వలకోసం వెచ్చించివేయడం ఏమంత తెలివైన పని? మానవశరీరం పొంది కూడ కేవలం బ్రదకడం కోసమే బ్రదికితే మానవులకు, పశుపక్ష్యాదులకు భేదము ఏమి ఉంటుంది? కాబట్టి వివిధ భోగవిలాసాలను కాలదన్ని ఆదినుండి ఋషులు అవలంబిస్తూ వస్తూ ఉన్న మార్గాన్నే మనం అనుసరించాలి. తగినంత ఆసక్తి ఉన్నప్పుడే ఈ పని సాధ్యం అవుతుంది. ప్రతివ్యక్తి తనను తాను భగవానుని డవాలు (బిళ్ల) బంట్రోతునని భావించుకోవాలి. అప్పుడే మనం భగవానుని రాజధానినుండి కామక్రోధాదులను శీఘ్రంగా పారద్రోలగలం. గవర్నమెంటునుండి పది, పదిహేను రూపాయల పరిమితవేతనం తీసుకొనే బిళ్లబంట్రోతు కూడ ఆవశ్యకతను బట్టి చేతులకు కాళ్లకు బేడీలు తగిలించి కోటీశ్వరుని కూడ బంధించి తీసుకొనిరాగలడు. మనం భగవానుని గృహంలో నామమాత్రపు సిపాయీలుగానైన ఉన్నవారమే. కాబట్టి మనం ఆ కామక్రోధాదులను అంతశ్శత్రువులను అనాయాసంగా అంతమొందించివేయగలం. మనలో అంత పవరు ఉంది. అయినా మనం భయపడుతున్నాము. ఈ అంతశ్శత్రువులను సంకెళ్లతో బంధించి మనం అదుపులో పెట్టుకోవాలి. ప్రభువు (ఈశ్వరుని) యొక్క ఆజ్ఞగా భావించుకొని మనం ఆ శత్రువులమీద విజయం సాధించాలి. లోకంలో మహాత్ముని ఆసరా లభిస్తే మనం ఎంత పని అయినా చేయవచ్చును. ఇక మనకు భయం ఎందులకు? అయినా మనకు భయం కలుగుతోంది అంటే అది భగవానుని డవాలుకే కళంకం అవుతుంది. కామక్రోధలోభమోహాదులు మనలను చెప్పుతో కొడుతున్నాయి అంటే ఆ దెబ్బలు భగవానునకు తగిలినవే అవుతాయి. ఎందుచేత అంటే మనం ఆ స్వామికి డవాలు బంట్రోతులం కదా? కామక్రోధాదులకు మనమే లొంగిపోయి వానిచేత

మనమే దెబ్బలు తినే పరిస్థితి వస్తే మనం ఆ విషయాన్ని మన స్వామికి తెలియజేయాలి. అప్పుడు ఆ స్వామి తన సైన్యాన్ని పంపి మనలను ఆదుకొంటాడు. మనం భగవానుని బంట్రోతులం. మనం కామక్రోధాది శత్రువుల చేత పీడించబడుతూ ఉన్నాము. అంటే అది మనకు ఎంతో లజ్జాజనకం అయిన విషయం. ఒక వైస్రాయి అతని యేలుబడిలో ఏ ఠాణాలోని అధికారిని అయినా దొంగలు పట్టుకొని చావగొట్టేరు అన్నవార్త అందితే ఊరుకుంటాడా? తగినంత బలగాన్ని పంపి ఆదొంగలను నాశనం చేయడా? కాబట్టి భగవానుని దయామయునిగా గుర్తు ఉంచుకోవాలి. అతని అండ దండలతో పరమపదం పొందడానికి సరళమార్గాన్ని ఎన్నుకోవాలి. అనుసరించాలి. తరించాలి.

# మా ప్రచురణలు (పారాయణ గ్రంథములు)
## (Our Telugu Publications)

1172 శ్రీమద్భగవద్గీత తత్త్వవివేచనీ వ్యాఖ్యానము
772 శ్రీమద్భగవద్గీత (శ్లోక తాత్పర్యములు) (పదచ్ఛేత టీకా తాత్పర్యము)
771 శ్రీమద్భగవద్గీత (శ్లోక తాత్పర్యములు)
1390 శ్రీమద్భగవద్గీత (పెద్ద అక్షరములలో శ్లోక తాత్పర్యములు)
1031 శ్రీమద్భగవద్గీత (శ్లోకతాత్పర్యసహితము) పాకెట్సైజు
1531 శ్రీమద్భగవద్గీత మరియు విష్ణుసహస్రనామ సహితము
1526 శ్రీమద్భగవద్గీత మూలము (పాకెట్సైజు) (పెద్దఅక్షరాలు)
662 శ్రీమద్భగవద్గీత విష్ణుసహస్రనామావళి సహితము
663 శ్రీమద్భగవద్గీత (వచనము)
1309 శ్రీమద్భగవద్గీత పారాయణ మహత్యకథలు
1028 గీతామాధుర్యము
1570 శ్రీమద్భగవద్గీత (అగ్గిపెట్టెసైజ్)
1571 శ్రీమద్భగవద్గీత (లఘుఆకారము)
1766 శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రము (సటీకము)
1527 శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము (నామావళి సహితము)
670 శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము (పాకెట్ సైజ్)
911 శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము (లఘుఆకార్)
1352 శ్రీరామచరితమానసము (సటీకము)
1419 శ్రీరామచరితమానసము (వచనము)
753 శ్రీరామచరితమానసము (సుందరకాండము సటీకము)

**శ్రీమద్వాల్మీకి రామాయణము**

1557 శ్రీమద్వాల్మీకి రామాయణము - పార్ట్ 1 (సటీకము బాలకాండము - అయోధ్యాకాండములు)
1622 శ్రీ మద్వాల్మీకి రామాయణము - పార్ట్ 2 (సటీకము అరణ్య, కిష్కింద, సుందరకాండములు)
1745 శ్రీమద్వాల్మీకి రామాయణమ్ - పార్ట్ 3 (సటీకము యుద్ధ- ఉత్తరకాండములు)
1477 సుందరకాండము సటీకము
1466 సుందరకాండము మూలము (డమ్మీసైజ్)
1532 సుందరకాండము వచనము (డమ్మీసైజ్)
924 సుందరకాండము మూలము (పాకెట్సైజ్)
675 సంక్షిప్త రామాయణము
1639 బాల రామాయణము (లఘు ఆకారము)
845 అధ్యాత్మ రామాయణము (సటీకము)
1632 శ్రీ మహాభారతము (విరాటపర్వము)
1741 శ్రీ మహాభారతము (ఉద్యోగపర్వము)
1573 శ్రీ మద్భాగవత మహాపురాణము (మూలము)
1738 శ్రీ మద్ భాగవత సంగ్రహము
1699 శ్రీ మహాభాగవత మకరందాలు
1767 భాగవత మాధుర్యము
908 శ్రీ నారాయణీయము (మూలము)
1698 శ్రీ మన్నారాయణీయము శ్లోకములు (తాత్పర్యములు)
676 శ్రీ హనుమాన్ చాలీసా
1502 శ్రీ నామరామాయణము, హనుమాన్ చాలీసా
1569 శ్రీ హనుమత్ స్తోత్రావళి
912 శ్రీ రామరక్షాస్తోత్రము
801 శ్రీ లలితాసహస్రనామస్తోత్రము (పాకెట్ సైజ్)
974 శ్రీ లలితాసహస్రనామస్తోత్రము (లఘుఆకార్)
1763 శ్రీ లలితాసహస్రనామస్తోత్రము (ఖడ్గమాల - త్రిశతి నామావళి సహితం)
674 శ్రీ గోవింద దామోదర స్తోత్రము

1764 గోవింద నామావళి
677 గజేంద్ర మోక్షము
732 నిత్యస్తుతి
1023 శివ మహిమ్నః స్తోత్రము
973 శ్రీ శివస్తోత్రావళి
1761 శ్రీ శివసహస్రనామ స్తోత్రము - సటీకము
1758 శ్రీ శివపంచాయతన పూజావిధి
1026 శ్రీ పంచసూక్తమ్ (రుద్రమ్)
1684 శ్రీ గణేశ స్తోత్రావళి
1024 శ్రీ నారాయణ కవచము
1754 శ్రీ లక్ష్మీసహస్రనామ స్తోత్రమ్
1025 స్తోత్ర కదంబమ్
914 స్తోత్ర రత్నావళి
930 దత్తాత్రేయ వజ్రకవచము
1685 శ్రీ దేవి స్తోత్రావళి
972 శతకత్రయము
846 ఈశావాస్యోపనిషత్ సటీకపురుషసూక్త సహితము
909 దుర్గాసప్తశతీ (మూలము)
1029 సంకీర్తనావళి
1030 సంధ్యోపాసనవిధి
910 వివేక చూడామణి
904 నారద భక్తిసూత్రములు
1714 గీతా దైనందిని

## తెలుగు కథల పుస్తకములు

665 ఆదర్శనారి సుశీల
664 సతీసావిత్రి
689 భగవానుని అయిదు నివాసస్థానాలు
766 మహాభారతములోని కొన్ని ఆదర్శపాత్రలు
768 రామాయణములోని కొన్ని ఆదర్శపాత్రలు
760 పరమోత్తమ శిక్షణ
916 నలదమయంతుల కథ
915 నీతికథామంజరి (కథలు)
641 శ్రీకృష్ణభగవానుడు
692 మధురగాథలు
919 మంచికథలు
686 భక్తఉద్ధవ
687 ఆదర్శభక్తులు
682 పంచభక్తరత్నాలు
685 బాలభక్తులు
688 భక్తధ్రువుడు
691 భీష్మపితామహుడు
767 భక్తరాజు హనుమంతుడు
917 భక్తచంద్రిక
918 సప్తభక్తరత్నాలు
929 మహాభక్తులు
1027 శ్రీహనుమత్ చరితామృతము
1572 పదుకొండు నీతికథలు
1751 మహాత్మ విదురుడు
1752 ఆదర్శకథలు
1755 మహాపురుషుల జీవితాదర్శములు
1760 ద్వాదశ జ్యోతిర్లింగ మహిమ
1765 మంచితనమునకు -మంచిఫలాలు
1757 ఆదర్శభ్రాతృప్రేమ

## తెలుగు వర్ణచిత్ర కథలు

887 జై హనుమాన్
1301 నవదుర్గ
959 చిట్టికృష్ణుడు
960 గోపాలుడు
961 మోహనుడు
962 శ్రీకృష్ణుడు
963 చిన్నిరాముడు
964 శ్రీరామచంద్రుడు
967 శ్రీమద్రామాయణములోని ముఖ్యపాత్రలు
968 శ్రీమద్భాగవతములోని ముఖ్యపాత్రలు
1686 అష్టవినాయకులు
966 సూర్యభగవానుడు
965 దశావతారములు
969 గోసేవ దాని ఫలము
971 బాలల బొమ్మల చైతన్యలీల
970 మన ప్రముఖ స్త్రీ దేవతలు
1753 శ్రీమద్ భాగవతములోని ముఖ్యమైన కథలు